Bramha Vidya Series.



శ్రీ

# బ్రహ్మవిద్య.

ఇది

ఉపనిషద్వాక్యార్థములననుసరించి

## పరమహంస

చేత

అనుభవార్థములతో వ్రాయఁబడినది.

NEW AND ENLARGED EDITION.

వెల. రూ. 1-0-0

PRINTED AT THE CHANDRIKA PRESS, GUNTUR.

1914.

## Bramha Vidya Series.




# శ్రీ
# బ్రహ్మవిద్య.

ఇది

ఉపనిషద్వాక్యార్థములననుసరించి

## పరమహంస

చేత

అనుభవార్థములతో వ్రాయఁబడినది.

NEW AND ENLARGED EDITION

వెల. రూ. **1-0-0**

PRINTED AT THE CHANDRIKA PRESS, GUNTUR.

1914

# ఓమ్

1. గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥

2. అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన తస్మైశ్రీగురవేనమః॥

3. నిత్యానందం పరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతన్నమామి॥

4. చాపంచేక్షుమయంప్రసూనవిశిఖం పాశాంకుశౌపుస్తకం
మాణిక్యాక్షసగోరుహాంమణిమయీం వీణాంసరోజద్వయం
పాణిభ్యామభయంవరంచ దధతీంబ్రహ్మాదిసేవ్యాంపరాం
సింధూరారుణ విగ్రహాం భగవతీం తాం షోడశీ మాశ్రయే॥

## AN APPEAL TO THE PUBLIC.

The public are cordially invited to draw their attention to the following books on Yoga Philosophy, Vedantism, and Ethics, whose principles are therein treated by means of beautiful and graphic narratives (in Telugu) so simple as they are within the reach of even females for whom they are specially written. It is indispensable to every Hindu family to have a copyof each of these books. As our books are printed in fine and glazed paper, in good type, and in good style, we trust our books will find among the Telugu-reading gentry, the encouragement they so richly deserve. Look sharp! Apply soon !!

It should be the look out of every gentleman to provide himself with a copy of our valuable works.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | Bramha Vidya | (New & Enlarged Edition) | Rs. | 1 | 0 | 0 |
| 2 | Bramhagnanasaram | ... ... | ,, | 0 | 8 | 0 |
| 3. | Sugnanabodhini | (Second Edition) | ,, | 2 | 0 | 0 |
| 4. | Do. Calico | ... ... | ,, | 2 | 8 | 0 |
| 5. | Bhagavthutharagita | (Second Edition) | ,, | 0 | 12 | 0 |
| 6. | Gyananjanam | ... ... | ,, | 0 | 3 | 0 |
| 7. | Vedanta Saram | ... ... | ,, | 0 | 3 | 0 |
| 8. | Bramha Bilam | ... ... | ,, | 0 | 3 | 0 |

*N. B:*—Postage Extra.

Early application is absolutely necessary.

*Please Apply to:—*

**Gollapudi Durga Prasada Rau,**

**GUNTUR.**

# PREFACE.

# పీఠిక

---

సర్వలోకాతీతంబును, సమస్తవృత్తిరహితంబును, పంచకోశాతీతంబును, అగు పరమాత్మను తెలిసికొనుటకు బ్రహ్మవిద్య ముఖ్యము. పరతత్వమునం బాసక్తి లేనిపండితుండును రెండుకాళ్లపశువె యనదగుంగాని నిశ్చయమైన పండితుండని చెప్పనొప్పదు. ఆహారము నిద్రభయము సంభోగము ననునవి పశువులకును మనుష్యులకుం గూడ సమానముగ నుండుగుణములు. పశువులకంటె మనుష్యునియందు జ్ఞానమొక్కటి యధికము. అట్టిజ్ఞానమే లేనిచో మనుష్యుండును బశువుంతో సమానుండే యగును. ఇట్టి వానినే నరపశు వని పెద్దలు పేర్కొనియున్నారు. మూఢులకు దివ్యజ్ఞానము స్వయముగ బుట్టదు సరిగదా, యితరులు మేలుగోర హితోపదేశము చేసినను లంచమిచ్చి బ్రతిమాలినను, బలవంతమున బట్టి నట్టడవికి నెట్టినను గలుగబోదు; కావున సాధనచతుష్టయసంపత్తిం గలవారై సద్గురుసేవయును సజ్జనసాంగత్యమును చేయవలయును. పెద్దలచెంతం జేరి సాధనచతుష్టయసంపత్తిం గలవారై చతుర్విధశుశ్రూషలు సేయుచు ఈషణత్రయములకు తాపత్రయములకు లోబడక అరిషడ్వర్గమును జయించినవారై మోక్షము నపేక్షించవలయును సజ్జనసాంగత్యమువలన అహంకారము నశించును. తద్ద్వారా భగవద్భక్తి కలుగును. ఎట్టివారికిగాని కోపమణచుట ముఖ్యము. బ్రహ్మజ్ఞానమును దెలుపు గ్రంథములు సంస్కృతభాషయందుండుటచేతను, సమగ్రముగ తేటతెల్లముగ దెలియంజేయు గ్రంథము తెలుగుభాషయందు లేనిలోపమున అనేకులు అజ్ఞులై యుండుటను కన్నులారంజూచి ఆలోపము

లేకుండ నందరునొక్కుమ్మడిగ బ్రహ్మవిద్యాధురంధరులు కాగలందులకు యీగ్రంథము వ్రాయఁబడెను. ఇాదు మున్ముందుగా సద్గురువు లక్షణమును, సాధనచతుష్టయసంపత్తి, తాపత్రయములు, ఈషణాత్రయములు, యజ్ఞోపవీతము, ఉపదేశము, ఉపవాసము, అష్టాంగములు, బ్రహ్మచర్యము, ఋతుకాలము, సుఖాసనము, సమాధి, మొదలుగాఁగల అనేక విషయంబులు చక్కఁగ వ్రాయఁబడెను. ఇందు ఏదోషంబులున్నను క్షమించిహంసవలెనే నీటినివిడిచి పాలనెడు మంచివాక్యములను గ్రహించెద రనినమ్మెదను. పుస్తకమును చూచినమాత్రముననే మీఅభిప్రాయమును తెలుపక సాంగముగ చదివి విశేషములను గ్రహించి ముముక్షువులై యుండకోరెద.

"*Drink deep* or *taste not* the Pierian spring."

తుదవఱకు పుస్తకమును చదివి అచ్చటచ్చటి యంతరార్థములను గ్రహించినగాని విశేషములు తెలియవు. కావున తుదముట్టఁజదివి మనస్సును స్వాధీనము చేసికొని మోక్షము నందవలయును.

ఇట్లు,

పరమహంస

CONTENTS.

# విషయసూచిక

పుట.

# అపూర్వ గ్రంథములు.

ఈ పుస్తకములు తెలుఁగు తెలిసిన సమస్తమైన పురుషులకును స్త్రీలకును బాలురకును వృద్ధులకును పండితులకును పామరులకును చక్కఁగాఁ దెలియునటులను చదువువారికిని వినువారికిని అత్యంతాహ్లాదము కలుగు నటులను మనోహరమగు మృదుశైలిని వ్రాయఁబడెను. ఇందు వేదాంతవిషయము బాగుగ తెలియఁగలదు. చదివినమాత్రముననే యెట్టిమూఢునికయినను జ్ఞానము కలుగును. సర్వజనులకును శాశ్వతమైన ఉపకారమును చేయవలెనను తలంపుతో వీనిక్రయము స్వల్పముగా యేర్పరచియున్నారము. ఈగ్రంథముల యొక్క ఉపయోగ మిట్టిదని చెప్ప నాదిశేషునికైన నలవికాదు. ఇవి ప్రతియూరను ప్రతియింటను ప్రతిమనిషికి ఉండవలసిన గ్రంథములు. స్త్రీపురుషాదులకు చదువుటకు యోగ్యమై యింతమనోహరమగు నుండు పుస్తకములు యిదివరకెక్కడను లేవని నొక్కి వక్కాణింపగలము.

## 1. సుజ్ఞానబోధిని.

పెద్దసైజు, 415 పేజీలు. రెండవకూర్పు వెల రూ. 2-0-0

కాలికో బైండుచేసినది. వెల రూ. 2-8-0.

సకల తత్వార్థవేత్తయగు శుకయోగి అగ్నిదేవునకు నుపదేశ రూపమునఁ జెప్పిన ధర్మార్థకామమోక్షములనెడు చతుర్విధ పురుషార్థములను దెలుపునట్టి అతివిచిత్రములును నీతియుక్తి చమత్కార హాస్యరసయుక్తములగు ధర్మములు. చదివిచూచినగాని యీగ్రంథముయొక్క గుణాధిక్యత తెలియదు.

యీపుస్తకములోని విషయములు పూర్తిగాఁ దెలుప వీలులేక కొన్నిమాత్రమే యీక్రింద వివరించితిమి:—చిలుకను దెచ్చి బంగారు పంజరమునందుంచుట; సేవకుఁడగు దేవదాసునిభార్య చక్కదనమును వర్ణించగా రాజువిని మోహించుట; స్వర్ణోదక సముద్రము నడుమఁ

జంద్రికయను పర్వతమందలి వెలలేని మాణిక్యములను తెచ్చుటకు దేవ దాసుని పంపుట; అఖండదీపప్రభావము, సన్యాసి రాజుభార్యనుజూచి మోహించుట, పిమ్మట వైరాగ్యము నొందుట; అడుదానికిగలసాహ సము; శివయోగి చెప్పిన ధర్మపద్ధతి; కామముయొక్క మహిమ; చా కలపడుచు బ్రాహ్మణధర్మముపదేశించి విద్యాధరుని శాపముఁబాపుట; బ్రాహ్మణకన్యకలు మానభంగమునకువెఱచి మరణించుట; బ్రాహ్మణ కుమారుఁడు దుర్వృత్తిచే దుర్గతినొందుట; భోగముది బ్రాహ్మణునికి నీతులుచెప్పుట; జితేంద్రియత్వము; శ్రీరంగములోని చంద్రపుష్కరిణి స్నానమహిమ; ధర్మార్థకామమోక్షముల స్వరూపము నిరూపించుట; బ్రహ్మచర్యలక్షణము; భార్య తనపాతివ్రత్య ప్రభావముచే భర్తనుబ్ర తికించుకొనుట; పతివ్రితమృత్యువుఁబోరాడి భర్తను బ్రతికించుకొ నుట; పతివ్రితలక్షణములు; అంకుటాలిలక్షణములు; స్త్రీలక్షణములు, పతివ్రత యముని దిరస్కరించి భర్తనుబ్రతికించుకొనుట, అత్తవారింటి కిఁ బంపునపుడు కొమార్తెకు తండ్రిచెప్పిన ధర్మములు; ద్రాక్షారా మమహిమము; పాతివ్రిత్యప్రభావము, పంచగోదావరియాత్ర, సుం దోపసుందులను రాక్షసులకథ, స్త్రీవర్ణనము, నిష్కాముఁడగు రాజకు మారుని హితబోధమువలన బ్రాహ్మణకన్యక తగినవరునిఁబడసి సుఖించు ట,శకుంతలాపరిణయము, సాముద్రిక స్త్రీపురుషలక్షణములు, పద్మినీజా తి స్త్రీలక్షణము,శంఖినిజాతి స్త్రీలక్షణము, చిత్రిణిజాతి స్త్రీలక్షణము, హస్తినిజాతి స్త్రీలక్షణము, ఇంద్రుఁడు అహల్యతోఁగూడి శాపగ్రస్తుఁ డగుట, అనసూయప్రభావము, పర్వతనారదులు కాముకత్వము నొంది మరల విరక్తి వహించుట, ప్రపంచసృష్టి, ప్రపంచ చరిత్రము, పిండో త్పత్తి, పతివ్రితాశిరోమణియయిన లోపాముద్రమహిమ, కాలస్వరూ పము, పతివ్రత పతిభక్తి గలిగి వర్తించియునించుకపరాకుపడి బల్లియైపు ట్టినవృత్తాంతము, దేశభేదవివరణముతోఁడఁ దనయం సంప్రీతిగల భార్య లను వచించినందులకై చంద్రునికి క్షయరోగము సిద్ధించుట, స్త్రీలు తెలిసికొనదగిన ధర్మములు, కృతఘ్నుని లక్షణము, రామాయణ

కథాసంగ్రహము,నవరత్నములు, కర్మవిపాకము, స్వభార్యా పరిత్యాగ దోషము, సృష్టిక్రమము, తత్త్వోత్పత్తి, పరబ్రహ్మస్వరూపనిర్ణయము, వేదవతి రావణుని దిరస్కరించి దేహత్యాగము జేయుట, జ్యోతిషమున కుప్రామాణికత, ఇల్లాండ్రకే కాక వేశ్యలకు సయితము పాతివ్రత్యమువలన సద్గతికలదనుట, నారదుండు యమలోకమునకుం బోయి నరకవాసులను ముక్తి నొందించుట, యమపురివర్ణన, తులసిబృందావనమహిమ, కార్తికమాస మాహాత్మ్యము,పుష్పగిరిమహిమ,వైశాఖమాస మాహాత్మ్యము, గయాక్షేత్రమహిమ, గంగాప్రభావము, కాశీక్షేత్రమహిమ, ప్రయాగలో త్రివేణిసంగమస్నానమహిమ, మాఘమాసమాహాత్మ్యము, పూర్వపుణ్యము సద్గతికిం గారణము; చిదంబరక్షేత్ర మాహాత్మ్యము;పంచాక్షరీమంత్రమహిమ; స్త్రీపురుషుల సాముద్రికలక్షణములు; దానముచేయనివారికిం గలుగు గతి; ఏకాదశీవ్రతము; అందులఫలము; స్త్రీలు రజస్వల లగుటకుం గారణము; ముట్టువాండ్రు నడువవలసినవిధి; శ్రాద్ధవిధానము; ద్రవ్యశుద్ధి; అశౌచవిధి; సంస్కారవిధి; వర్ణాశ్రమ ధర్మములు; గృహస్థవానప్రస్థయత్యాశ్రమ ధర్మములు; పురాణశ్రవణము; వంధ్యాస్నానవిధి; ధనార్జనపద్ధతి; సుపుత్రులంబడయుట; పుత్రగోపాలవ్రతవిధానము; మంత్రప్రకారము; న్యాసమంత్రము; వంధ్యాత్వ దోషనివారణవ్రతములు; ఉత్పాతసూచనలు; దానప్రభావము; దాయభాగక్రమము; శిక్షావిధి; మహాపాతక ప్రాయశ్చిత్తవిధి; రోగములు ఔషధములు; యుగధర్మము; జ్ఞానోపదేశము; వారుణజ్ఞానోపదేశము; భృగునితపస్సు; జనలక్షణము; బ్రహ్మపూజ; సన్న్యాసవిధి; యతిధర్మములు; వ్యాసపూజావిధానము; యోగాభ్యాసము; ఆసనములు; ప్రాణాయామము; సమాధిలక్షణము; మహావాక్యములు.

---

గొల్లపూడి దుర్గాప్రసాదరావు గారికి—గుంటూరు
అనిదరఖాస్తులు పంపవలయును.

## 2. బ్రహ్మజ్ఞాన సారము.

ఈపుస్తకమును చదివినమాత్రముననే పరబ్రహ్మతత్త్వము సాక్షాత్కరించుటకును ముక్తి గలుగుటకును సందియము లేదు. ఈ బ్రహ్మజ్ఞాన సారమును చూచితీరవలెనుగాని దాని యుపయోగమును వ్రాయనలవి లేదు. మంచి అచ్చు. 200 పేజీలు, వెల 8 అణాలు.

యీపుస్తకములోని విషయములు పూర్తిగాఁ దెలుప వీలులేక కొన్నిమాత్రమే యీక్రింద వివరించితిని:—వాల్మీకి భరద్వాజునకు జీవన్ముక్తలక్షణముఁ జెప్పుట! శ్రీరామజననము, వైరాగ్యప్రకరణము, జనకమహారాజు శుకులవారికిఁ జెప్పిన చిత్తవిశ్రాంతిమార్గము, వసిష్టమహాముని శ్రీరాములకుఁ జెప్పిన ముముక్షు ప్రకరణము, సకల జగత్తులయుత్పత్తి స్థితి లయములకుఁ గారణము మనస్సు అని చెప్పుటకు నిదర్శనము, ఆకాశజుఁడను బ్రాహ్మణోత్తముఁడు మృత్యువునకును యమునకును వివాదము పుట్టించుట, జ్ఞానస్వరూప మొక దేశమునందుండి మఱియొక దేశమును బొందునపుడు స్థిరమైన నడుమ నేదేశమును లేనిది చిదాకాశమని చెప్పుచు వివరించుట, పద్ముఁడను రాజుయొక్క భార్య లీలయను మహాపతివ్రతకు సరస్వతీదేవి ఘాంతినిగూర్చి చెప్పుట, బ్రహ్మానుసంధానము, కర్కటియను రాక్షసి విదేహరాజు నడిగెడి ప్రశ్నములు, ఆప్రశ్నములకు ఉత్తరువులు, (ఈప్రశ్నములు అత్యద్భుతములు, ఆప్రశ్నములకు సరియయిన యుత్తరువులు చక్కగా వ్రాయఁబడెను.) ఇంద్రుఁడు అహల్యను బొందిన విషయము, బ్రహ్మోపదేశము, ప్రత్యక్షముగా కనుబడెడి యింద్రజాలకుఁ డంతర్ధానమునొందుట, అఖిలవర్ణము, అజ్ఞానభూమికలు, జ్ఞానభూమికలు, ప్రపంచమంతయుమనసున జనియించునట్టుల ఆమనసునం దెయణగును—అనినిరూపించుట, శుక్రుఁడు విశ్వాచియనెడి అప్సరసనుమోహించుట, శుక్రుఁడుఅనేకజన్మములెత్తుట,అనేక వేలసంవత్సరములుగడచినపిమ్మటయమునివరము చేత పూర్వపు దేహమునందు తిరిగి ప్రవేశించుట, దామవ్యాలకటులను రాక్షసులు

దేవతులతోఁ బోరాడుట, జరామరణములులేని భీమభాస పృథుపు లుమాయచేత సృజింపఁబడుట, సృష్టిక్రమము, స్వాంతుడనురాజు వృత్తాంతమునుజెప్పి దానికి అంతరార్థమును భావమును వివరించుట, వసిష్టుఁడు రామునికుపదేశించుట, కచునికథ, జనకమహారాజు సిద్ధుల వాక్యములు వినుట, (సిద్ధులవాక్యములు గీతార్థములు, అత్యద్భుతములు.) జనకుని జ్ఞానమును వర్ణించుట, పుణ్యుఁడు పావనునికిబ్రహ్మజ్ఞానమును బోధించుట, బలిచక్రవర్తికి తండ్రియయినవిరోచనుఁడుచెప్పినజ్ఞానోపదేశము, శుక్రుఁడు బలికుపదేశించుట, ప్రహ్లాదునికి విష్ణుమూర్తి జ్ఞానముబోధించుట,గాధియనుబ్రాహ్మణుఁడువిష్ణుమాయనుగనుగొనుట,విష్ణుమూర్తిగాధికితత్వమునుబోధించుట, ఉద్దాలకుఁడు తనమనసునుతానే త్రిప్పికొనిపరమాత్మపదముంబొందుట, విశ్వామిత్రుఁడు బ్రహ్మపదమునుబొందినట్లు సురఘుననురాజు యోగపదవినిబొందుట,భాసుఁడుతనతమ్ముడగువిలాసునికుపదేశించిన ఆత్మబోధ,యోగాభ్యాసము, వీతహవ్యుఁడుబ్రహ్మపదమునుబొందుట,సరూపమనోలయము,అరూపమనోలయము, భుశుండుడనుకాకులరాజువసిష్టునకుఁ జెప్పినయోగమార్గము, బాహ్య పూజ, అంతఃపూజ, వేయియుగములయినను జెడనిమారేడుపండు,శిలయే చిత్పదమనిచెప్పుట,కృష్ణుఁడు అర్జుననకుఁజెప్పినగీతారహస్యములు, కర్కటివలెనే యాత్మతత్వము తెలిసిన భేతాళుఁడు రాజు నడిగిడిప్రశ్నములు,ఆప్రశ్నములకుఉత్తరువులు,(అత్యద్భుతముగనుండును.) త్రితలుఁడు భగీరథునకుపదేశించిన జ్ఞానమార్గము, భగీరథుఁడు రాజర్షి యగుట, యోగినియగు చూడాల దనభర్తయగు శిఖిధ్వజుఁడను రాజునకు యోగమార్గమును జెప్పుట, గవ్వను వెదకిబోగా దివ్యరత్నమబ్బుట, చూడాలయనుస్త్రీ యోగసిద్ధివలన రాజరూపమును ధరించి రాజ్యకార్యములు నడపుట, కచుఁడు తన తండ్రివలన ఆత్మబోధనెఱిగి జీవన్ముక్తుఁడగుట,మహాకర్త, మహాభోక్త,మహాత్యాగి, యోగభూమికలనభ్యసించుమార్గము, విదేహముక్తయయిన సప్తమభూమిక.

---

## 3. భగవదుత్తరగీత.

శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తి భారత యుద్ధానంతరమందు అర్జునునకు తటస్థస్వరూపలక్షణములచేత పరబ్రహ్మతత్వమును బోధించెను. ఇదియే భగవదుత్తరగీత. ఇది నాలుగధ్యాయముల గ్రంథము. ఇందు అంగన్యాస కరన్యాసములు ధ్యానము టీక తాత్పర్యములు అంతరార్థములు విశేషార్థములు అను భవార్థములు వ్రాయబడెను. ఇందు బ్రహ్మనిష్ఠ, మనోలయము, ఇండపింగళసుషుమ్నలు, అర్చిరాది ధూమాదిమార్గములు, ఖేచరీముద్ర, పంచకోశములు, షట్చక్రములు, యమాద్యష్టాంగంబులు, లక్ష్యానుసంధానము, బ్రహ్మవేత్తలు, హంసవిషయము, యోగవిషయము, ప్రణవము, ప్రాణాయామము, చిదాకాశము, ధ్యానయోగము, ఆత్మమంత్రము, హృదయకమలము, మొదలుగాగల అనేకవిషయములు తేటతెల్లముగ తెలుపబడెను. పెద్దసైజు, 124 పేజీలు, 4 అధ్యాయములు. 205 శ్లోకములు, (రెండవకూర్పు) వెల 12అణాలు. **Second Edition.**

| | |
|---|---|
| **4.** బ్రహ్మబిలము. | వెల 3 అణాలు. |
| **5.** జ్ఞానాంజనము. | వెల 3 అణాలు. |
| **6.** వేదాంతసారము. | వెల 3 అణాలు. |

ఇందు వేదాంతము, యోగము, బ్రహ్మారంధ్రము, భుజగకన్యక, షట్చక్రములు, సహస్రారము, ప్రణవము, బ్రహ్మబిలము, పరమహంస, బ్రహ్మవేత్తలు; హృత్పద్మము, పావకస్థానము, ద్వాదశస్థానము, యోగవిషయము, సాంఖ్యతారక అమనస్కంబులు, భావములు, అనుభవములు, పరబ్రహ్మతత్వము మొదలగునవి తెలుపబడెను.

# శ్రీ
# బ్రహ్మవిద్య.

---

శ్రీమద్వ్యాసపరాశరాదిముని సంసేవ్యంబు, నైర్గుణ్యమున్
నామాకారక్రియావిహీనము, చిదానందస్వరూపంబును
త్ర్యమత్ర్యాదివిశిష్టవిశ్వసమతిక్రాంతంబు, నిర్ద్వైకృత
ప్రామాణ్యంబగుచున్ వెలింగెడుపరబ్రహ్మంబె వంద్యంబిలన్.

సర్వలోకాతీతంబును, సమస్తవృత్తిరహితంబును, త్రిగుణాతీతంబును, పంచకోశాతీతంబును, అవాఙ్మానసగోచరంబును, అగుపరమాత్మను తెలిసికొనుటకు బ్రహ్మవిద్య ముఖ్యము చతుర్వేదసారం బగునుపనిషద్వాక్యార్థములను విచారణచేత పూర్వపక్ష సిద్ధాంతముల నేర్పఱచి శ్రవణ మనన నిదిధ్యాసలచేత అపరోక్ష సాక్షాత్కార స్వరూపజ్ఞానమును కలుగఁ జేయునట్టిదియె, బ్రహ్మవిద్య.

శ్లో॥ అన్యవిద్యాపరిజ్ఞాన మవశ్యం నశ్వరం భవేత్
బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం స్థిరమ్॥

ఇతరవిద్య యెంత తెలిసికొన్నను నశించునదియె. బ్రహ్మవిద్య అట్లునశింపక స్థిరమైనపరబ్రహ్మజ్ఞానమును గలిగించియాపరబ్రహ్మతోడ నైక్యమగునట్లు, అనఁగాకలిసిపోవునట్లుచేయును. అట్టివిద్యలభించుట అతిదుర్లభము. ఈగ్రంథమున దానినిగూర్చిన విశేషసంగతులు స్పష్టముగ తెలుపఁబడెను. గురువులేక యేవిద్యయును తెలియదందురు. మున్ముందుగా గురువులక్షణము తెలియవలయును.

## గురు లక్షణము.

శ్లో॥ గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః
గుణ రూప విహీనత్వా ద్గురు రి త్యభిధీయతే॥

"గు" అనఁగా గుణముల కతీతము, "రు" అనఁగా రూపముల కతీతము. కావున "గురు" శబ్దమునకు గుణరూపములు లేనిది యనునర్థమును దెలియునది. కాననే "గురువు"అనఁగా గుణరూపములులేనివాఁడు అని భావము.

ఆతఁడింక నెట్టివాఁడనిన:—

శ్లో॥ గుకార శ్చాంధకారస్తు రుకార స్తన్నిరోధకృత్
అంధకారవినాశిత్వా ద్గురురి త్యభిధీయతే॥

"గు" అనఁగా కటికిచీఁకటి "రు" అనఁగా ఆచీఁకటిని పోఁగొట్టునది. కావున గురువు అనఁగా అజ్ఞానమనెడు చీఁకటిని పోఁగొట్టువాఁడని యభిప్రాయము.

అనేకమంది గురువుల మని పేరు పెట్టుకొని వచ్చి మోసము చేయుచుందురు.

శ్లో॥ గురవో బహవ స్సంతి శిష్యవిత్తాపహారకాః
తమేకం దుర్లభం మన్యే శిష్యహృత్తాపహారకమ్॥

శిష్యులయొక్క ధనమును అపహరించెడి గురువులనేకులు గలరు; కాని శిష్యులయొక్క హృదయతాపము అనఁగా మనస్సునఁ గలిగెడు వృత్తులను హరించెడి గురువు లభించుట కష్టము.

పెద్దలను వెదకుచో జాగరూకులై వారియందలి గుణాగుణములను కడుమెలఁకువతోడఁ గనిపెట్టవలయును.

పెద్దలు:—ధనసంపన్నత, నెరసినవెండ్రుకలు, ముసలితనమును, గల వారే పెద్దలని తలంపవలదు. బాలుఁడైనను వృద్ధుఁడైనను, ధనము గలవాఁడయినను నిరుపేదయైనను, మాటలునేర్చినను నేర్వకున్నను, ఉపనిషదర్థములను జెప్పఁగలిగినను చెప్పలేక యున్నను, తదర్థములను గ్రహించి అపరోక్ష సాక్షాత్కారమును స్వానుభవమును గలవారే పెద్దలని తెలియునది. అట్టి మహాపురుషులను సేవించి వారికి చతుర్విధ శుశ్రూషలను జేయవలయును.

పెద్దరికము నభినయించుచుఁ బూజ్యులవలె నటించుమోసగాండ్రెందరో యుందురు; కావున సత్పురుషులను వారివారి చర్యలవలనఁ దెలిసికొనవలెను.

"ముఖం పద్మదళాకారమ్వచ శ్చందనశీతలమ్।
హృత్కర్తరిసమం చాతివినయం ధూర్తలక్షణమ్॥"

ముఖము తామరరేకులవలె వికాసము నొందియుండును; మాటలు శ్రీగంధమువలెఁ జల్లగనుండును; మనస్సు కత్తెరవలెఁ గ్రూరముగనుండును. ఇట్టి అతివినయము నభినయించువారే మోసకారులగుధూర్తజనులని తాత్పర్యము.

కావున సిగుణములనుబట్టి వేషధారులగు దుర్జనులను దెలిసికొని వారి సాంగత్యమును గోరక బ్రహ్మనిష్ఠాగరిష్ఠులగు పెద్దలను వెదుకవలెను. ఇట్లు నిరాకాంక్షుండును నిత్యానిత్యవస్తు వివేకయుక్తుండును సకలవిధైహికాముష్మిక భోగవిరక్తుండును శమాదిషట్క సంపత్తియుతుండును ముముక్షుతాసమన్వితుండును అగుశిష్యుఁడు నిజమైనభక్తితో వెదుకుచుండఁగను అడుగోయినతీర్థ మెదురైనట్లు పెద్దలసేవ లభించును.

"నాకు మేలుగోరు నాభక్తుఁడగువాఁడు
భక్తజనుల కేన పరమగతియు
భక్తుఁ డెందుజనినఁ బరతెంతు వెనువెంట
గోవువెంటఁ దగులు కోడెపగిది॥"

నాభక్తుఁడు నామేలుకోరుచుండును. అట్టిభక్తుని దరిఁ జేయుట నాకువిధి. కావున నతఁడెచ్చటెచ్చటికిఁ బోవుచున్న, నెదయైనయావు నాఁబోతు వెన్నాడినట్లు నే నాతని వెంబడించుచుందును.

అని భగవానులు చెప్పిరి. కావున భగవద్భక్తిగలిగి యుపాసించుచున్నచో నాముముక్షువునకుఁ దగినజ్ఞాని నాభగవానుఁడె ప్రత్యక్షముఁ జేయును. ఒకదీపమువలన నింకొకటియు దానివలన వేఱొకటియుఁ నిట్లనేకదీపములు వెలిగింపఁబడి ప్రజ్వరిల్లిన బ్రహ్మవిద్యయు శిష్యపరంపరగలలో నొకనివలన నింకొక్కనికిగాఁ బెక్కుఱచే గ్రహింపఁబడి వర్ధిల్లుచు నాహ్లాదమును గలిగించుచునని యొంది వారికిఁ గలిగిన నిర్హేతుకజాయమాన కటాక్షమువలన నట్టిజ్ఞానులు తమభక్తులకు దానినుపదేశింతురు. మఱియు క్షేత్రమును గుర్తెఱిగి విత్తనము వేసినచో మంచిఫలము నిచ్చునని తలంపునఁ గాపువాఁడు పరీక్షించునట్లు సద్గురుండును సత్పాత్రునికొఱకు వెదుకుచుండును. అట్టి పెద్దలచేతఁ జేరి సాధనచతుష్టయ సంపత్తిగలవాఁడై చతుర్విధశుశ్రూషలుసేయుచు వారినిర్హేతుకజాయమానకటాక్షమువలన తాపంబులుదీరి సత్కర్మాచరణమును వేదాంతశాస్త్రపరిజ్ఞానమును నిత్యానిత్యవస్తువివేకమును యిహాముత్రార్థఫలభోగవిరాగమును, శమాదిషట్కసంపత్తియును గలిగి అరిషడ్వర్గమును తాపత్రయములను దగ్గఱఁ జేరనీయక మోక్షము నపేక్షించుచుండునది.

శరీరేంద్రియప్రాణాదులే ఆత్మ అనెడుసంసారసాగరమును దాటించువాఁడు గురువు. శిష్యునికి గల సందేహములను నివర్తిచేసి మోక్షమార్గమును సూచించి విదేహముక్తికై వల్యము నిచ్చునట్టివాఁడేగురువు,

బోధకగురువు, వేదకగురువు, నిషిద్ధగురువు, కామ్యకగురువు, సూచకగురువు, వాచకగురువు, కారణగురువు, విహితగురువులని గురువు లెనిమిది విధములు.

అందు:—

1. బోధకగురువు:—వేదాంతశాస్త్రములయందలి శబ్దార్థములను మాత్రము చక్కఁగ బోధించు గురువు బోధకగురువు.

2. వేదకగురువు:—వేదాంత శాస్త్రములయందలి శబ్దార్థములఁ జక్కఁగ బోధించి తత్వమును దర్శింపఁజేయువాఁడు వేదకగురువు

3. నిషిద్ధగురువు:—వశ్యము ఆకర్షణము మొదలగుమంత్రముల చేత యిహలోకమందును పరలోకమందును సుఖదుఃఖముల నిచ్చువాఁడు నిషిద్ధగురువు.

4. కామ్యకగురువు:— పుణ్యకర్మములఁ జేయమనిచెప్పి పుణ్యకర్మలుచేయించి తద్వారా యిహలోకపరలోకసుఖముల నిచ్చువాఁడు కామ్యకగురువు.

5. సూచకగురువు:—వేదాంతశాస్త్రములయొక్క అంతరార్థమును దెలుపుచు జ్ఞానమును కలుగఁజేసి తద్వారా శమ దమ ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము అనుసద్గుణములను కలుగఁజేసి జ్ఞానలోకినచేయుటకు సూచించువాఁడు సూచకగురువు.

6. వాచకగురువు:—శ్రోత్రత్వక్చక్షుః జిహ్వాఘ్రాణంబు లనెడిజ్ఞానేంద్రియంబులయొక్కయు వాక్పాణిపాదపాయూపస్థలనెడికర్మేంద్రియములయొక్కయు మనోబుద్ధిచిత్తాహంకారంబు లనెడి

అంతరింద్రియములయొక్కయువిషయములగు శబ్ద స్పర్శ రూప రసగంధంబులు, వచన దాన గమనాగమన విసర్జన ఆనందము లు, సంకల్పవికల్పనిశ్చయ చంచల కర్తృత్వములు, వీటియందు వైరాగ్యమును గలిగించి శిష్యుని అంతఃకరణ నిర్విషయమగు నట్లుచేయు మహానుభావుఁడువాచకగురువు. అట్టిబోధయందే మనస్సు ఊర్ధ్వముఖవ్యాప్తియై నిర్విషయమయి యుండును.

7. కారణగురువు:—అహంబ్రహ్మాస్మి యను మొదలుగాఁగల వాక్యములను బోధించి జీవేశ్వరైక్యమును తేటతెల్లముగ దెలిపి జీవన్ముక్తియనుభవమును గలుగఁజేసిన పరమపురుషుఁడు కారణ గురువు.

8. విహితగురువు:—శిష్యునికిఁ గల సకలసంశయములను నివర్తి చేసి ఆసచ్ఛిష్యుని యేమాత్రము సందేహము లేనివానినిగా జేసి తద్వారావిదేహముక్తికైవల్యముఁనిచ్చునట్టివాఁడు విహితగురు వు. వానినే సాక్షాత్పరశివుఁడనియు చెప్పనగును. అట్టివాని వర్ణించుటకాదిశేషునికైన నలవిగాదు.

కాఁబట్టి బ్రహ్మవిద్యాప్రవీణులయొద్దఁ జేరి రహస్యములను దెలిసికొనవలెను.

## Beware ofGurus—Beware of Gurus.

కుమ్మరవాఁడు ఎంతటి తెలివిగలవాఁడయినను సాధనములైన దండము, చక్రము, మృత్తికయులేక కుండలు చేయలేనట్లు ఎంతసూక్ష్మ బుద్ధిగలవానికిని సాధనచతుష్టయసంపత్తిలేక బ్రహ్మజ్ఞానముకలుగదను.



# సాధనచతుష్టయసంపత్తి

---

నిత్యానిత్యవస్తువివేకము ఇహాముత్రార్థఫలభోగవిరాగముశమా దిషట్కసంపత్తి ముముక్షుత్వము అని నాలుగువిధములు.

అందు:—

1. నిత్యానిత్యవస్తువివేకము:—తనశరీరము, భార్య, కొడుకులు కోడండ్రు కూతుళ్లు అల్లుండ్లు అత్తమామ బావమరుదులు తల్లిదండ్రులు అన్నదమ్ములు పినతండ్రి పెత్తండ్రి పినతల్లిపెత్తల్లి యిల్లువాకిలి తోటదొడ్డి చేలుధనముధాన్యము, మేడలు మిద్దెలు బంగాళాలు, పర్ణశాలలు పసువులు పక్షులు క్రిమికీటకములు ఎలుకలు పిల్లులు కుక్కలు నల్లులు చీమలుదోమలు మొదలుగాఁ గల నేత్రములకు గోచరమగునట్టి సమస్తమున్ను బ్రహ్మవిష్ణు మహేశ్వరులనెడిత్రిమూర్తులున్ను ఇంద్రుఁడు మొదలుగాఁగల దేవతలున్ను అసత్యములనియు సత్యము విజ్ఞానము ఆనందము నిత్యము నిర్మలము లనెడిపంచలక్షణములచేత ప్రకాశించుచు రూపనామక్రియారహితమై సమస్తమునకు విలక్షణమై ప్రకాశించు పరబ్రహ్మమేసత్యమనియు నిత్యమనియుఁ దెలిసికొనుట. ఇదియె ఆత్మానాత్మవివేకము అనియు చెప్పఁబడును.

"బ్రహ్మ సత్యం జగన్మిథ్య."
"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ."
"సర్వం ఖ ల్విదం బ్రహ్మ."

ఇదియె పూర్వపక్ష సిద్ధాంతముల నేర్పఱచుట.

2. ఇహాముత్రార్థఫలభోగ విరాగము:—ఈలోకమందుండుస్త్రీలు, వస్త్రములు,నగలు, పుష్పములు చందనము అత్తరుపన్నీరు మొ

దలుగాఁగల సుగంధ ద్రవ్యములు, మేడలు మిద్దెలు యిల్లు వాకిలి తోటలు ధనము ధాన్యము ఆలు బిడ్డలు మొదలగువాని భోగములయందును పరలోకమందలి ఇంద్రపదవి మొదలుగాఁగల పదవులభోగములయందును రంభాసంభోగాదులయందును, స్వర్గవైకుంఠ కైలాసాదులయందును, కోరిక లేకయుండుట.

3. శమాదిషట్కసంపత్తి:—శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము అని ఆఱువిధములు.

(1) శమము:—మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అనెడియంతరింద్రియములను, వానివృత్తులకుఁ బోనీయక పరబ్రహ్మయం దైక్యముచేసి యుంచుట. మనస్సు వేదాంతశ్రవణమునకంటె వ్యతిరిక్తమైన విషయాదులకుఁ బోవుచుండెనేని, దానినిమఱలించి వేదాంతశ్రవణాదులయందు నిలుపుట. మనస్సును తొందరబెట్టి చెదరఁగొట్టక నెమ్మదిగా స్వాధీనము చేసికొనవలెను. దీనినే అంతరింద్రియనిగ్రహమనియుఁ జెప్పుదురు.

శ్లో॥ యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశంనయేత్ ॥
భగవద్గీత—6 అ. 26 శ్లో.

చంచలమైన మనస్సు, ఏయే విషయములయందు సంచరించుచున్నదో, ఆయావిషయములనుండి దానినిమఱలించి, ఆత్మయందు వశపఱచుకొనవలయును.

మనస్సు సంకల్పించును; అనఁగా కోరికలు పుట్టించును. బుద్ధి నిశ్చయించును. చిత్తము చలించును; అనఁగా సందేహమును పుట్టించును. అహంకారము కార్యఫల

మెట్లగునోకదా యనువిచారమున కెడమీయక మూర్ఖముతో కార్యమునుచేయించును. ఇవియె అంతరింద్రియము లనఁబడు మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, ననువాని విషయములు.

(2) దమము—శబ్దములను గ్రహించునట్టి శ్రోత్రేంద్రియము(=చెవులు), స్పర్శను గ్రహించునట్టి త్వగింద్రియము (=చర్మము), రూపమును గ్రహించునట్టి చక్షురింద్రియము (=కన్నులు), రుచులను గ్రహించెడి జిహ్వేంద్రియము (=నాలుక), సుగంధ దుర్గంధములను గ్రహించెడి ఘ్రాణేంద్రియము (=ముక్కు), అనెడి జ్ఞానేంద్రియము లైదిటిని; వచనములుగల వాగింద్రియము (=నోరు), దానప్రతిగ్రహములుగల పాణీంద్రియము (=చేతులు), గమనాగమనములుగల పాదేంద్రియము (=కాళ్లు), విసర్జనముచేయు పాయురింద్రియము (=మలద్వారము), రత్యానందముగల ఉపస్థేంద్రియము(=మూత్రద్వారము), ననెడుకర్మేంద్రియము లైదిటిని; వాని వాని వ్యాపారములకు పోనియక పరబ్రహ్మయం దైక్యముచేసి యుంచుట. ఇంద్రియములు వేదాంతశ్రవణమునకంటె భిన్నమైన విషయాదులకు పోవ యత్నించుచుండ, వానిని మఱలించి వేదాంతశ్రవణాదుల యందే నిలుపుట. దీసినే బాహ్యేంద్రియ నిగ్రహమని చెప్పుదురు. మనసు నిలిచిన నింద్రియము లన్నియు నిలుచును.

శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణంబు లనెడు జ్ఞానేంద్రియములచేత అజ్ఞుల కందఱకు మనసు సంచరించును. జ్ఞానులకు ఆజ్ఞానేంద్రియముల సహాయములేకనే మనసు

విహరించును. యోగాభ్యాసముగలవారలు జ్ఞానేంద్రియముల సహాయములేకనే వారిజ్ఞాననేత్రమువల్ల సమస్తమును చూడగలరు వినగలరు తెలిసికొనగలరు.

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఙ్గానీవ సర్వశః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥
భగవద్గీత—2 అ. 58 శ్లో.

తాబేలు, తనకరచరణాద్యవయవములను వెలుపలినుండి తనలోనికిముడుచుకొనునట్లు లెవఁడు విషయములయం దిచ్ఛగలిగియుండు తనయింద్రియములను మఱలించి,మనస్సును ఆత్మయందే యిముడ్చుకొనుచున్నాఁడో అతనియొక్కబుద్ధియె మిక్కిలిస్థిరమైనది.

(3) ఉపరతి:—సకలపాపకర్మంబుల విడిచి సకలపుణ్యకర్మంబులచే భగవంతునికిఁ ప్రీతిఁగలిగించుట.

ఉపరతి యనఁగా స్త్రీ చేయుసంభోగమని యందఱకుఁ దెలిసినవిషయమేకదా. సమస్తప్రాణులకు మనస్సు స్త్రీగా నెంచఁబడి యున్నది. అట్టి మనస్సు అధోముఖవ్యాప్తి యగునేని విషయములకు దిగును. ఊర్ధ్వముఖవ్యాప్తి యగునేని విషయములనువిడచి నిర్గుణసాక్షాత్కార పరబ్రహ్మస్వరూపమునందే నిలుచును. కావున సర్వకాల సర్వావస్థలయందును మనసునకు ఊర్ధ్వముఖవ్యాపనము నభ్యాసము చేయవలయును. అట్టియెడ నది క్రమక్రమముగ నీశ్వరునియందే నిలిచి విషయములకు పోక మానును. ఇదియె జీవేశ్వరైక్యము. అట్టు లభ్యాసమునొందిన మనస్సునకే జీవుఁడని సంజ్ఞ. మనసునుక్ర

మత్రమముగ వృత్తులకు పోకుండ నిలుపుట నభ్యాసము చేయఁగ మనసు నిలుచును. మనసు నిలిచినతోడనే స్వప్రకాశమనెడి శుద్ధతెలివి జ్ఞాననేత్రమునకు కనుబడును. ఆ తెలివికే ఆత్మజ్యోతి యనియు చిత్ప్రకాశమనియు పెద్దలు చెప్పుదురు. అదియే మూలప్రకృతి; సర్వసాక్షి. ఇట్లు మనస్సు స్వాధీనమయి ఆత్మయందు నిలిచి క్రీడించుటయే ఉపరతి. కనుక ఉపరతి యను పదమునకు ప్రపంచవ్యవహారానుసారముగ నర్థము చేయక నిజ మగు నీయర్థమును తెలిసికొని ముస్ముందు మనసునుస్వాధీనము చేసికొనవలెను. పరమార్థమందు మనసుస్త్రీగాను ఆత్మ పురుషుఁడుగాను తలంచవలెను. అభ్యాసమందు మనసునుఅనాహతచక్రమందు నిలిపి పిమ్మట నాజ్ఞాచక్రమునఁ జేర్పవలెను. దానికిటుకు తెలిసినవెనుక సుషుమ్నానాడి కాగ్రమగుసహస్రారమునకుఁజొప్పించినిరంతరసౌఖ్యము ననుభవింపవచ్చును. అంగడిలోచక్కెరయున్నదని చెప్పిన మాత్రమున విని యోగముగల్గునా? ఆచక్కెర కొని తెచ్చి తినినచోఁగదా దానిమధురము తెలియఁగలదు అట్లులే యిదియు ననుభవ వేద్యమయ్యుండు.

(చూడుఁడు—చక్రవిషయము.)

శ్లో॥ పత్రంపుష్పంఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥

భగవద్గీత—9 అ. 26 శ్లో.

ఎవ్వఁడైననేమి ప్రతిఫలమును గోరక, యొకదళమో, పూవో, పండో, నీరో, నాకు భక్తితో సమర్పించినయెడ, దాని నే నారగింతును. అని భగవానులు చెప్పిరి.

కనుక కామక్రోధలోభ మోహమదమాత్సర్యము లనెడు అరిషడ్వర్గమును దగ్గఱకుఁ జేగనీక యేపాపకృత్యములకును జోక ప్రతిఫలము నపేక్షింపక భగవదర్పితముగాఁబుణ్యకర్మంబులమాత్రమే చేయుచునుండుటయే యుపరతి. దీనినే సామాన్యముగ నరిషడ్వర్గమును జయించుట యందురు.

శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగ్రత జాగ్రత॥

కామము=కోరిక; క్రోధము=కోపము; లోభము=పిసినిగొట్టుతనము; మోహము=స్త్రీమీఁదనైనను ధనముమీఁదనైనను గలిగెడుకోరిక; మదము=ధనమువలననైనను విద్యవలననైనను గలిగెడి యంధకారము; మాత్సర్యము=ఓర్వలేనితనము. ఇవి శరీరమునందలి దొంగలు-అనఁగా అంతశ్శత్రువులు. ఇవి జ్ఞానమనెడు రత్నమును దొంగిలించును. కనుక జాగ్రతపడవలెను.

(4) తితీక్ష—ప్రారబ్ధవశమునఁ గలిగెడి సుఖమునకు సంతోషించక, దుఃఖమునకు వ్యసనపడక యేదిప్రాప్తించినను సమబుద్ధితో సహించియుండుట.

శ్లో॥యస్సర్వత్రానభిస్నేహ_స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభినన్దతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

భగవద్గీత—2 అ. 57 శ్లో.

ఎవఁడు దేహప్రాణాదులగు సర్వవిషయములలో దేనియందు నభిమానముంచక తనకుఁ గలిగిన శుభమును

గూర్చి సంతోషమునుగాని యశుభమునుగూర్చి విచారమునుగాని పొందకుండునో వానియొక్క బుద్ధియే మిక్కిలి స్థిరమైనది.

(5) శ్రద్ధ—వేదాంత శాస్త్రములయందు, గురువునందు, ఈశ్వరునియందు, బ్రహ్మవేత్తలగు పెద్దలయందు నుండు నచంచలమగు భక్తియే శ్రద్ధయనఁబడును.

(6) సమాధానము—పెద్దలవలన రహస్యములను దెలిసికొనునపుడు మనసును, యింద్రియములను, విషయములకులోఁబడనీక నిలుపుట. అనఁగా మనసును జెదరనీయక పెద్దలు చెప్పెడి రహస్యములను దెలిసికొనుటయందాసక్తితో నుండునట్లు నిలుపుటయని భావము. పెద్దలవలన తెలిసికొనినసంగతులున్ను వేదాంతశాస్త్రమందు చెప్పఁబడిన సంగతులున్ను యొకటేయని శృతి యుక్తి అనుభవములచేత మనస్సునందు సమాధానపఱచుకొనుటయే సమాధానము.

4. ముముక్షుత్వము—అగ్నిలోఁబడినవాఁడు జలమును జూడఁ బాఱెడు చందంబున సంసారారణ్యమునందలి తాపత్రియ దవానల కీలలకుఁ గమలినపురుషునికి మోక్షసుధానిధి యెచ్చట నెచ్చటననియత్యాసక్తిచేతఁగలిగినతీవ్రత్వము. సంసారతాపంబు నుదొలఁగించు సద్గురువులెవరు? సాధనములేమి? అనిచింతించుట. ఈ నాలుగుసాధనంబులును గలవారే మోక్షాధికారులు. ఈ నాలుగుసాధనములే మనస్సు అనెడిపెద్దపులిని,ఆశ యనుకృష్ణసర్పమును, కామక్రోధలోభమోహమదమాత్సర్యంబు లనెడిదొంగలను, పారదోలును. ఈ సాధనచతుష్టయ సంపత్తిలేనివారికి శ్రవణాదులచేత విజ్ఞానము యెన్నటికిని లభింపదు.

# తాపత్రయములు

1. ఆధ్యాత్మికతాపము = వాతపిత్తశ్లేష్మవికారములవలన తనయొక్క శరీరమునకును యింద్రియములకును కలిగెడిజ్వరము, తలనొప్పి, చలిజ్వరము, క్షయదగ్గు, మూలశంకవ్యాధి, గుల్మము, అతిసారము, శ్వాసము, మూత్రకృఛ్రిఘ్ను, అతిఉష్ణము, నల్లపాంపువ, అజీర్ణము, మొలలుజాడ్యము, మొదలగు వ్యాధులవలన కలిగెడి విశేషబాధలను అనుభవించుట ఆధ్యాత్మికతాపమని చెప్పఁబడును. మఱియు గ్రుడ్డితనము, మూఁగతనము, చెవుడు మొదలగునవి సంభవించినప్పుడు దేహేంద్రియాదులకు తాను వేరుగనుండియు అజ్ఞానమువలన నేను గుడ్డిని, నేను మూఁగను, నేను చెవిటివాఁడను, నేను వ్యాధిగ్రస్తుఁడనైతిని అనుకొనుచు దుఃఖించుటయును ఆధ్యాత్మికతాపమని చెప్పఁబడును.

2. ఆధిభౌతికతాపము = పంచ భూతములవలన పుట్టినటువంటి నామరూపములుగల పాములు, తేళ్ళు, పెద్దపులులు, చిరుతపులులు, సింహ్వములు, ఏనుఁగులు, గుఱ్ఱములు, దొంగలు, మనుష్యులు పశువులు, కుక్కలు, నక్కలు, అడవిపందులు, ఈఁగలు, దోమలు నల్లులు, పేలు, చీమలు, యఱ్ఱచీమలు, గండుచీమలు, పిల్లులు, త్రాగుబోతులు, ఎలుకలు, పందికొక్కులు, చెదలు పురుగులు, మొదలయిన దుష్టజంతువులవలన కలిగెడి బాధలచేత దుఃఖంచుట ఆధిభౌతికతాపమని చెప్పఁబడును. మఱియు భార్య, పుత్రులు, పుత్రికలు, మిత్రులు, సేవకులు, బంధువులు, ఆప్తులు, గురువులు, తల్లి, తండ్రి, తాత, అవ్వ, అన్నలు, తమ్ములు, అక్క-

లు, చెల్లెండ్రు, అత్త, మామ, మొదలగువారికి కలిగెడు వ్యాధులు మొదలగువానివలన తాను దుఃఖించుటయు ఆధిభౌతిక తాపమనియే చెప్పంబడు.

3. ఆధిదైవికతాపము = దైవికముగ సర్వప్రపంచమునకు అతివృష్టి అనావృష్టి సుడిగాలి ఓరుగాలి, ప్రళయగాలి, ఎండలేకపోవుట, ఎండవిశేషముగ కాయుట, గాలివాన, మంచుకురియుట, పిడుగులుపడుట, రాళ్ళవానకురియుట, చలివేయుట, మంటపప్రాకారములు గుడిగోపురములు గాలిగోపురములు జనులమీఁదఁబడుట, వెల్లువలు ప్రవాహములు వరదలు పారుటవలన జనులు నశించుట, ధరలు హెచ్చుఅయి పంటలులేక కరువుగానుండుట మొదలగునవి కలిగినపుడు తాను నిర్మలుఁడనని తెలియక లోకములకును లోకులకును యిట్టి కష్టములు కలుగుచున్నవే! నేనెట్లు బ్రతుకుదును. నాకేమి సంభవించునో? ఈకష్టము నెట్లు సహింతును. నాకేయుపాయము లేకుండ కాపాడువారెవరు? నాకుదిక్కెవ్వరు? ఈదుఃఖసాగరము నెట్లు దాటుదు నని పరితపించుచుదుఃఖించుటయేఆధిదైవికతాపముఅని చెప్పఁబడును.

ఈతాపత్రయస్వరూపముం దెలిసికొని యిది శరీరేంద్రియములకుఁగాని దీనికి సాక్షియైన తనకు లేదని యెఱుఁగువాఁడే ముక్తుఁడు. దీనిని తెలిసికొని ప్రారబ్ధవశమునఁ గలిగెడిసుఖమునకు సంతోషించక దుఃఖములకువ్యసనపడకసర్వకాలసర్వావస్థలయందునిర్గుణసాక్షాత్కారపరబ్రహ్మస్వరూపమునందే మనసును లగ్నముచేయుచునుండవలయును. మఱియు నీషణత్రయములకు లోఁబడఁగూడదు.



# ఈషణత్రయములు

1. పుత్రేషణము.—కొడుకులయందలి ఆశ పుత్రేషణము. బ్రహ్మవేత్తలతప్ప తక్కినవారందఱును "అపుత్రస్య గతిర్నాస్తి" "పున్నామ్నో నరకాత్త్రాయత ఇతిపుత్రః" "సుతులు లేనివారికి గతులు లేవు" మొదలగువచనములు చెప్పుచు వానికిఁగల నిజమైన యర్థమును దెలియక విపరీతార్థముల నూహించి పుత్రులుగలవారి కేయిహపరలోకములయందు సుఖములుగలవని పుత్రులు లేనివారికి నట్టిసుఖములు లేవనియుఁ దలంచుచున్నారు. కావున నిపుడు పుత్రులు పుట్టియుఁ బుట్టకయును దల్లిదండ్రులకు నెల్లప్పుడును దుఃఖములనే గలిగించువారైరి. పుత్రులు లేరని యందువలనఁ దమకిఁకఁ బుత్తునరకము తప్పదనియుఁ బరితపించుచుఁ బెక్కులు పొందెడు దుఃఖమును దినదినమును గన్నులారఁ జూచుచునేయున్నాముగదా? ఇఁక నాపుత్రులు పుట్టి దల్లిదండ్రులను బెట్టుకడగండ్లఁగూర్చి యించుక విచారించిచూతము. పుత్రులు పుట్టినవెనుక విద్యలేమివలనను సద్గుణసంపత్తి పట్టువడకపోవుటవలనను దల్లిదండ్రులకు దుఃఖమునే కలిగించుచుందురు. మఱియుఁ దల్లిదండ్రులు చచ్చినపిదప వారికిఁ దమపుత్రులుచేయు నుత్తరక్రియలును శ్రాద్ధతర్పణాదికములె సద్గతిని గలిగించునని మురియుచున్నారు. అదియెల్లకల్ల. నిజమేమైనయెడఁ దల్లిదండ్రులుజీవించియుండఁగాఁ బుత్రుఁడువారిపేరుచెప్పి బ్రాహ్మణులకు సంతుష్టిగ భోజనముపెట్టుచు వారికి నన్నముపెట్టనిచో నాతల్లిదండ్రులయాఁకలితీఱవలయునేకదా? అట్లుతీరునా? ఇట్లుచెప్పుటచేత శ్రాద్ధములు మొదలగునవి పెట్టుటమానవలయునని చెప్పుటకాదుసుమీ. వానివలనను ఫలముకలదు. కాని యది యా

పుత్రుని సద్గతికే కారణంబగును. ఇది నిశ్చయము. పుత్రుఁడు చేయుతర్పణాదికములవల్ల తల్లిదండ్రులకు స్వర్గలోక ప్రాప్తియగును గాని మోక్షము రానేరదు. మఱియు సనకుఁడు, సనందనుఁడు, సనత్కుమారుఁడు, నారదుఁడు, హనుమంతుఁడు, భీష్ముఁడు, మొదలగువారు పుత్రులు లేకయే సద్గతిని జెందినారు కారా? శ్రీకృష్ణునిఁగన్న దేవకీవసుదేవులు కృష్ణ నిర్యాణమునకుఁ బిదపఁ బుత్రశోకము ననుభవించియుఁ దమ సుకృతము వలన సద్గతిని జెందలేదా? కావున నీపుత్రులవలననే మోక్షము గల్గునని నమ్ముట వట్టివెఱ్ఱి. వారివారిస్వప్రయత్నములవల్లనే మోక్షము కలుగును.

పుత్రశబ్దమునకు నిజమైనయర్థ మేది యన.—పుత్ . అనెడు నరకము (అనఁగా దుఃఖము) నుండి తల్లిదండ్రులను రక్షించువాఁడు పుత్రుఁడు సంసారతాపత్రయములనెడుదుఃఖసముద్రములోనుండి రక్షించునది విజ్ఞానము: "యద్దృశ్యంతన్నశ్యం" అనునట్లు నేత్రమునకు గోచరమగునట్టి ప్రపంచము నస్థిర మనియు, బాహ్యాభ్యంతరముల యందు సర్వత్ర ప్రకాశించుపరబ్రహ్మ మొక్కటియే సత్యమనియు, నదిస్వప్రకాశమనియుఁ దనకంటె నాపరబ్రహ్మస్వరూపము భిన్నముగా లేర దనియు, ఎచట నేవంకఁజూచిన నాపరబ్రహ్మస్వరూపమే తప్ప వేఱొండు లేదనియుఁ దెలిపెడు తెలివియే విజ్ఞాన మనఁబడుచున్నది. అట్టివిజ్ఞానము కలుగుటయే పుత్రుఁడు కలుగుట. పెద్దలవలన రహస్యములను దెలిసికొని సర్వకాల సర్వావస్థలయందును శ్రవణ మనన నిదిధ్యాసలచేతను జ్ఞాన వైరాగ్యములచేతను మోక్షము నొందవలయును.

☞ సంసారము బాహ్యసంసార మనియు అంతరసంసార మనియు రెండువిధములు. బాహ్యసంసార మనఁగా భార్యాపుత్రులు చుట్టపక్కములు మొదలగువారు. అంతరసంసార మనఁగా జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అంతరింద్రియములు, వానివ్యాపారములు, అరిషడ్వర్గము, తాపత్రయములు మొదలగునవి.

మృగపక్షిమనుష్యులయందు మృగములకుఁ బుత్రేషణ మధికము. పక్షులకు దారేషణ మధికము. మనుష్యులకు ధనేషణ మధికము. అని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ధనమువలె స్త్రీలు నెంతటివిద్యఁ గలవారి నైనఁ బాప మనెడు సముద్రములో ముంచివేయుదురు.

**2.** దారేషణము.—భార్యయందలి యాశ దారేషణము. సంసారమెల్లప్పుడు దుఃఖకర మైనదియే. అట్టిసంసారమునకు భార్యయే మూలము. ఎట్లనఁగా భార్యరాకమునుపు రాకపోయె నని యొక దుఃఖము; వచ్చినచో గుణవతి కాకపోయె నని మఱియొకదుఃఖమును గల్గును. అట్లుగాక గుణవతియే యైనచో నాభార్యాభర్తలదాంపత్య సౌఖ్యమెంతయు శ్లాఘ్యముగనుండును.

శ్లో॥ కార్యేషుమంత్రీ కరణేషుదాసీ భోజ్యేషుమాతా శయనేషురంభా
ధర్మానుసారీ క్షమయాధరిత్రీ షడ్గుణ్యభార్యా కులముద్ధరంతి॥

1. కార్యవిచారణమునందు మంత్రివలె నాలోచనలు చెప్పుచు,
2. పనులయెడ దానిసపోల్కి నుపచారములు సేయుచు,
3. ఆహారము పెట్టువిషయమునఁదల్లినిమఱపించి పోషించుచు,
4. పాన్పున రంభవలెఁ గ్రీడించుచు,
5. ధర్మకార్యములపట్ల సీడకైవడి ననుసరించి నడుచుకొనుచు,
6. ఓర్పునందు భూమివంటి దెట్టి భారమునైన సహించుచు,

నీయాఱుగుణములతో నొప్పుభార్య కులము నుద్ధరించు నని చెప్పఁబడియె. ఇట్టిమహాపతివ్రత యగుభార్య లభించినను మితమైనప్రేమయే యుంచవలయుం గాని అధికానురాగము కూడదు. అట్టిచో భార్యవలని దుఃఖము కలుగనేరదు. భార్యగుణవతి యయ్యెనేని బ్రహ్మజ్ఞానమునకు భంగము కలుగదు. స్త్రీని విడిచిన యెడ సుఖమనిభ్రమను యేస్త్రీని విడువవలెనో తెలియఁజాలక యనురాగవతి యగుమహాపతివ్రతలను వదలి

కొందఱుసన్యాసము పుచ్చుకొనుచున్నారు. మఱికొందఱుభార్యయందర లికోపమునను సంసారమును భరింపలేనిలోపముననో సన్యాసివేషముల ధరించి యాయాశ్రమవిధనే తెలియక సంచరించుచున్నారు. "తలలు బోడులైనఁ దలఁపులు బోడులా?" సన్యాసాశ్రమమునుగుఱించి ముందు వ్రాయఁబడును. జందెములుత్రెంచి, నెత్తిగొరిగించుకొని, కాయగుడ్డ లుచుట్టి, దండముపట్టినంతమాత్రమున సన్యాసముకానేరదు. మనస్సే స్త్రీయని యిదివఱకుఁజెప్పియే యుంటిమికదా! ఆస్త్రీనే భార్యగనెంచి యట్టిభార్యాస్వరూపమగుమనసును వర్జించుటయే యమనస్కతయనియు నద్దియే సన్యాసమనియును బెద్దలుపేర్కొనియున్నారు. అట్టిమనసులేని యెడ నవఁగా వృత్తులు పుట్టనియెడ సన్యాసాశ్రమముననున్నను మఱి యేయాశ్రమమునందున్నను భేదభావముగలుగదు. కనుక ముఖ్యముగా వృత్తిరహితము గావలెను గాని యాశ్రమములతోఁ బనిలేదు. దారే షణము మనుజులకంటెను బద్ధుల కధికమని చెప్పియేయుంటిమి.

శ్లో॥ సత్యం మాతా, పితా జ్ఞానమ్, ధర్మోభ్రాతా, దయా సఖీ,
శాంతి పత్నీ, క్షమా పుత్రః, షడైతే మమ బాంధవాః॥

అనుపాండవగీతాప్రమాణమును బట్టి:—

1. సర్వకాలసర్వావస్థలయందును గల్లపారయనీని సత్యమేతల్లి తనయొక్కగాని మఱియొకనియొక్కగాని, ప్రాణమానము లనురక్షించుటకే చెప్పినయబద్ధమును సత్యమేయగును.
2. దృష్టికి గోచరమగు వస్తుజాతమంతయు నసత్యమనియుఁ పరబ్రహ్మస్వరూపమొక్కటియే సత్యమనియుఁ దెలియునట్టి జ్ఞానమేతండ్రి,
3. అన్యాయమునకుఁబోక, న్యాయముగాఁబ్రవర్తించుట యను ధర్మమేసోదరుఁడు,

4. సర్వభూతములయందును సమానముగఁ గనుపఱచుదయయే చెలి,

5. స్వభావసిద్ధముగా మనసునకుఁ బొందరపాటు కలిగినను దానిని విషయములనుండి మఱలించి పరబ్రహ్మానందేనిలుపుట యను పరమోపశాంతియే భార్య,

6. కష్టనిష్ఠురములెన్ని గల్గిన నోర్చియుండుట యనుక్షమయే పుత్రుఁడు,

ఈ యాఱుగుణములు గలవాఁడే జీవన్ముక్తుఁడు. అట్టిపరమోపశాంతికలిగినయెడ నగ్నిసాక్షిగా వివాహముచేసికొన్న భార్యవలని సుఖదుఃఖములు తనను బాధింపవు. కనుక భార్యనుత్యజించి సన్యాసము తీసికొనుటవలనిలాభము లేదు.

☞ పరమోపశాంతి యనెడుభార్యతోఁ గూడి క్రీడించుచు బ్రహ్మానందమనెడు తూగుటుయ్యెలపైఁ దూగుచుండిననే ముక్తుఁడగునుగాని త్వక్కు, చర్మము, మాంసము, నెత్తురు, మేధస్సు, అస్థి, మజ్జయనెడు సప్తధాతువులతోడనుగూడి జననమరణాదులకునికిపట్టును మలమూత్రముల కిరవునగుశరీరము గలభార్యతోఁ గ్రీడించిన ముక్తి కలుగనేరదు మూత్రద్వార మనెడుమట్టుకొంపయందుఁ గ్రీడించుచు నందలి యల్పసుఖమున కాశపడక తైత్తిరీయోపనిషత్తునందుఁ జెప్పఁబడినచొప్పున "సేంద్రయోనిః" అనుశ్రేష్ఠమయినదియు, నెడతెగనిసుఖమునిచ్చునదియు, బ్రహ్మస్వరూపప్రాప్తికి, మార్గమైనయోనియందు రమించి యాసుఖమును బుద్ధిమంతులు తెలిసికొనవలెను.

3. ధనేషణము:—ధనమందలి ఆశ. "మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమోనమః" అనునట్లుధనమువలనఁ దల్లికిని బిడ్డకును విరోధము కలుగును. దుఃఖమును కలుగును. అట్టిదుఃఖముకలిగినను ధనమే సంపాదింపవలెనన్న:—

శ్లో॥ అర్థానా మార్జనే దుఃఖ, మార్జితానాం చ రక్షణే,
ఆర్జితాంచ వ్యయే దుఃఖం, ధి గర్థం దుఃఖభాజనమ్॥

అనఁగా ధనమును సంపాదించుటయుం దొకదుఃఖము. సంపాదించినధనమును గాపాడుకొనుటయుం దొకదుఃఖము. కష్టపడి సంపాదించినధనమును ఖర్చుచేయుటయుం దొకదుఃఖము.

కావున నిట్టిదుఃఖహేతు వగుధనముమీఁద పామరులవలె జ్ఞానులు ఆశనుంచక దానిరాకకు నానందింపక, పోకకు దుఃఖింపక, తా ననుభవించుచు, సత్పాత్రులను గుర్తెఱిఁగి, దానములు చేయుచు, సర్వకాలసర్వావస్థలయందును దృష్టికలిగియుందురు. కావున సద్గతికి జ్ఞానము కారణముగాని, ధనము కారణము కాదు. ధనమువలనఁ బ్రాణహానియు మానహానియును గలుగును. కనుక దుఃఖములకుఁ గారణమైన ధనముపై మక్కువ యుంచక పరబ్రహ్మజ్ఞాన మనెడుమహాధనము నార్జించువాఁడే ముక్తుఁడు.

## రాగద్వేషాదులు

రాగము ద్వేషము కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము ఈర్ష్య అసూయ డంభము దర్పము అహంకారము నని పదుమూఁడు విధములు.

అందు:—

1. రాగము—అన్యస్త్రీలయందు కోరిక గలిగి యుండుట రాగమని చెప్పఁబడును.
2. ద్వేషము—తన కపకారము చేయువానికి తిరిగి అపకారము చేయవలె ననెడి బుద్ధియే ద్వేషమని చెప్పఁబడును.
3. కామము—అనఁగా కోరిక. స్త్రీలు ధనము ధాన్యము యిల్లు వాకిలి తోట దొడ్డి చేను మొదలగునవి విశేషముగ సంపాదించవలయు ననియు కొడుకులు కోడండ్రు కొమార్తెలు

అల్లుళ్లు మొదలుగాఁగలవారు కలుగవలయు ననియు అందరి లోను తాను అధికముగా నుండవలయు ననియు మొదలు గాఁగల మితిలేనికోరికలు గలిగియుండుట కామము.

4. క్రోధము—తనమాట కెదురాడువానిపై తాను చేయునట్టిపను లను ఆక్షేపించువానిని దండించవలె ననెడిబుద్ధియే క్రోధ మని చెప్పఁబడును.

5. లోభము—తనకు దొరికినదానిని పరుల కివ్వగూడ దనెడిబుద్ధి. పూర్వజన్మయందు తాను చేసికొనిన సుకృతముకొద్ది తనకు లభించిన ద్రవ్యములో కొంచమయినను ధర్మముచేయుట యందును పరుల కుపకారము చేయుటయందును అసూయత గలబుద్ధి. దీనినే లోభమని చెప్పుదురు.

6. మోహము—భార్య బిడ్డలు ధనము ధాన్యము యిల్లు మొద లగువానియందుఅమితమైన ప్రేమ గలిగి వాటి రాకకు సంతోషించుచు పోకకు దుఃఖించుచు యుక్తాయుక్తములను దెలియక ఆమోహముచేతనే నిండి నిబడీకృతమై కప్పబడి యుండుట.

7. మదము—సకల సంపదలు గలిగి గర్వముచేత తానేమిచేసినను చెల్లు ననెడిబుద్ధి. దీనినే మదము అని చెప్పుదురు. కులమదము, బలమదము, ధనమదము, యౌవనమదము, రాజ్యమదము, రూపమదము, విద్యామదము, తపోమదము, అనియెనిమిది విధములుగలపదములు.

8. మాత్సర్యము—ఇతరులు తనకంటె అధికముగా ఐశ్వర్యము బలపరాక్రమములు చక్కఁదనము ముఖవర్చస్సు విద్యా విశేషము ధనము సంపత్తులు గలవారై యుండెనేని అట్టి వారినిఁ జూచి ఓర్వలేక వారికి చెరుపు చేయవలెనని వారిని చంపవలెనని యుండెడిబుద్ధి. ఇదియే మాత్సర్యము.

9. ఈర్ష్య — పూర్వజన్మయందు తాను చేసికొనిన పాపముయొక్క ఫలముగా యీజన్మమందు తాను కష్టములను అనుభవిస్తూ తనవలెనే యితరులును కష్టపడవలయు ననెడిబుద్ధి. దీనినే ఈర్ష్య యని చెప్పుదురు.

10. అసూయ — పూర్వజన్మమందు తాను చేసికొనిన పుణ్యము యొక్క ఫలముగా యీజన్మమందు తాను సుఖము అనుభవిస్తూ తనవలెనే యితరు లందఱు సుఖపడ గూడదు. వారందఱు కష్టపడవలయు ననెడిబుద్ధి. ఇదియె అసూయ అని చెప్పఁబడును.

11. దంభము—తనను అందఱు భూషించవలెను. అందఱు మెచ్చుకొనవలెను అనెడిబుద్ధియే దంభ మనఁబడును.

12. దర్పము—అన్ని పనులు తనచేత నగును. అన్నిటియందు తాను శక్తిగలవాఁడను. యితరులచేతఁ గాని యెట్టిపని నయినను తాను చేయఁగలను తనతో సమానుఁడు లేడు అనెడిబుద్ధి. దీనినే దర్ప మని చెప్పుదురు.

13 అహంకారము—యితరులను బెదరించుచు కేకలు వేయుచు మదగర్వము చేత కనుగానక సంచరించెడిబుద్ధియే అహంకార మనఁబడును.

Note:—ముముక్షువులు యీదుర్గుణముల కెడమివ్వక గురువులను పెద్దలను సేవించుచు వేదాంతశాస్త్రములను చదువుచు పెద్దలవద్ద శ్రవణము చేయుచు వారివలన రహస్యములను తెలిసికొనుచు నుండవలయును.

ఇట్లు సాధనచతుష్టయ సంపత్తిగలవాఁడై, తాపత్రయములకు నీషణత్రయములకు రాగద్వేషాదులకు లోబడక, గురువును వెదుకవలెను.

గురువును వెదకుచో జాగరూకులై వారియందలి గుణాగుణముల నుకనుమొలఁకువతోడఁ గనిపెట్టవలయును. కొందఱు కొందఱు కట్టడిగా యేర్పరచి వారు కోరినంత ద్రవ్యమును యివ్వనియెడల ఉపదేశము చేయ మనియు వారికి తృప్తిగ ద్రవ్యమును యిచ్చినచో ఆ యా గురుదక్షిణ యొక్క అల్ప ఆధిక్యతలననుసరించి శిష్యునికి బోధించెద మనియు చెప్పుదురు. ఇదియే కలికాలపు గురుశిష్యన్యాయ మని తలంచవలెను. అట్టి మహనీయుల చెంతఁ జేరక బ్రహ్మనిష్ఠాగరిష్ఠు లగు పెద్దలను వెనుకవలెను. తనను దాను తెలిసికొనెడు విజ్ఞానము పశువులకు లేదు; కనుక వారికి ముక్తి లేదు. మనుజునకు జీవితకాలము బహుస్వల్పము. అందు సగము కాలము నిద్రక్రింద హరించును. కడనుసగము నుదరపోషణార్థమై యుండును. తేపుతేపని జరిపినచో వ్యర్థమగుం గనుక ప్రతినిముషమును సద్వినియోగము చేయవలయును.

శ్లో॥ ఆశయా బద్ధతేలోకే కర్తణా బహుచింతయేత్
ఆయుఃక్షీణం నజానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

లోకతోడనే ప్రపంచమున్నది. దిన దినమునకు ఆయువు క్షీణిస్తున్నది. ఆకారణమువలన ఆలస్యము చేయక జాగ్రతపడవలెను. పెద్దల చెంతఁజేరి యపరోక్షజ్ఞానమును దెలిసికొని ముక్తి నొందవలయును.

అనేకజన్మార్జితపుణ్యవిశేషమువలనఁ గర్మయోగ మవసరము లేకయే జ్ఞానము కలుగును. అట్లు కల్గనివారు కర్మములు చేయవలయును.

కర్మమూఁడు విధములు :—

1. తమోగుణ సంబంధమగుకర్మ = చేయఁదగును, తగదు, అను విచారణలేకయే పుణ్యపాపకర్మలను జేయుటయే తమోగుణసంబంధ మగుకర్మ యని చెప్పఁబడును.
2. రజోగుణ సంబంధమగుకర్మ = పుణ్యకర్మలనె వానిఫలములను గోరుచు నొనరించుటయే రజోగుణ సంబంధ మగుకర్మ యని చెప్పఁబడును.

8. సత్వగుణసంబంధమగుకర్మ=కర్మఫలమును గోరక పుణ్యకర్మలను జేయుట. ఇదియెనిష్కామ్యకర్మము. నిష్కామ్యకర్మవలన సులభముగ ముక్తికలుగ నేరదు.

ధ్యానము,తపస్సు,ప్రాణాయామము, నిష్కామ్యకర్మము—వీనివలన జ్ఞానముకలుగును. జ్ఞానమువలన ముక్తికలుగును. సూర్యోదయము కాఁగానే చీఁకటిపోవునట్లు జ్ఞానోదయము కాఁగానే యజ్ఞానాంధకారము నశించును.

శ్లో॥ అపి చే దసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సన్తరిష్యసి॥
భగవద్గీత 4 అ. 36 శ్లో.

పాపము చేసినవా రందఱిలోనను ఘోరపాపివై, పాపకూపారమునఁగూలియున్నను జ్ఞానమనెడుతెప్పకొయ్యను సంపాదించితివేని దానినిదాఁటగలవని తాత్పర్యము.

కాన నెట్టిమహాపాపములైనను జ్ఞానాగ్నిచేతదహింపఁబడును.నిష్కామ్యకర్మవలన ముక్తిలేకపోయినను మనసునందలికోరికలనెడు మాలిన్యము రహితమగును.

## బ్రాహ్మణులు

సత్వగుణము, రజోగుణము, తమోగుణము ననునీత్రిగుణములయొక్కయు అల్పత్వాధికత్వములచేతజాతిభేదమేర్పడెను గానిఅన్యము కాదు.

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥
భగవద్గీత—18 అ. 41 శ్లో.

అనువాక్యముచేత శ్రీకృష్ణభగవానులు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులవ్యాపారములు స్వభావసిద్ధములైనగుణములచేతనే విభజింపఁబడెనని యుపదేశించియున్నారు.దానివలన శుద్ధసాత్వికమే బ్రాహ్మణ్య

మని తేలుచున్నది. అహంకారమున కెడమీయక, రాజసమునుపొందక, మలినసాత్వికగుణమునుజెందక శుద్ధసాత్వికమునే ప్రధానముగా గ్రహించి సత్వగుణసంపన్నులై కోపములేక యుండువారే బ్రాహ్మణులని చెప్పఁబడుదురు.

"యఃకశ్చిదాత్మాన, మద్వితీయం, జాతిగుణక్రియాహీనం, షడూర్మిషడ్భావేత్యాదిసర్వదోషరహితం, సత్యజ్ఞానానందానంతస్వరూపం, స్వయం, నిర్వికల్ప మశేషకల్పాధార, మశేషభూతాంతర్యామిత్వేన వర్తమాన, మంతర్బహి శ్చాకాశవ దనుస్యూత, మఖండానందస్వభావ, మప్రమేయ, మనుభవైకవేద్య, మపరోక్షతయా భాసమానం, కరతలామలకవ త్సాక్షా దపరోక్షీకృత్య కృతార్థతయా కామరాగాదిదోషరహిత, శ్శమాదిసంపన్నో, భావమాత్సర్యతృష్ణాశామోహాదిరహితో, దంభాహంకారాదిభి రసంస్పృష్టచేతా, వర్తతే; ఏవముక్తలక్షణో య స్స ఏవ, బ్రాహ్మణః."

వజ్రసూచికోపనిషత్.

బ్రాహ్మణుఁ డన నెట్టివాఁ డనిన—జాతిసత్వరజస్తమోగుణములు క్రియలు లేనివాఁడును, ఆఁకలి దప్పి శోకము మోహము ముది మరణము ననెడు షడూర్ములులేనివాఁడును, 'అస్తే జాయతే వర్ధతే పరిణమతే అపక్షీయతే వినశ్యతే'యనఁగా (పిండరూపమున) నుండుట పుట్టుట పెరుగుట మూఱుట చిక్కుట నశించుటయనునాఱుభావవికారములును లేనివాఁడును,సత్యజ్ఞానానందములే స్వరూపముగాఁగలవాఁడును, అంతములేనివాఁడును,స్వప్రకాశము గలవాఁడును, మార్పులేనివాఁడును,సమస్తకల్పములకు నాధారభూతుఁడును, వ్యాప్తిచేత సమస్తభూతములకు నాత్మస్వరూపమున లోపలసంచరించుచుండువాఁడును,సమష్టిమీఁదసమస్తమందు నాకాశమువలె లోపలను వెలుపల నేకరీతిగా నెఢము గన్పడ

నీయక క్రియుండు వాఁడును, కాలావధి లేక ... బ్రహ్మా నందమే స్వరూపముగాఁ గలవాఁడును, మితి వట్టుటకు నలవి కానివాఁడును, అనుభవముచేతనే తప్ప నింకొకవిధమునఁ దెలిసికొన వీలు లేని వాఁడును, పరోక్షముగాకుండఁ బ్రత్యక్షముగాఁ బ్రకాశించువాఁడును, అగుపరబ్రహ్మమును స్పష్టముగఁ బ్రత్యక్షము చేసికొని ధన్యత్వమును బొందుటచేతను కామము మొదలగుదోషములులేక శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానములనెడు షడ్గుణములతో నొప్పుచు భావము ఆశ మాత్సర్యము తృష్ణ మోహము మొదలుగాఁగలదోషము లులే దంభము అహంకారము మొదలగుదుర్గుణములను చిత్తమునకంటనీక సంకల్పరహితుఁడై, యద్వితీయుఁడై యుండునాతఁడే బ్రాహ్మణుండు.

"జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః
వేదపాఠంతు విప్రానాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః॥"

పరబ్రహ్మజ్ఞానమును దెలిసినవారే బ్రాహ్మణులు.

"అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా
దాసం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణా నామకల్పయత్॥"

చదివించుట, చదువుట, యజ్ఞముచేయుట, యజ్ఞము చేయించుట, దానమిచ్చుట, దానముపుచ్చుకొనుటలను షట్కర్మాధికారులు బ్రాహ్మణులు.

అట్టివారియొక్క షట్కర్మలు.

1. చదువుట—సర్వకాల సర్వావస్థలయందు పరబ్రహ్మస్వరూపమందే మనసును మగ్నతచేసి విషయములకు పోనీక నిలువుట.
2. చదివించుట—తీవ్రమోక్షేచ్ఛ గలశిష్యునకు విశదముగ చెప్పి అనుభవమును గలుగ జేయుట.

3. యజ్ఞముచేయుట.

"తస్యైవంవిదుషో యజ్ఞస్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ శరీర మిధ్మ మురో వేదిర్లోమాని బర్హి ర్వేదశ్శిఖా హృదయం యూపః కామఆజ్యం మన్యుఃపశు స్తపోగ్నిః శమయితా దక్షిణా వాగ్ఘోతా ప్రాణఉద్గాతా చక్షురధ్వర్యు ర్మనోబ్రహ్మ శ్రోత్రమగ్నీ న్యావద్ధ్రియతే సాదీక్షా."

తైత్తిరీయోపనిషత్.

యజ్ఞమునకు కర్త ఆత్మ.

దేవుఁడుకలఁ డనెడుబుద్ధియే భార్య.

శరీరమే సమిత్తు.

వక్షస్థలము యజ్ఞవేదిక.

వెండ్రుకలు అనఁగా వృత్తులు దర్భ.

శిఖ—స్వప్రకాశముగావెలిగెడు తెలివియే వేదము.

హృదయము = ఏ తెలివివల్లనైతే సమస్తమును చూస్తున్నామో వినుచున్నామో తెలిసికొనుచున్నామో అట్టి తెలివి యుండెడి స్థానము. ఇదియే పశువునకు కట్టుకొయ్య.

సంకల్పము నెయ్యి.

అహంకారము పశువు.

తపస్సు--మనసును విషయములకుఁ బోనీక నిలిపియుంచుట. ఇదియె అగ్ని.

శాంతికలుగుట.-- అంతరబాహ్యములయందు సర్వత్ర పరబ్రహ్మస్వరూపముకంటె అన్యమేమియు లేదనియు తానును పరబ్రహ్మస్వరూపమనియు తెలిసికొనుట --ఇదియె యజ్ఞదక్షిణ.

వాక్కు ఋత్విక్కు.

ప్రాణము ఉద్గాత.

నేత్రము అధ్వర్యుఁడు.

మనస్సు బ్రహ్మ.

శ్రోత్రమగ్నులు.

యజ్ఞదీక్ష—మనసును విషయములకుఁ బోనీయక సంకల్ప వికల్పములు కలుగనీయక సర్వకాలసర్వావస్థలయందును ఆపరబ్రహ్మస్వరూపమందే మగ్నత జేసియుంచుట.

4. యజ్ఞమును చేయించుట—తీవ్రమోక్షేచ్ఛ గలశిష్యునకుఁ దెలియఁ జెప్పి తానుదగ్గఱనుండి ఈఆత్మయజ్ఞమును జేయించి శిష్యుని సమాధానపఱచుట.

5. దానమిచ్చుట—ఒకనికి విద్యను జెప్పుట.

6. దానమును తీసికొనుట—శిష్యులవద్దనుండి ఎఱుక యనెడుఅజ్ఞానము నుతీసికొని వారినిపరబ్రహ్మస్వరూపజ్ఞాన సంపత్తికలవారినిగాఁ జేయుట.

ఇట్టి షట్కర్మాధికారులే బ్రాహ్మణులని చెప్పవలయును. ఈజాతిభేదముస్థూలశరీరమునకేగాని శరీరత్రయవిలక్షణుఁ డగునాత్మస్వరూపమైన తనకు లేదని యెఱుఁగునది.

"నశిఖాం నవపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః
బ్రహ్మసూత్రమిదం జ్ఞేయం సూత్రంనామ పరంపదం
తత్సూత్రం ధారయేద్యోగీ సవిప్రో వేదపారగః॥"

బ్రహ్మోపనిషత్.

పెద్దలు శిఖాధారణము ముండనము ముఖ్యము లని తలంచక వెలుపలి యజ్ఞోపవీత ధారణము వ్యర్థమనియు బ్రహ్మసూత్రధారణమే ముఖ్యమనియు తలంచెదరు. అట్లు బ్రహ్మసూత్రమును ధరించినవాఁడే బ్రాహ్మణుఁడు. అట్టివారినే బ్రాహ్మణులనియు వేదములను తుదముట్టఁ

జదివినవారనియు చెప్పవలయును. ఈకాలమందు కొంతమంది శాలువలువేసుకొని సాంగాధ్యయనపరులమని తలంచెదరు. అర్థజ్ఞానములేక చిలుకలవలె నేర్చుకొని చిలుకపలుకులవలె పలుకుటవలన ప్రయోజనమేమియు లేదని వారికి తెలియదు కాబోలు. అట్టివారు స్వాభిమానమును మాని యింతటనయిన ఆవాక్యములయొక్క యర్థమును పెద్దలవలన తెలిసికొనుట యుక్తము.

జీవుఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. శరీరము బ్రాహ్మణుఁడు కాదు. జ్ఞానము బ్రాహ్మణుఁడు కాదు. లేడివలనఁ బుట్టినను ఋష్యశృంగమహాముని తన బ్రహ్మజ్ఞానముచేత బ్రాహ్మణుఁ డనిపించుకొనెను; కుశ (=దర్భ) వలనఁ బుట్టిన కౌశికుఁడు, నక్కవలనఁ బుట్టిన జంబుకమహాఋషి, పుట్టవలన పుట్టిన వాల్మీకి, కుంభమునుంచి పుట్టిన అగస్త్యమహాముని యింద్రుని సభలోనుండు దేవతానాట్యస్త్రీయగు ఊర్వసికిపుట్టిన వసిష్ఠమహాముని, బెస్తవానికూతురికి పుట్టిన వ్యాసులు—వీరందఱు వారివారి బ్రహ్మజ్ఞానముచేత బ్రాహ్మణులనియు బ్రహ్మజ్ఞులనియు చెప్పఁబడిరి. కావున ఆత్మావలోకన చేయునట్టివాఁడే బ్రాహ్మణుఁడు అని చెప్పనగును.

"య దక్షరం పరంబ్రహ్మ తత్సూత్ర మితి ధారయేత్"

బృహోపనిషత్.

అక్షరమగు పరబ్రహ్మమెద్దియో యదియె యజ్ఞోపవీతమని ధరించవలెను.

"తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః"

బ్రహ్మోపనిషత్.

యజ్ఞోపవీత మగునాసూత్రమును అపరోక్ష సాక్షాత్కార స్వానుభవముచేత నెవఁడుస్పష్టముగాఁ దెలిసికొనునో యాబ్రాహ్మణుఁడే వేదములను దుదముట్టఁ జదివినవాఁ డగును. అట్టివారినే బ్రాహ్మణు లని చెప్పవలయును.

<u>యజ్ఞోపవీతము.</u> మూఁడుసూత్రములు బ్రహ్మముడియుఁ గలదియజ్ఞోపవీతము. ఒక్కసూత్రమునకు మూఁడు అంతరసూత్రములును, ఒక్కయంతరసూత్రమునకు మూఁడుపోగులునుండును. కావునయజ్ఞోపవీతమునకు 27 పోగులగును.

ఓం=అ+ఉ+మ్. ఇవిమూఁడును పెద్దపోగులు లేక సూత్రములు;

భూః, భువః, సువః—ఇవి మూఁడును అంతరసూత్రములు;

| | |
|---|---|
| తత్సవితుర్వరేణ్యం ...... <br> భర్గో దేవస్య ధీమహి ...... <br> ధియోయోనః ప్రచోదయాత్ | ఇవి మూఁడును మూఁడుపాదములయి ప్రతియంతర సూత్రమునకును బోగులుగ నేర్పడును; |

వీని సంపుటీకరణమే బ్రహ్మముడి. అదియే గుణసామ్యావస్థ.

☞ యజ్ఞోపవీతమందలి మూఁడు పోగులు ఇడ పింగళ సుషుమ్నలనియు బ్రహ్మముడియే త్రికూటస్థానమనియు త్రికూటస్థానమునువదలి సహస్రారమందుండుటయే సన్యాసమనియు తెలిసికొనుఁడు.

☞ నక్షత్రములు 27 చంద్రుని భార్యలు అని ప్రతీతి. ఈ 27 ను యజ్ఞోపవీతమునకు 27 పోగులనియు, బ్రహ్మముడియే చంద్రుఁడనియు, ఈచంద్రునివలననే కామము వృద్ధి యనియు, కామము లేనియెడమనస్సు వృత్తిరహితమనియు, అదియ సన్యాసమనియు తలఁచవలెను.

☞ రామాయణము 7 కాండలును 24000 శ్లోకములును గలది. ఒక్కొకవేయిని మొదటిశ్లోకము ఒక్కొకగాయత్రి మంత్రాక్షరముతో ఆరంభింపఁబడి యుండుటనుబట్టి రామాయణము గాయత్రి రూప మని చెప్పుదురు.

ఇట్టియజ్ఞోపవీతమును త్యజించుటయే సన్యాసము. అట్టిసన్యాసికి గుణములు లేవు సంకల్పమును లేదు. తలను బోడి చేయించుకొన్నంత మాత్రముననే సన్యాసము కానేరదు. సంకల్పరాహిత్యము కావలెను కోరిక పుట్టక యుండవలెను. కామక్రోధలోభమోహమదమాత్సర్యములు లేక

యుండవలెను. శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానము నను షడ్గుణములయుసంపత్తి కలిగియుండవలెను. అట్టివాఁడే యాశ్రమము నందున్న నేజాతియందున్నను బ్రాహ్మణుఁడనియే చెప్పవలయును. నిష్కామకర్మయే చేయుచుండ వలయును.

> "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గం పథ స్తత్కవయో వదన్తి."
>
> కఠోపనిషత్.

బ్రహ్మవిద్యాప్రాప్తికి మార్గము బహుకష్టమని పెద్దలు చెప్పుదురు. కనుక నోజీవుఁడా యజ్ఞానాంధకార మనెడునిద్రనుండి లేచి జాగ్రతఁ గలవాఁడవై యపరోక్షసాక్షాత్కారస్వానుభవముచేతనిత్యతృప్తులై బ్రహ్మానందమనెడుసముద్రమునందు మునిఁగి యుండు పెద్దలయొద్దికిఁబోయి, యాత్మతత్త్వమును దెలిసికొనుము. సానఁబెట్టినమంగలకత్తి యెంత యంచును గలిగి యుండుటచేత నెట్లు తాకుటకు శక్యముగాక యుండునో యట్లే పరబ్రహ్మజ్ఞానమును దుర్గమముగా నుండును. అట్టికత్తిపోటు తగిలిన యవయవము తెగునట్లులే పరబ్రహ్మజ్ఞానోదయము కలిగినవానియహంకారమును దెగి నశించును. అహంకారముతోడనే యహంభావమును నశించును. అనఁగా నపరోక్షసాక్షాత్కారము స్వయముగ ననుభవమునఁగుదురఁగనె యాపరబ్రహ్మముం దైక్యము కలుగునని భావము.

భూతఅద్దము (lens) యెండలోఁ బెట్టి క్రిందగుడ్డపెట్టిన సూర్యకిరణములయొక్క సంపుటీకరణమే గుడ్డనుగాల్చుట చూచుచున్నాముగదా! సూర్యకిరణము లెట్లు పలుదెసలకు వ్యాపించుచుండునో యట్లే మనస్సు ననేకవృత్తులకుఁ బాఱుచుండును. దానిని వృత్తిరహితము

(Concentrate) చేసినఁ గలుగునట్టి జ్ఞానాగ్నివలన సంచితమగు నజ్ఞానము కాలిపోవును. పూర్వుల కందఱకు జ్ఞానచక్షుస్సు కలిగి యుండుట చేత భూతఅద్దము మొదలుగాఁగల వస్తువులు లేకపోయినను వారి జ్ఞాన నేత్రముచేత నక్షత్రములను జూడఁ గలిగి వుండిరి. అన్యదేశసమాచారములను తెలిసికొనిరి. ఇదియే జ్ఞాననేత్రము ఇదియే త్రినేత్రము; ఇట్టి నేత్రము కలిగియుండుటచేతనే శివుఁడు త్రినేత్రుఁ డని చెప్పఁబడెను.

*Hence concentration of Mind is absolutely necessary.*

మంచినీరు త్రాగనిది దాహము తీఱనియట్లు అపరోక్షసాక్షాత్కారము స్వానుభవమువలనఁ గలుగనిది జన్మరాహిత్యము కలుగ నేరదు. తేనెటీఁగలు పుష్పమునందలియమృతమును త్రాగకమునుపు విశేషధ్వనిని జేయును. అట్లే మనుజులును బ్రహ్మానందవాసన తెలియనంతవఱకు మనస్సు వృత్తులకుఁ బాల్పడుచుందురు. బ్రహ్మానందసార మొక్కించుక పోకి యనుభవము గలిగెనేని తోడ్తోడన మనస్సు సంకల్పరహితమై వృత్తులు నశించి బ్రహ్మానందాబ్ధియందోలలాడుచుండును. అనుభవమువలననే తెలియును. గాలము లేకుండా చేపలు పట్టుపడవు; ఉరులు వేయకుండా పక్షులు చిక్కవు; ఓదము లేకుండా మావటివానిచేత యేనుఁగులు కట్టుపడవు; బాణములు లేకుండా క్రూరమృగము లగుసింహములు పెద్దపులులు అడవిపందులు మొదలుగాఁగల మృగములు పట్టుపడవు; అటులనే రాజయోగానుసంధానము లేకుండా ఊహలచేతను వినికిడి మాటలచేతను వేదాంతవిచారణచేయుచు ఉపన్యాసములిచ్చుచువాదించుచునుండువారికి శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లనెడుజ్ఞానేంద్రియంబులు వాక్పాణిపాదపాయూపస్థ లనెడుకర్మేంద్రియములు ఐదింద్రియములకు రాజు అయినమనస్సు వశీకృతము కానేరదు. అట్టివారు వారిమనస్సును నిలుపఁజాలక బేలుపోయి విషయభోగములలోఁ దగులుకొని అపరోక్షసాక్షాత్కారజ్ఞానము లేక విచ్చలవిడిగఁ దిరుగుచుందురు.

శ్లో॥ ఋణాం యాచ్నాచ వృద్ధత్వం జార చోర దరిద్రతా
రోగశ్చ భుక్తశేషశ్చ హ్యష్టకష్ట ప్రకీర్తితాః॥

అనెడి న్యాయము చొప్పున అష్టకష్టములపాలై

క॥ దయయు జుగుప్సయు మోహము
భయమును సంశయముఁ గులము బల శీలముల
న్నియుఁ గూడ నష్టపాశము
లయి వెలయును వాని నాత్మఁ డాటక యుండుగ॥

శుకచరిత్ర.

యీ ప్రకారము అష్టపాశములఁ దగులుకొని దరిఁగానలేక పరిత
పించెదరు. మఱికొందఱు

శ్లో॥ ఉత్తమా తత్వ చింతాచ
మధ్యమం శాస్త్ర చింతనం
అధమా మంత్ర చింతాచ
తీర్థభ్రాం త్యధమాధమః॥

అనున్యాయమును గుర్తెఱుఁగక తీర్థయాత్రలు సేవించెదమనియు అందువలన ముక్తికలదనియుఁ దలంచెదరు. శాస్త్రము చదువుటవలనను మంత్రానుష్ఠానమువలనను తీర్థయాత్రలవలనను ముక్తి లేదని నొక్కి వక్కాణింపఁగలము. అపరోక్ష సాక్షాత్కారస్వానుభవముఁ గలపెద్దల చెంతఁ జేరి వారికి చతుర్విధశుశ్రూషలు సేయుచు వారియొక్క నిర హేతుక జాయమాన కటాక్షమువలననే రహస్యములఁ దెలిసికొని ముమ్ముందుగా జీవన్ముక్తిని పొంది ఆపిమ్మట పరిపూర్ణావలోకనచే విదేహ ముక్తిని పొందవలయును. యిదితప్ప వేరుమార్గము కానము. కావున తగిన గురువును వెదకి వారికి చతుర్విధశుశ్రూషలు చేయవలయును.



# చతుర్విధ శుశ్రూషలు.

స్థానశుశ్రూష అంగశుశ్రూష భావశుశ్రూష ఆత్మశుశ్రూష యని నాలుగు విధములు.

అందు :—

1. స్థానశుశ్రూష:— గురువు జపతపాద్యనుష్ఠానములు చేసికొనునట్టియు, ఆసన శయనాదుల నడుపునట్టియుఁ బ్రదేశములను మలినము లేకుండ నూడ్చియు నలికియు బాగుసేయుట. గురుని యొక్క యిల్లు వాకిలి భూములు పైరులు పంటలు పశువులు ధనము ధాన్యము సామానులు మొదలగునవి కాపాడుతూ వారికి యేవిధమయిన నష్టము కలుగకుండునటుల సర్వ జాగ్రత్తగ నుండుట. జాతి వంశ ప్రతిష్ఠలయందలి యభిమానమును దేహాభిమానమును విడుచుటయే స్థానశుశ్రూష యని భావము.

2. అంగశుశ్రూష:—గురువుయొక్క శరీరమునకు మలినము లేకుండ తోముట కాళ్లు పిసుకుట మొదలగు నుపచారములు చేయుట. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనెడు అంతశ్శత్రువులును పంచమలములును లేక నుండుటయే అంగశుశ్రూష యనిభావము.

పంచమలములు:—

(1) ఆణవమలము=పరబ్రహ్మమును తెలిసికొనవలె నను జ్ఞానము అప్పుడప్పుడు కలుగఁగా దానిని మఱుఁగు పఱచునది ఆణవమలము.

(2) కార్మికమలము=పెద్దలవలన రహస్యములను దెలిసికొ
నునపుడు దానియందు బుద్ధిని పోనీయనిది.

(3) మాయికమలము=దట్టమయిన యజ్ఞానము. పరబ్రహ్మ
మును తెలిసికొనవలె ననుజ్ఞానవాసనను యెప్పుడును
కలుగనీయనిది మాయికమలము.

(4) మాయేయమలము=మాయసంబంధములగు పాపకృత్య
ములను చేయించునది.

(5) తిరోధానమలము="జగత్సత్యం బ్రహ్మమిథ్య" యనునట్లు
సర్వవ్యాప్తిరహితంబును త్రిగుణాతీతంబును పంచకో
శరహితంబును అవాఙ్మానసగోచరంబును అగుపర
బ్రహ్మయందు అనిత్యబుద్ధి పుట్టించి అజ్ఞానమును
గలుగజేసి పరబ్రహ్మమునకంటె వేఱుగ పూజలు
దేవతలు మంత్రములు క్రియలు మతములు సాధన
ములు కలవు అనియు అవి సత్యములు అనెడు బుద్ధి
ని కలుగఁజేసి, జననమరణాదిదుఃఖముల యనుభవ
మునకు కారణమైనదియే తిరోధానమలము.

3. భావశుశ్రూష:—గురువు కోరినదాని నెల్లఁ దెచ్చి యిచ్చుచు,
గురునికిఁ గోరిక లేకుండఁ జేయుట. గురుఁడే రక్షకుఁడనియు,
గురుఁడే దైవమనియు, గురుఁడే తల్లియనియు, గురుఁడే తండ్రి
యనియు, గురుఁడే ధనము విద్య ప్రియుఁడు స్నేహితుఁడు
బంధువు దాత మామ తాత అన్న, సమస్తము గురుఁడే
యని తలంచుట భావశుశ్రూష.

☞ మనసు జడమనియుఁ దానుమనసుకంటె భిన్నుఁడనియు,
శరీరమునశించునది గనుకఁ దానుశరీరముకంటెభిన్నుఁడ
నియుఁ దానుపంచకోశములకు విలక్షణుఁడనియు, జ్ఞానం

ద్రియములుకర్మేంద్రియములు నంతరింద్రియములున్నెను. చతుర్దశేంద్రియములకును దాను విలక్షణుండై సాక్షిగనుండునని తలంచుటయే భావశుశ్రూషయని భావము.

4. ఆత్మశుశ్రూష:—గురువు కోరనిదే యాయన యభిప్రాయమును దెలిసికొని, యిష్టములనునెఱపి, కష్టములను దొలంగించి తృప్తిపఱచుట. వారికిష్టము లగువస్తువుల నెల్ల కోరకముందే సంతుష్టిగఁ దెచ్చియిచ్చుట ఆత్మశుశ్రూష యని చెప్పఁబడును. భావశుశ్రూషయందుఁ దాను సాక్షిననియు విలక్షణుఁడననియుఁ దెలిసికొనుచు. ఆత్మశుశ్రూషయందుఁ దాను సాక్షియనుకొనుటయు వృత్తియేగనుకఁ దానుసాక్షిగాననియు అఖండపరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపమే తాననియు గ్రహించి తానుతానై యుండుట యని భావము. (ఇది యనుభవైక వేద్యము.)

☞ స్వాన [illegible] ధనములు గురునకు సమర్పించ వలయును. గురువునందచంచల భక్తిగలిగి మెలఁగ వలయును. ఈవాక్యములను జెప్పుచు మానమును గురువునకు సమర్పించనియెడల సచ్ఛిష్యురాలు గాదనియుఁజెప్పుచు కొందఱు గురువులు తమశిష్యులగు స్త్రీలయొక్క సౌందర్యమునకుమోహించి బలవంతముగా ఆశిష్యురాలినిసమ్మతిపఱచి విషయసుఖములం దేలుదురు. ఇట్టిమహనీయులు పంచమహాపాతకులకంటెను అధము లని నొక్కి వక్కాణింపఁగలము. ఈకారణముననే స్త్రీలకు భర్తయేదైవము, భర్తయేగురుఁడు, అని చెప్పఁబడును. కావున దుర్గురులును వేషధారులును అగు గురువుల చెంతఁ జేరక సద్గురువుల చెంతఁ జేరి వారి యనుగ్రహమును బొందవలయును.

☞ స్త్రీలు అబలలుగనుక గురువులవలన వేదాంతవాక్యములను వినునప్పుడు భర్తదగ్గఱయుండియే వినవలయును. భర్తయింట లేనిసమయ

మూలందు శ్రవణము చేయగిట్టదు. స్త్రీలుస్వతంత్రులుగారు గనుక వారికి ఏకాంత ప్రశంస లేదు. స్త్రీలకు పాతివ్రత్యమే భూషణము. ఏయాడుది పెనిమిటిని దైవముగాభావించి పూజించునో యది స్వర్గమునందును దేవతలచేత పూజింపఁబడును. మహాపతివ్రతలు భూలోకంబునను బూజింపఁబడుదురు. పాతివ్రత్యమువలన యిహలోకమందును బరలోకమందును సన్మానింపబడుటయేకాని ముక్తి లేదు. బ్రహ్మజ్ఞానసంపన్ను లగుస్త్రీలు అనేకమంది లేకపోయినను అక్కడక్కడ బ్రహ్మవిద్యాధురంధరులుకలరు. వారివారిఅనేకజన్మార్జితపుణ్యాపరిపాకమువలన పరబ్రహ్మజ్ఞానముఅతిసులభముగ తెలియఁగలదు స్త్రీలకు జ్ఞానము మెండు గనుక అతిసూక్ష్మముగ తెలియఁగలదు. కావున బ్రహ్మవిద్యాధురంధరులును అశరీరులును, అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయము లనెడు పంచకోశముల కతీతులును, హిరణ్మయకోశ రహితులును, స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీర రహితులును, పరిపూర్ణులును, అగు స్త్రీలు యేజాతియందున్నను యేవృత్తియందున్నను, బాలులైనను వృద్ధులైనను పూజనీయు లని తెలియునది.

అనేకజన్మార్జితపుణ్యాపరిపాకమువలన జ్ఞానోదయమై యేల యీలీల నసత్యమగుప్రపంచమందలివిషయములలోఁ జిక్కిదరి గాన లేక పరితపించుచుంటిని. సారములేని యీసంసారసాగర మెట్లుదాటగలను. అల్పసుఖమునకాశపడి ధనమంతయు జారస్త్రీలకుఁ గొల్లఁబెట్టితిని పెద్దల కొకరూకయయిన నివ్వనైతిని. ఒకప్పుడును పెద్దలసేవ చేయనైతిని హా! దైవమా! అసత్యమగునీవిషయసుఖమే సత్యమనినమ్మి మోసపోతినిగదా! అనివిలపించుచు

"బాల్యంబునఁ గొన్ని నాళ్లు పిదపన్ భామాకుచాలింగనా
లోలాత్ముఁడనైతిఁ గొన్ని నాళ్లుముదిమిన్ లోగింటిలోఁ గొన్నినా
ళ్లీలీలం విహరించితిన్ సుఖఫలం బిందేమియున్ లేదికం
జాలు న్నీపదభక్తిఁ జేసెదను రామా యార్తరక్షామణీ."

అని భగవధ్ధ్యానము చేయుచు నిర్గుణసాక్షాత్కార పరబ్రహ్మస్వరూప మందలి బ్రహ్మానందము ననుభవించు పెద్దలెక్కడదొరకుదురు. వారిసేవ నాకెట్లు లభించుననిభగవదర్పితముగాఁ బుణ్యకర్మములఁజేయుచుఁబెద్దల ను వెదకుచుండవలయును.

సీ॥ కంజాక్షునకుఁగానికాయంబు కాయమేపవనకుంభిత చర్మభస్త్రికాక,
వైకుంఠుఁబొగడనివక్త్రంబువక్త్రమేఢమఢమధ్వనితోడిఢక్కగాక
హరిపూజనములేనిహస్తంబుహస్తమే తరుశాఖనిర్మితదర్వికాక
కమలేశుఁజూడనికన్నులుకన్నులే తనుకుడ్యజాలరంధ్రములుగాక
గీ॥ చక్రిచింతలేనిజన్మంబుజన్మమే। తరళసలిలబుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేనివిబుధుండువిబుధుఁడే। పాదయుగముతోడిపశువుగాక॥

భాగవతము.

విష్ణునిసేవింపనిదేహము గాలిపూరించినతోలుతిత్తియన వలయునేకాని దేహమని పేర్కొనుటకుఁ దగినదికాదు. పరమేశ్వరుని స్తోత్రముచేయని నోటనుండివచ్చుశబ్దము లుభేరీమోతవలనఁబుట్టుశబ్దముల యట్టివందగునేకాని యర్థవంతములగు పదములనఁదగవు. భగవంతునిఁ బూజింపనిచేయి చెట్టుకొమ్మనజేసిన తెడ్డవనగుంగానిసార్థ కమగుచేయికాఁజాలదు. నారాయణునిదర్శింపనికన్నులు దేహమనియెనుగోడకుఁబొడిచినకిటికీబొక్కలేకాక నిజ మైనకన్నులుకానేరవు. వాసుదేవుని ధ్యానింపనిపుట్టుక కొంతకాలమాడియాడి మాయమగునీటిబుగ్గవలెనే నిర ర్థకమగును. పరతత్వమునందాసక్తిలేని పండితుఁడును రెండుకాళ్లపశువే యనఁదగుంగాని నిశ్చయమైన పండి తుఁడని చెప్పనొప్పదు.

బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి అని భక్తి మూఁడు విధములు. అందు:—

1. బాహ్యభక్తి—రాగతాళలయల కనుకూలముగ బాడుచు నాడుచు నానందబాష్పంబులు వర్షింపభజనచేయుటయు ననుదినము రామకృష్ణగోవింద నారాయణాది నామములుస్మరణచేయుటయును దేవతాఁ భక్తిఁగలవాఁడై శ్రీరాముల యొక్కగాని కృష్ణునియొక్కగాని మఱియే దేవతయొక్కగాని పూజచేయుచుండుట. ఇది యనన్యభక్తికిసాధకంబు. బాహ్యభక్తియందు సకామకర్మము చేయఁబడును. బాహ్యభక్తి పరోక్షజ్ఞానమునకుఁ గారణము.

2. అనన్యభక్తి—గ్రహించుతానును గ్రహింపఁబడు సమస్తమును శ్రీహరిమయంబని చింతింపుచు నన్యంబుగానొక్కటియును దోచక సమస్తమునుహరిభావంబుగాఁగనుట. ఇది యేకాంతభక్తికి సాధకంబు. అనన్యభక్తియందు నిష్కామ కర్మము చేయఁబడును. అనన్యభక్తిఅపరోక్షజ్ఞానమునకుఁ గారణము.

3. ఏకాంతభక్తి—సముద్రమందు తరంగములు కల్గినచందంబునఁ బరబ్రహ్మమందు ప్రపంచము కలిగెనుగాని యీప్రపంచము సత్యముకాదని తలంచి యేకాంతచిత్తంబున ధ్యానంబుచేయుట. సత్ రూప మగుపరబ్రహ్మమును చిత్ రూపిణియగు మూలప్రకృతియును చంద్రచంద్రికలవలె యొక్కటేయను నిశ్చయజ్ఞానమునకలిగెడిబ్రహ్మనందమునుఅనుభవించుటకు ఏకాంతభక్తి కారణము.

☞ భక్తికిఅంగములు—శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య, ఆత్మనివేదనముల నెడుతొమ్మిది అంగములు గలదియగును.

ఇట్లు వేదాంతభక్తిఁగలవాఁడయి యేపాపకృత్యములను జేయక పుణ్యకర్మములనే చేయుచు గురువును వెతుకవలయునుగాని యట్లుచేయక కొండగుహలయందుండినను బంచాగ్ని మధ్యమందుండినను యరణ్యామందుండినను బర్వతశిఖరమందుండినను లేక గబ్బిలములవలెఁ దలక్రిందుగాఁ దపస్సుచేసినను గొంగవలె నేకాగ్రచిత్తముగనుండినను జిలుకలవలె శాస్త్రములుతుదముట్టఁ జదివినను యేమియు లాభముండదు.

ఉ॥ అచ్చపుఁజీఁకటిం బడిగృహావ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్నఅలఁ జర్వితచర్వణులైనవారికిం
జెచ్చెరబుట్టునే పరులుసెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు నేగిననైన హరిప్రబోధముల్॥

భాగవతము.

మాయాంధకారమ్మునంబడి గృహకృత్యములకొఱకుఁబరితపించుచు, నదేపనిగఁ బెక్కుజన్మములెత్తుచు,సంసారచక్రమ్మునంబడికొట్టుకొనుచుండు మూఢులకుఁ బరతత్వమునుగూర్చిన దివ్యజ్ఞానము స్వయముగఁబుట్టదుసరిగదా, యితరులు మేలుగోరి హితోపదేశముఁ జేసినను లంచమిచ్చి బ్రతిమాలినను బలవంతమునఁ బట్టినట్టడవికి నెట్టినను గలుగఁబోదని తాత్పర్యము.

కనుకఁదగినసద్గురువునొద్దఁ జేరిరహస్యములనుదెలిసికొనవలయును.

"ఆహారనిద్రా భయ మైథునాని సామాన్య మేతత్పశుభి ర్నరాణామ్
జ్ఞానీ నరాణా మధికో విశేషో జ్ఞానేనహీనః పశుభిస్సమానః॥

ఉత్తరగీత.

ఆహారము నిద్ర భయము సంభోగము ననునవి పశువులకును మనుష్యులకుం గూడసమానముగనుండు గుణములు. పశువులకంటెమనుష్యునియందు జ్ఞానమొక్కటి యధికము. అట్టిజ్ఞానమే లేనిచో మనుష్యుఁడును బశువుతో సమానుఁడేయగునని తాత్పర్యము.

ఇట్టివానినే నరపశువని పెద్దలు పేర్కొనియున్నారు. కనుక బశువులవలె జ్ఞానహీనులయి యుండక జ్ఞానమును సంపాదింపవలెను. సర్వకాలములయందును భగవద్భక్తికలిగి గురువులయందును బెద్దలయందును భక్తిగలిగి యుండునది. అట్టిభక్తివలన శ్రద్ధపుట్టును. శ్రద్ధవలన సత్కర్మానుష్ఠానము కలుగును. సత్కర్మములవలన జ్ఞానము కుదురును. జ్ఞానమువలన ముక్తి చేకూరును.

"సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్వే జీవన్ముక్తిః॥"

జ్ఞానులతో సహవాసము చేయుటవలన వైరాగ్యము కుదురును. వైరాగ్యమువలన దారాపుత్రాదులయందలి ప్రేమపోవును. ప్రేమపోవుటవలన జితేంద్రియత్వమును తత్వజ్ఞానమును స్థిరపడును. తత్వజ్ఞానమువలన జీవన్ముక్తి దొరకునని తాత్పర్యము.

కాబట్టి సజ్జనసాంగత్యము చేయవలయును. అందువలన దుర్గుణములుపోయి మంచిగుణములు పట్టువడును.

నిజమైనభక్తుని లక్షణములు.—భగవద్గీత—12 అ 13 శ్లోకము మొదలుకొని చివఱవఱకును—సర్వభూతదయాళుత్వము గలిగి మమకారాహంకారములను విడనాడి సుఖదుఃఖములయందు సమబుద్ధిని వహించి నిత్యసంతోషియై సంశయములనువదలి సంకల్పరహితుఁడయి పక్షపాతములేక మిత్రశత్రువులను మానావమానములను సమముగాఁ జూచుచు నిత్యతృప్తినొంది సర్వకాల సర్వావస్థలయందును గురుపాదములయందే మనసును నిలిపియుండువాఁడు నిజమైనభక్తుఁడని చెప్పవలయును. అట్టిభక్తులయందు శాంతము, దాస్యము, సఖ్యము, వాత్సల్యము, మాధుర్యము అనెడి పంచవిధములగు భక్తిరసము లొలుకుచుండును.

భక్తిరసములు:—

1. శాంతము.—శాంతగుణము గలిగియుండుట.

2. దాస్యము.—అభిమానము లేకయే సేవకావృత్తినవలంబించుట.

3. సఖ్యము.—లేక స్నేహము. స్నేహితునివలె గురునిని గౌరవముగాఁ జూచుచు సత్కరించుట.

4. వాత్సల్యము.—బిడ్డలయందువలె గురునియందుఁ బ్రేమయుంచుట.

5. మాధుర్యము.—భక్తిశ్రద్ధలతోడ వినయ విధేయతల నగుపఱచుచు మృదువుగను మధురముగను భాషించుట.

మనోవాక్కాయకర్మంబులచే గురుని సేవ చేయవలయును. మనస్సును గురుని పాదములయందే నిలిపి సాష్టాంగ నమస్కారములు చేయవలయును. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధుల నెడు అష్టాంగ యోగములయందును సమర్థుఁడై యుండుటయే సాష్టాంగనమస్కారము. ఇట్లు సమర్థుఁడై యుండియు గురువునకుఁ గ్రియారూపమైన సాష్టాంగనమస్కారము చేయవలయును.

క॥ కరయుగములు, చరణంబులు
నురము, లలాటస్థలంబు, నున్నతభుజముల్,
సరి ధరణిమోపి మ్రొక్కినఁ
బరువడి సాష్టాంగమండ్రు పగమమునీంద్రుల్.

ఇట్లు చతుర్విధ శుశ్రూషలు త్రికరణశుద్ధిగాఁ జేసినమీఁదట గురునకు నిర్హేతుకముగఁ గలుగుకటాక్షమువలన హస్తమస్తక సంయోగము చేసి, యప్పుడాతఁడు శిష్యునకు రహస్యముల నుపదేశించును.

1. హస్తమస్తక సంయోగము—శిష్యుని నెత్తిమీఁద గురువుయొక్క హస్తమును (చేతిని) పెట్టుట. అప్పుడు శిష్యుఁడు తన తల మీఁద గురువుకొట్టునేమోయని భయపడుచుండును. ఆతని

మనస్సు ఊర్ధ్వముఖవ్యాప్తియైయుండును. అదియ నిర్విషయంబు. అట్లు నిర్విషయమగుటకై మనస్సును ఊర్ధ్వముఖవ్యాప్తిచేయుమని చెప్పుటకు, హస్తమస్తకసంయోగమను నిబంధన యేర్పడియెను.

2. ఉపదేశము—మనస్సు అధోముఖముగా నుండునపుడు విషయములకుఁబోవును. ఊర్ధ్వముఖముగా నుండెనేని విషయములకుఁ బోక నిర్విషయమగును. బ్రహ్మానందమున మునిఁగి తేలుచుండును. అజ్ఞానులందఱకు మనస్సు అధోముఖవ్యాప్తియై విషయములకుఁ బాఱుచుండును. అట్టిమనస్సును ఆ స్థానమునుండితప్పించి యూర్ధ్వముఖముగనిలుపుటయే యుపదేశమనఁబడును. ఇదియె గురూపదేశము. ఈవిషయమును తెలిసికొనఁజాలక యేమోమంత్రములు నేర్పెదరని యజ్ఞులు తలంచెదరు. మంత్రములు నేర్పుట యుపదేశముకాదు. మనస్సు నూర్ధ్వముఖముగ నిలుపుటకు స్థాననిరూపణచేసి క్రమక్రమముగ అట్లునిలుపుటకు మార్గమును దెలియఁజేయుటయే యుపదేశమగును. మనోపవనము లేకముచేసి అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయముల నెడి పంచకోశములనువిడిచి అచల పరిపూర్ణమైయున్న దహరాకాశమనెడి ప్రదేశమందే వర్తించుటకు మార్గమును చెప్పుట.

3. ఉపవాసము—అదివఱకు ననుభవించుచుండిన పదార్థముల యనుభవమును బరిత్యజించుట. అనఁగా విషయసుఖములను బరిత్యజించుటయని భావము. అన్నమును దినకపోవుటయే యుపవాసము కానేరదు. శబ్దార్థమువలన—ఉప = సమీపమున; వాసము = నివసించుట. అనఁగా సుషుమ్నా నాడి కాగ్రిమగు సహస్రారమందే మనసును నిలుపుట యని

భావము. మనసునకు విషయములు స్థానమైయున్నది. అట్టి విషయములను దప్పించి యూర్ధ్వముఖ వ్యాప్తిఁగలిగించి, దానిని సహస్రారమందుంచుటయే యుపవాసము. అనఁగా అధోముఖవ్యాప్తియైనమనస్సును, దానిస్థానమునుండితొలగించి యూర్ధ్వముఖవ్యాప్తిఁ గలిగించుటయే సమీపనివాసము. అదియే యుపవాసము. ఇందుచేతనే యన్నము మొదలుగాఁగల యాహారపదార్థములు తినుచున్నను మనస్సాంకల్పములేనివారగుటచేత సదోపవాసులని కొందఱు పెద్దలు పేర్కొనఁబడిరి. అయాచితమే సదోపవాసము.

Concentration of mind is necessary.

శ్లో॥ నాభిస్థానే వసే దగ్నిః హృదిస్థానే దివాకరః
భ్రూమధ్యే వసతి శ్చంద్రః చంద్రాగ్రేచ వసే న్మనః॥

నాభియందు జఠరాగ్నియుండును. హృదయమందుసూర్యుఁడుండును. భ్రూమధ్యమందు చంద్రుఁడుండును ఆచంద్రునికి పైగా మనస్సు నివసించియుండును. కావుననే మనసునకు చంద్రుఁడు అధిదేవత యని చెప్పఁబడును.

యోగమునభ్యసించుట ముఖ్యమని భగవద్గీతలు చెప్పుచున్నవి.

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్॥

భగవద్గీత—8 అ. 12 శ్లో.

అన్నిద్వారములను బిగించి మనస్సును హృదయకమలమందు నిలిపి పిమ్మటఁ దనప్రాణవాయువు, నూర్ధ్వగామియైన సుషుమ్నానాడిగుండా శిరస్సునకెక్కించి నిలుపుటయే యోగధారణమును పొందుటయనియర్థము.

యోగాభ్యాసములేనిది మనసునిలువదు. కనుక ముందు యోగవిషయము నేర్చికొనవలయును.

# యోగవిషయము

---

యోగ మనఁగా( బ్రత్యగాత్మకును పరమాత్మకును ఘటాకాశ మహాకాశములకు వలె ఐక్యసంబంధము కలుగుట. అనఁగా మనస్సు ననేకరీతులుగా సంచరింపనీయక తనయందే మగ్నము చేసికొనుట. ఇంద్రియములను వశపఱచుకొని చిత్తము ఈశ్వరునియందు లయింపఁ జేయుటయే యోగము. ఇది సాంఖ్యమునకు సాధకము.

"దృగ్యస్యాగ్రం లీయతే యత్ర మనస్తత్రైవ లీయతే
దృష్టిర్మనోలీయతే యత్ర మారుతం తత్ర లీయతే"

మనము దేనితో సమస్తపదార్థములను జూచుచుందుమో యట్టి నేత్రద్వయముయొక్క చూపునకు బహిర్వ్యాప్తి లేకుండఁ దనను దాను జూచుకొనుట నేర్చిన నదివఱకుఁగనుపడు వస్తువులెల్లను గనుపడవు. దీనికే యంతర్ముఖవ్యాప్తియని చెప్పుదురు. అట్లుచూపెచ్చట లీనమగునో యచ్చటనే మనస్సుసైతము లీనమగును. చూపును మనసు ఎచ్చట లీనమగు నచ్చటనే సోహంస్వరూపముగనుండెడు వాయువును లీనమగును అచ్చటనే మనోమారుతములు లయమగుచున్నవి.

ఒకకుండను దెచ్చి చూచిన లోపలను వెలుపలం గూడ నాకాశము కనుపించును. లోపల నుండెడు నాకాశమున కావరణయుండెనుగదా. ఆకుండను బగులఁగొట్టినపుడాలోపలి యాకాశ మావరణరహితమై వెలుపలనుండు నాకాశముతోఁ గలిసి నిరావరణమైపేరులేనిది యగుచున్నది. ఆవరణ యున్నంతవరకే కుండలోని యాకాశమను వేఱుపేరుగాని ఆయావరణము రహితముకాఁగానే నామభేదమును బోవును. అప్పుడే నామ రూప క్రియా రహితత్వము సిద్ధించును.

యోగాభ్యాసము చేయఁ దలపు గలవారలు, గుహాలయందుగాని, లేక జనసంచారమును దుర్వాసనయు మిట్టపల్లములును లేక నల్లులు చీమలు దోమలు యెలుకలు మొదలగువానివలని యుపద్రవములు లేక విశాలమై యుండుసమభూమియందుగాని, గృహమునందు ఆవుపేడతో చక్కఁగా అలికిన గదియందుగాని, మిద్దెమీఁదగాని క్రిందగాని తెల్లసున్నము చక్కఁగా చేసి నల్లులు యీగలు చీమలు దోమలు మొదలుగాఁగలజంతువులు చేరకుండునటులను, గాలి విశేషముగా రాకుండునటులను, గాలి బొత్తిగా లేకపోతే ఆగదిపనికిరాదుగనుక కొంచము గాలి వచ్చునటులను, యేర్పరచబడినట్టియు సువాసనద్రవ్యములతో అలంకరింపఁబడినట్టియు గదియందుగాని పులిచర్మమునైనను కృష్ణాజినమునైనను వేసికొని, దానిమీఁద స్థిరచిత్తముతోఁ గూర్చుండి నడుమును మెడను తలను చక్కఁగా సరిగా నుంచి భ్రూమధ్యమందలి చిద్బిందువును దిలకించుచు యోగాభ్యాసము చేయవలయును. కోపమును దూరముగ విడువవలయును. ఉప్పు కారము మొదలగు తామసపదార్థములను దినక, పాలు, నేయి, చక్కెర, మొదలుగాఁగల సాత్విక మధుర పదార్థములనే తినవలయును. "అతిసర్వత్రవర్జయేత్" అనున్యాయముచేతమితాహారమునుమితనిద్రయు నుండవలయును. ప్రథమములోఁబద్ధాసనము వేసికొనియొకగంట సేపు కదలకకూర్చుండి యుండుట కభ్యాసముచేయవలయును. అట్టులభ్యాస మయినపిమ్మటఁ బ్రాణాయామము చేయవలయును. నాగులచవితి గోకులఅష్టమి శ్రీరామనవమి ముక్కోటిఏకాదశి శివరాత్రి మొదలగువ్రతములు ఉపవాసములచేతను శరీరమును కృశింపచేయుచు ఏమియును భక్షింపనివానికి రాజయోగానుసంధానము లభింపదు గారెలు బూరెలు లడ్డు హల్వా పోళి మొదలగు మధురపదార్థములను అన్నమును మిక్కిలి యెక్కువగా చిరునాలుకవఱకు తిని ఉచ్ఛ్వాస నిశ్వాసములకయినను వీలులేక ప్రయాసపడుచు నుండువానికి

రాజయోగానుసంధానము లభింపదు. తెల్లవారుజామున నిద్దురలేవక పగలు రాత్రియు తీరనినిద్రబోతూ ఏప్రొద్దును నిద్రమబ్బుతో పడియుండువానికిని తెలివిముఖస్థానమందున లేనివానికిని రాజయోగానుసంధానములభింపదు. పగలు రాత్రియు నిద్దురబొత్తిగా లేనివానికిని రాజయోగానుసంధానము లభింపదు.

[సద్గురువు లేని యెడ వ్యాధియును మరణమును గలుగును.]

కావున యోగాభ్యాసము చేయువారలు, యోగవిద్య బాగుగఁదెలిసినగురువును దగ్గఱ నుంచుకొని యభ్యసింపవలయును. లేనిచో వ్యాధులకుఁ గారణమగును. కొండనాలుకకు మందుపెట్ట నున్న నాలుకయు నూడిపోయినట్లు, యోగవిద్య తెలియకపోఁగా శరీరాయాసము, దగ్గు మొదలగు వ్యాధులేర్పడును. భోజనానంతరము యోగాభ్యాసముచేయగిట్టదు. తెల్లవారు జామున నాలుగు గంటలవేళయే దీనికి బ్రశస్తమయిన కాలము. (4. A. M. daily.)

హఠయోగులు పాలు పంచదార వెన్న నేయి తేనె గోధుమపిండి మొదలగు మధురపదార్థములనే తినవలయును.

యోగము అభ్యాసయోగమని జ్ఞానయోగమని రెండువిధములు:—

1. అభ్యాసయోగము—దీనినే కర్మయోగమనియుఁ బ్రాణాయామ మనియును జెప్పుదురు. ఈయోగాభ్యాసమువలనఁ జిత్తపరిపక్వముగలుగును.

2. జ్ఞానయోగము—దీనినేరాజయోగమని చెప్పుదురు చిత్తపరిపక్వముగలవారీ యోగమువలనముక్తిని బొందుదురు.

అందు మొదటిది యగు అభ్యాసయోగముప్రాకృతమని వైకృతమని కుంభకమని మూఁడు విధములు.

1. ప్రాకృతము లేక మంత్రయోగము.
2. వైకృతము లేక లయయోగము.
3. కుంభకము లేక హఠయోగము,

అందు మంత్రయోగము—అజపరూపమంత్రియోగము, జపరూప మంత్రియోగము, క్రియారూపమంత్రియోగము, స్మరణరూపమంత్రియోగము అని నాలుగు విధములు.

1. అజపరూప మంత్రియోగము.
2. జపరూప మంత్రియోగము.
3. క్రియారూప మంత్రియోగము.
4. స్మరణరూప మంత్రియోగము.

శ్లో॥ మకారం మననంచైవ త్రికారం త్రాణముచ్యతే
మనన త్రాణ మిత్యాహు ర్మంత్రమిత్యభిధీయతే॥

శ్లో॥ దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతమ్
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమదేవతా॥

వాని వివరమును దెలిపెదను.

1. అజపరూపమంత్రియోగము.—సూర్యోదయము మొదలుకొని తిరుగ సూర్యోదయమగు వఱకును మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రార కమలములకు అధిదేవతలైన గణపతి మొదలగువారికి 21600 హంస అజపాగాయత్రీమంత్రిజపమునసమర్పించుట. (చక్రివిషయమునుచూడుము)

శ్లో॥ షట్ఛతంతు గణేశాయ షట్సహస్రంతు వేధసే
షట్సహస్రం గదాపాణే ష్షట్సహస్రం పినాకినే
ఆత్మనేచ సహస్రంతు గురువేచ సహస్రికం
జీవసంఖ్యా విజానీయాత్ సహస్రం పరమాత్మనే॥

2 జపరూపమంత్రయోగము.—బీజ, ఋషి, ఛంద, దేవత, శక్తి, కీలక, అంగన్యాస కరన్యాస ధ్యాన కవచ హృదయ మాల

పంజరఅర్గళ స్తోత్రదిగ్బంధన దిగ్విమోక ప్రాణప్రతిష్ఠలును యంత్రవిగ్రహాద్యారాధనములు గలిగి మొదట ప్రణవము ను నడుమను దేవతానామమును చివరను వశ్య మారణ స్తంభన మోహన విద్వేషణ ఉచ్చాటన ఆకర్షణ ఆవేశము లనెడుఅష్ట కర్మములకు తగిన నమః స్వాహా హుం ఫట్ వౌషట్ వషట్ ఖేఠ స్వధ మొదలగు పల్లవములను ప్రణ వాదిగ చేర్చి, వినియోగముతోఁ గూడినయేమంత్రమునైన యిష్టసిద్ధికొఱకు జపము చేయుట. యీ మంత్రము ఏడు కోట్ల విధములైయుండును.

"సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమ కారకాః"

3. క్రియారూప మంత్రయోగము—యజ్ఞములు, వివాహములు, ఉపనయనములు,యాగములు,గర్భాదానాదిషోడశసంస్కా రములు మొదలగువాని యందు మంత్రములను నోటఁ జెప్పుచుఁ జేతులతో చర్వాజ్య సమిధ అక్షత పుష్పచందన దర్భ జలాదులతోడఁ గ్రమముగ క్రియల నడుపుటయే క్రియారూపమంత్రయోగము.

4. స్మరణరూపమంత్రయోగము—శివ రామ గోవింద నారాయ ణాదినామములను రాగ తాళ నృత్య వాద్య ములతో భ జన సేయుటయును, ఆ నామములను గోటి కోటి మారు లుగ వ్రాయుటయును, యిష్టదేవతారూపముల వ్రాయుట యును స్మరణరూపమంత్రయోగ మని చెప్పఁబడును.

...లయయోగము:—అనాహత చక్రమున(చక్రవిషయమునఁజూడుఁడు) నుండు దశవిధ ప్రణవనాదముల నెఱిఁగి, దశమనాద మెచ్చ ట లీనమగుచున్నదో యచ్చటఁ జిత్కళాదర్శనమందు మన స్సు లీనమగుటయే లయయోగము. వాయు నిరోధ మేలయు

యోగము. ప్రాణవాయువునందుఅపానంబునుఅపానవాయు వునందు ప్రాణంబును లయంబుగావించుట లయయోగము

శ్లో॥ మనోగ్రేవ సతేబిందుః ప్రాణాగ్రేవ సతేకళా
ఉభయో ర్లీయతే నాదం లయ యిత్యుచ్యతే బుధైః॥

మనస్సునకు అగ్రముగానుండు బిందువగు బుద్ధియును ప్రాణమునకు అగ్రముగానుండు కళయును(Light of Lights)లీనమయినప్పుడే నాదమును లయమగును. అట్టినిష్కళయే పరబ్రహ్మస్వరూపము.

Note.—బుద్ధి పండయని మేధయని చార్వియని చత్వయని గృహీతయని శ్రౌతియని ప్రతిభయని యేడువిధములు. అందు:—

1. పండ—వేదాంత విషయములను దెలుసుకొనఁ దగినబుద్ధి పండ యనఁబడును.

2. మేధ—శ్రవణ మనన నిదిధ్యాసలచేత పెద్దలవలన తెలిసికొనినసంగతులను మఱువక సదాఅవలోకనగలబుద్ధి మేధ యనఁబడును.

3. చార్వి—మనసుచేత ఊహించుటయందు నేర్పుగలబుద్ధి చార్వి యనఁబడును.

4. చత్వ—గురువులవద్దఁజేరి తనకుఁగలిగిన సందేహముల నన్నిటిని అడిగి వారుచెప్పెడి దంతయు ఓపికతో విసుగులేక వినుబుద్ధి చత్వ యనఁబడును.

5. గృహీత—గురువుచెప్పెడి రహస్యములను పరాకు లేక వినుచుండుబుద్ధి గృహీతయనఁబడును.

6. శ్రౌతి—గురువులవద్దను పెద్దలవద్దను విసుగులేక శుశ్రూషచేయుటయందు సహానముగలబుద్ధి శ్రౌతి యనఁబడును.

7. ప్రతిభ—సమయోచితముగ శృతి స్మృతి యితిహాస అనుభవములనుచూపి వాగ్ధోరణిగలిగి యెదుటివారెవరున్ను ప్రశ్నలు

చేయలేకుండునట్టుల రహస్యములను అనుభవములను చక్కఁగ చెప్పి తేటతెల్లముగ తెలుపుటయందు నేర్పును శక్తియును గలబుద్ధి ప్రతిభ యనఁబడును.

హఠయోగము:—పుణ్యనదీతీరమందు మఠము నేర్పరచుకొని హఠయోగవిషయమును బాగుగాఁ దెలిసిన గురునిదగ్గఱ నుంచుకొని వారిచేత నిర్ణయింపఁబడిన ప్రకారము పథ్యములఁ జేయుచు భోజనాభ్యంగనాదులచేత శరీరరక్షణము చేయుచు గుదాకుంచనముచేత నీళ్లు పీల్చి అధోమలములను కడిగి విడుచుచు కల్పఘృతముల చేతను గండూషాదులచేతను వక్షస్థలకంఠగత కఫపిత్తాదులను వెలుపలికి వెడలగొట్టుచు అంజననస్యాదులచేత కపాలకుహరము నాసికలయందలి మలములను వెలుపలికి వెడలఁగొట్టుచు శరీరమంతయు విభూది పూసుకొని సాత్వికాహారముల భుజించుచు కాయశుద్ధిచేసికొని పెద్దలయందును దైవమందును విశ్వాసముఁ గలవాఁడై నిర్మలమగు అంతఃకరణఁగలవాఁడై మితాహారము మితనిద్రయుగలవాఁడై స్థిరముగ కూర్చొని మూలబంధ ఉడ్యాణబంధ జాలంధర బంధములతోడను అష్టవిధ కుంభకములచేతను ప్రాణవాయువుయొక్క సంచారమును మాన్పి రేచకపూరకంబులనుడిగించి ప్రాణాపానంబుల రెంటిని రేయింబగలొక్క చందంబునఁ గుంభించుట హఠయోగంబు. అట్టినిరోధమువలనఁ గాయసిద్ధియు నాకాశగమన సిద్ధియు దూరదృష్టి దూరశ్రవణసిద్ధులును, అణిమ మహిమ లఘిమ గరిమ ప్రాప్తి ప్రాకామ్యము వశిత్వము యీశత్వము అను అష్టసిద్ధులును, స్వేచ్ఛామరణాదులును గలుగును.

(అష్టసిద్ధులు చూడుఁడు.)

☞ ధ్యానయోగము హఠయోగులకు ముఖ్యమని తెలియునది.

జ్ఞానయోగము:—(రాజయోగము) సమస్త విషయములను శ్రవణ మనన నిదిధ్యాసలచేతఁ బెద్దలవలనఁ దెలిసికొని పరమోప శాంతిగలిగి సర్వకాల సర్వావస్థలయందును బరబ్రహ్మస్వ రూపమందలి యపరోక్షజ్ఞానమువలన జీవన్ముక్తినిఁబొంది విదేహముక్తి పర్యంతమును బ్రారబ్ధము ననుభవించుచు నుండవలెను. రాజయోగికి బ్రాణాయామ మవసరము లేదు. ధారణ ధ్యాన సమాధులు ముఖ్యంబులు.

---

# అష్టాంగములు

యోగాంగములు పూర్వాంగములనియు నుత్తరాంగములనియు రెండువిధములు.

| పూర్వాంగములు. | ఉత్తరాంగములు. |
|---|---|
| 1. యమము. | 5. ప్రత్యాహారము. |
| 2. నియమము. | 6 ధారణము. |
| 3. ఆసనము. | 7. ధ్యానము. |
| 4. ప్రాణాయామము. | 8. సమాధి. |

మంత్ర లయ హఠ రాజయోగములలో నేయోగమభ్యసించినను బూర్వాంగములు ముందుగ నభ్యసించి పిమ్మట ఉత్తరాంగముల న భ్యసింపవలయును.

1. యమము;—అహింస, అస్తేయము, సత్యము, అపరిగ్రహము, బ్రహ్మచర్యము, అని యైదువిధములు.

1. అహింస;—యజ్ఞములయందును, దుర్గాశక్తికినివేదనల యందును, తప్పతక్కిన కాలములయందు జంతువులను జం

పకుండుట. ఈరు పేను నల్లి చీమ యీఁగ మొదలగు స్వల్ప జంతువులను క్రూరములగు పాములు తేళ్లు మండ్రగబ్బలు మొదలగు విషజంతువులను భయంకరములయిన సింహ ములు పెద్దపులులు చిరుతపులులు ఏనుఁగులు అడవిపం దులు యెలుగుబంట్లు మొదలుగాఁగల అడవిమృగములను చంపకయుండుట అహింసయని చెప్పంబడును. ఏప్రాణికిని నొప్పికలుగఁ జేయకుండుట. ఎవని మనస్సునకును ఆయా సము గలిగింపకుండుట.

*"Universal brotherhood."*

2. అస్తేయము:—స్వల్పమందయిన నితరులసొత్తు నాశింపక తన కెంతటికష్టము సంభవించిన నొరుల యాస్తిని దొంగిలింపక తా నెంతటివిపత్తున మునిఁగియున్న నెట్టిపేదఱికము ననుభ వించుచున్నఁ బెఱవారిసొమ్ము తనకు రాఁగోరక అపహరింపు మని నోటఁజెప్పక చేత ముట్టక యుండుట అస్తేయము.

3. సత్యము:—చూచినసంగతి చూచినట్టుగను దెలిసిన సంగతి తెలిసినట్టుగను విన్నసంగతి విన్నట్టుగను చెప్పుట. తన యొక్కగాని యితరుల యొక్కగాని ప్రాణమానములను రక్షించుటకుఁ జెప్పిన యబద్ధము సత్యముగనే యెన్నఁబడఁ దగును. వీలుగలయప్పు డబద్ధము చెప్పియైనఁ బ్రాణమాన ములు రక్షింపనియెడ మహాపాపము గల్గునని పెద్దలయభి ప్రాయము.

4. అపరిగ్రహము:—శిష్యులు తప్ప తక్కినయొవరేమిచ్చినను దానములను బట్టకుండుట.

5. బ్రహ్మచర్యము:—స్త్రీసంభోగము లేక యుండుట. మనస్సు నందైనను స్త్రీలమీఁదఁ గోరిక లేక యుండవలయును.

భార్యకలవాఁడయ్యేనేని ఋతుకాలముయందు మాత్రి మామెతోఁ గ్రీడించి తృప్తిఁబొందువాఁడు బ్రహ్మచారి గానే యెన్నఁబడును.

దోషములు మూఁడు విధములు:—

(1) కాయికము=అన్యస్త్రీని బ్రత్యక్షముగఁ బొందుట కాయికదోషము.

(2) వాచికము= అన్యస్త్రీని గోరుచు నన్యస్త్రీలతోడి సంభాషణమునకు సంతోషించుచు, వారి పొందు లభింపకపోయెనే యెట్లు సమకూడునని మిత్రులతో నాలోచించుచుండుట వాచికదోషము.

(3) మానసికము= అన్యస్త్రీలను వలచి వారికొరకై మనసునఁ బరితపించుచు నెవ్వరికిం దెలియనీయక లోలోనన కృశించుచుండుట.

తనభార్య కాక తక్కిన స్త్రీలందఱు దల్లులనియుఁ దానువారి కుమారుఁడనియుఁ దలఁచుచు స్త్రీలమీఁదకోరిక తప్పించుకొనవలయును ఋతుకాలము=బహిష్ఠైనది మొదలు 16 దినములు. అందు మొదటి నాలుగుదినములు పదునొకండవ దినమును బదుమూఁడవదినమును నిందితములు. అష్టమి, ఏకాదశి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, సంక్రాంతి, వ్రతదినములు, సూతకదినములును నిందితములు. కావున నీదినములయందు స్త్రీసంపర్కము కూడదు. మనదీపమని ముద్దుపెట్టుకొనినచో మూతి కాలును. అట్లే స్వభార్యయైనను ఋతుకాలములయందుద ప్ప తక్కినకాలములయందు సంభోగము కూడదు. శ్రాద్ధమం

దు భుజించిన బ్రాహ్మణుఁడు తనభార్య కోరినను నాఁడుసంపర్కము చేయఁగూడదు. ఋతుస్నానము చేసిన మూఁడుదినములకులోపలఁ గామాతురుడై యుండినను రమింపఁ గూడదు. ఒకపడకయందుఁ బవళించుటయును గూడదు. ప్రాతఃకాలము, పగలు, అర్ధరాత్రములయందును సంధ్యాకాలములయందును రమింపఁగూడదు. దితి సంధ్యాకాలమున కశ్యపునితో బలాత్కారముగ రమింప హిరణ్యకశిపుఁడు హిరణ్యాక్షులు బుట్టి సంధ్యాకాల దోషముచే అతి క్రూరులయిరి. కనుక సంధ్యాకాలమందు సంగమము కూడదు. రాత్రికాలమందే స్త్రీసంభోగముకూడునుగాని పగటఁగూడదు.

"ప్రాణంవా ఏతే ప్రస్కందన్తి యేదివా రత్యా సంయుజ్యన్తే
బ్రహ్మచర్య మేవ తద్యద్రాత్రౌ రత్యాసంయుజ్యన్తే"

ప్రశ్నోపనిషత్-ప్రథమప్రశ్న 13.

అట్లు కానియెడ

4 వ దినముననఁగా స్నానదినమున రమింపఁగా నిల్చిన గర్భమందలి శిశువల్పాయువును దరిద్రమును బొందును.

11 వ దినమున నిల్చిన గర్భ మధర్మమందిచ్ఛగలయాఁడు శిశువును బొందును.

13 వ దినమున నిల్చిన గర్భమున వర్ణసంకరురాలగు కూతురు కలుగును. ఇది నిశ్చయము.

ఉపరతి వలన నిల్చిన గర్భము స్త్రీయొక్క యాకార చేష్టలు గల నపుంసకుని బొందు; లేకున్న బురుష చేష్టలు గల స్త్రీయైనని బుచును. ఆఱుమాసములు మిగిలినగర్భిణి స్త్రీని రమింపఁగూడదు. ఈబ్రహ్మచర్య నియమమును సమస్తమైనవారును జరుపవలయును.

11. నియమము:—స్వాధ్యాయము, సంతోషము, శౌచము, త్రివిధతపస్సులు, ఈశ్వరప్రణిధానము నని యైదువిధములు.

1. స్వాధ్యాయము=వేద మూలమంత్రములను పఠించుట.

(1) వాచికము—నోట బిగ్గరగా యితరులకు వినబడు నట్లు చెప్పుట,

(2) ఉపాంశువు—యితరులకు వినబడకుండ ధ్వనిగలుగ కుండ మనస్సుననే పఠించుట.

(3) మానసికము—ధ్వని లేకుండఁ బ్రత్యక్షరమును విర ళించి నెమ్మదిగా మనసున జపముచేయుట. అన్నిటిలోనను మానసికము ముఖ్యము.

"True prayer is voiceless."

2. సంతోషము=సుఖమునకు సంతోషింపక దుఃఖమునకు వ్యస నపడక ప్రారబ్ధమువలన నేవేళ కేదిప్రాప్తించిననుయాదృచ్ఛా లాభసంతుష్టితో నుండి నిత్యతృప్తి నొందియుండుట.

3. శౌచము=మలినము లేకుండుట.

(1) బాహ్యశౌచము—స్నానము మొదలగు వానివలన శరీరముయొక్క వెలుపలిమలమును బోఁగొట్టుట.

(2) అంతరశౌచము—అరిషడ్వర్గమును బంచమలముల ను విడనాడి మనస్సును బరిశుద్ధముగా నుంచు కొనుట.

4. త్రివిధతపస్సులు:—

(1) శరీరతపస్సు— యమమునందలి అహింస అస్తేయ ము సత్యము అపరిగ్రహము బ్రహ్మచర్యము అ నునవియును శౌచము నందలి బాహ్యపరిశుద్ధము

అంతరపరిశుద్ధము అనునవియును అణకువయును విధేయతయును గలిగి దేవతలను పెద్దలను బ్రాహ్మణులను గురువులను పండితులను సన్యాసులను హంసలను పరమహంసలను అవధూతలను సాధులను బూజించుట శరీరతపస్సు.

(2) వాక్తపస్సు—సత్యములై మనోహరములగు మాటలాడుట. వేదమూలమంత్రములను పఠించుట వాక్తపస్సు.

(3) మనోతపస్సు—మనోనిగ్రహమును మనశ్శుద్ధియును మంచినడతయును గలిగియుండుట. నిర్మలమగు మనస్సు గలిగి యుండుట మనోతపస్సు.

5. ఈశ్వరప్రణిధానము:—

సీ॥ కరణంబు లఖిలోపకరణంబులునుగాఁగఁ
ప్రాణంబు లుపచార భటులుగాఁగ
గంగాప్రముఖనాడికలు జలంబులుగాఁగ
షట్కమలములు పుష్పములుగాఁగ
జఠరాగ్ని హోత్ర ముజ్జ్వలధూపవిధిగాఁగఁ
బటుజీవకళలు దీపములుగాఁగ
నందితానందంబు నైవేద్యముంగాఁగ
రవిశశిజ్యోతు లారతులుగాఁగ

గీ॥ నంగ దేవాలయమున సహస్రకమల
పీఠమున శాంతి జనకజోపేతుఁడగుచుఁ
జెలగుఁ బరమాత్మ రాము నర్చించుచుంట
తత్వవిదు లీశ్వరప్రణిధానమంద్రు.

జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములు నంతరింద్రియములును బాజాపాత్రములుగను దశవిధప్రాణములు పనివాగులవాండ్రుగను గంగాయమునా సరస్వత్యాది నామములుగల యిడా పింగళా సుషుమ్నా దులగునాడు లభిషేకాది జలములుగ మూలాధార స్వాధిష్ఠానమణిపూరకఅనాహత విశుద్ధ ఆజ్ఞేయములను షట్కమలములు పుష్పములుగనుజఠరాగ్ని ధూపముగను జిత్కళలు దీపములుగను బ్రహ్మానందము నైవేద్యముగను సూర్యచంద్రులమండలజ్యోతు లారతులుగను జేసి శరీరమనెడు దేవాలయమందు సహస్రార కమలమనెడి సింహాసనముపైన శాంతియనెడు సీతతోఁగూడియుండు పరబ్రహ్మస్వరూపుఁడగు శ్రీరాముని నెల్లప్పుడు పూజించుచుండుటయె, యీశ్వరప్రణిధాన మని తాత్పర్యము.

## III. ఆ స న ము లు.

ఆసనము లెనుబదినాలుగు లక్షలు. అందు ముఖ్యములగునవి వివరింపఁబడును.

1. పద్మాసనము.—కుడితొడమీఁద నెడమపాదము నెడమతొడ మీఁదఁ గుడిపాదమునుంచి వెనుకప్రక్కగఁ గుడిచేతితోఁ గుడికాలిబొటనవ్రేలు నెడమచేతితో నెడమకాలిబొటనవ్రేలును బట్టుకొని గడ్డము వక్షస్థలమునకు దగులునట్లుగఁదలవంచి భ్రూమధ్యమందు దృష్టినిలిపి యుండునది. ఇది గృహస్థులకు ముఖ్యము.

2. సిద్ధాసనము.—ఆసనమందు (మలద్వారమున) నెడమకాలి మడిమయు లింగస్థానమందుఁ (మూలద్వారమున) గుడికాలి మడిమయు నునిచి, శరీరము వంకర లేకుండ నిలిపి కొంచముగా తలవంచి సగము కన్నులు మూసి నిమీలితనేత్రుఁడై భ్రూమధ్యమందు దృష్టిని నిలిపి ఆత్మావలోకన చేయునది.

గృహస్థులకు పద్మాసనము ముఖ్యము. తక్కిన యాశ్రమస్థులకు సిద్ధాసనము ముఖ్యము. యీఆసనమువలన మనస్సు నిర్మలమగును. ఇంద్రియనిగ్రహముగలిగి తద్వారా దేహదారుఢ్యమున్ను ముఖవర్చస్సున్ను కలుగును. ముఖముషోడశకళాపరిపూర్తిగల దై యుండును.

3. భద్రాసనము.—కాలి చీలమండలను అండములక్రింద నునిచి రెండుమడిమలను రెండుచేతులం బట్టుకొని కదలక భ్రూమధ్యమున దృష్టిని నిలుపునది.

4. సింహాసనము.—ఎడమపిఱ్ఱక్రిందఁగుడికాలిమడిమయు కుడిపిఱ్ఱక్రింద నెడమకాలిమడిమయు నునిచి తనరెండుచేతులవ్రేళ్లను రెండుమోకాళ్లమీఁద సవ్యముగ వెడల్పుగ నునిచి నిక్క సరిగాకూర్చుండి నోరుదెఱచికొని భ్రూమధ్యమందు దృష్టిని నిలిపి ఆత్మావలోకన చేయునది.

☞ పద్మాసనము సిద్ధాసనము భద్రాసనము సింహాసనములనునాలుగుయాసనంబులు ముఖ్యంబులని తెలియునది.

5. వీరాసనము.—ఒకతొడమీఁద నొకపాదమును మఱియొకతొడక్రింద రెండవపాదమును జేర్చి శరీరమును వంకరలేకుండ నిలిపి భ్రూమధ్యమందు దృష్టి నిలిపియుండునది.

6. మతాంతరపద్మాసనము.—కుడితొడమీఁద నెడమపాదమును ఎడమతొడమీఁద కుడిపాదమును వెలికిలనుంచి తొడపైహస్తములనుంచిముక్కుకొనయందు లక్ష్యమునునిలిపి నెమ్మదిగ వాయువును పూరించుటయే మతాంతరపద్మాసనము.

7. ముక్తపద్మాసనము.—కుడితొడమీఁద నెడమపాదము నెడమతొడమీఁదఁ గుడిపాదము నుంచి వెనుకప్రక్కఁగ గుడిచేతి

తోఁ గుడికాలిబొటనవ్రేలు నెడమచేతితో నెడమకాలిబొటనవ్రేలును బట్టుకొని గడ్డము వక్షస్థలమునకుఁ దగులునట్టుగ దలవంచి రేచించి ఊర్ధ్వముఖవ్యాపనముచేసి కుండలిని పెకళించి భ్రూమధ్యమందు దృష్టిని నిలుపవలెను. దీనినే ముక్తపద్మాసనమనియుఁ బద్ధపద్మాసనమనియుఁ జెప్పుదురు.

8. కుక్కుటాసనము:—కుడితొడమీఁద నెడమపాదము నెడమతొడమీఁదఁ గుడిపాదము నుంచి గడ్డము వక్షస్థలమునకు దగులునట్టుగఁ దలవంచి పిక్కలకుం దొడలకును నడుమ జేతుల దూర్చి యాచేతులను నేలమీఁద మోపి పైకి లేచినట్లుండి భ్రూమధ్యమందుండు చిద్బిందువును జూచుచుండునది.

9. కూర్మాసనము:—కాలి మడమలమీఁదఁ గూర్చుండి భ్రూమధ్యమందు దృష్టిని నిలుపునది.

10. ఉత్థానకూర్మాసనము:—కుడితొడమీఁద నెడమపాదము నెడమతొడమీఁదఁ గుడిపాదము నుంచి గడ్డము వక్షస్థలమునకు దగులునట్టుగఁ దలవంచి తనరెండుచేతులతో తనకంఠమును బట్టుకొని వెలికిలబడియుండిభ్రూమధ్యమందలిచిద్బిందువును జూచుచుండెనేని యుత్థానకూర్మాసన మని చెప్పఁబడును.

11. మతాంతర సిద్ధాసనము:—లింగస్థానమునకు మీఁదుగా నెడమకాలిమడమ నునిచి ఆమడిమపైన కుడికాలిమడిమ నునిచి భ్రూమధ్యావలోకన చేయుచుండుటయేమతాంతర సిద్ధాసన మని చెప్పుదురు.

12. స్వస్తికాసనము:—పిక్కలకును దొడలకును నడుమఁ బాదములఁ జేర్చి శరీరమువంకర లేకుండ నిలిపి భ్రూమధ్యమందు దృష్టిని నిలిపియుంచునది.

13. యోగాసనము:—ఎడమతొడక్రిందఁ గుడిపాదమును గుడితొడ క్రింద నెడమపాదము నుంచి తొడలనడుమఁ జేతులు గ్రుచ్చి పిక్కలఁబట్టుకొని శరీరము వంకర లేకుండ నిలిపి భ్రూమధ్య మందలి చిద్బిందువును తిలకించుచుండెనేని యోగాసన మని చెప్పుదురు.

14. గోముఖాసనము:—ఎడమకాలి మడిమ కుడివీఁపుప్రక్కగాను కుడికాలిమడిమ యెడమవీఁపుప్రక్కగాను మోకాలిమీఁద మోకాలు గదియనుంచి శరీరమువంకర లేకుండ నిలిపి, భ్రూమధ్యమందు దృష్టిని నిలుపునది.

15. కపాలాసనము.—కాళ్ళుమీఁదికిని దలక్రిందికి నునిచి భ్రూమధ్య మందు దృష్టి నిలిపి యుంచునది. ఈఆసనము నిత్యము క్రమ క్రమముగా నొకజాము అభ్యాసము చేయుచుండిన సమస్త రోగములను నివర్తి చేయును జఠరాగ్ని ప్రజ్వరిల్లఁజేయును. అల్పభోజనముచేత వాయుసంచారము తగ్గించును. శరీరము బహు తేలికగ నుండును. ఇట్లు మూఁడుసంవత్సరము లభ్య సించెనేని సాక్షాత్పరశివుఁడే యగును.

16. ముక్తాసనము:—ఎడమకాలి మడిమచే గుదస్థానమును గప్పి, కుడి పాదము నెడమతొడమీఁద నునిచి భ్రూమధ్యమందు దృష్టి నిలిపి యుంచునది.

17. ధనురాసనము—కాలిబొటనవ్రేళ్లను రెండుచేతుల వీఁపువెనుక చెవులకుసరిగాఁ బట్టి భ్రూమధ్యావలోకన చేయుచుండెనేని ధనురాసన మనెదరు.

18. మయూరాసనము.—చేతుల నేలమీఁద మోపి మోచేతుల నాభియిరుప్రక్కల నునిచి ముఖము పైకెత్తి రెండుకాళ్ళు

చాఁచి నెమలి తోఁకవలెపైకెత్తి భ్రూమధ్యమందలి చిద్బిం
దువును తిలకించుచున్న మయూరాసనమగును.

19. టిట్టిభాసనము — పాదములు వెలికిలనుండ శిరస్సుపైఁగదియిం
చి తలను గట్టిగ పాదములతో పట్టుకొని చేతులతోఁ బూ
నికగా నిలిచి ముడ్డిని పైకెత్తి ఆత్మావలోకన చేయఁగా టిట్టి
భాసన మని చెప్పుదురు.

20. అర్భకాసనము — గొంతుకూర్చుండి మోకాళ్లమీఁద తలపెట్టి
మోకాళ్లను చేతులతో చుట్టిపట్టుకొని లక్ష్యానుసంధానము
చేయఁగా అర్భకాసన మని చెప్పుదురు.

21. కామదహనాసనము.—కాలి వ్రేళ్ళు మడిచి భూమిమీఁద నిలిపి
మోకాళ్ళ క్రిందనూనక మడిమలమీఁద పిఱుదులనుంచి కూ
ర్చొని హంసదండముమీఁద చేతులనూని నిక్కి భ్రూమధ్య
మందు లక్ష్యముంచి ఆత్మావలోకన చేయఁగా కామదహనా
సన మని చెప్పుదురు.

22. పూర్వతానువాసనము.—కాలి వ్రేళ్ళు మడిచి భూమిమీఁద ని
లిపి మడమలు పిఱుఁదులును జేర్చి తలను చేతులతోను
నడుమును మోచేతులతోను అదిమి పట్టుకొని నడుమును
నిక్కించి భ్రూమధ్యమందలి ముక్తికాంతను చూచుచుండఁ
గా పూర్వతానువాసన మని చెప్పుదురు.

23. పశ్చిమతానువాసనము.—నేలమీఁద రెండుకాళ్లను జక్కఁగాఁ
జాచి మోకాళ్లమీఁదఁ దలపెట్టి రెండుకాళుల బొటనవ్రే
ళ్లను రెండుచేతులం బట్టికొని భ్రూమధ్యమందు దృష్టినిలిపి
యుంచునది.

☞ అన్ని యాసనములలోనను సుఖాసనము పరమశ్రేష్ఠమైనది.

24. సుఖాసనము.—అంతర బాహ్యాదృశ్యములన్నియుఁ బరబ్రహ్మ స్వరూపమనియు, అపరబ్రహ్మస్వరూపమే తానని యుఁదలఁచి యేసంకల్పమును లేక, నిస్సంకల్పుఁడై బడలిక, జాడ్యము, నిద్ర, ఆయాసము మున్నగునవి యేపరబ్రహ్మస్వరూపమున నుండుటచేతఁ గలుగవో యట్టియునికియే సుఖాసనము. ద్రష్ట, దర్శన, దృశ్యములు, (అనఁగాఁజూచువాఁడు, చూపు, చూడఁబడునది.—respectively) యేపరబ్రహ్మమందు లయమగుచున్నవో, యట్టిపరబ్రహ్మమునందే దృష్టినిలుపవలెంగాని యభ్యాసకులవలె భ్రూమధ్యమున లక్ష్యములు నిలుపరాదు. ఇదియ యమనస్క రాజయోగ లక్షణము.]

## IV. ప్రాణాయామము.

ప్రాణాయామము ప్రాకృతప్రాణాయామమని వైకృతప్రాణాయామమని కుంభకప్రాణాయామమని మూఁడు విధములు.

1. ప్రాకృతప్రాణాయామము=అజపరూపమంత్రయోగము. (చూడుము—61 పుట.)

2. వైకృతప్రాణాయామము=ఎడమముక్కున వాయువును బూరించి సగభాగము కుంభకమందు నిలిపి కడమసగమును కుడిముక్కున రేచింపవలెను. మఱలఁ గుడిముక్కునఁ బూరించి సగము కుంభకమందు నిలిపి, కడమసగము నెడమముక్కున రేచింపవలెను. ఈతీరున యథాశక్తిగఁ బ్రాణాయామము చేయుచుండవలెను.

3. కుంభకప్రాణాయామము—మూలబంధ ఉడ్యాణబంధ జాలంధర బంధములఁ గావించి, వాయువును పూరింపక, రేచింపక ఏకరీతిని నిలుపుట.

పూరకము—ఉత్పత్తి; రేచకము—సంహారము; కుంభకము—స్థితి.

పూరించుట=ప్రాణవాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్రపర్యంతము సుషుమ్నా నాళి ద్వారముగ ఉత్థాపనము చేయుట. దీనినే కుండలిని మేల్కొలుపుట యనియు చెప్పుదురు.

రేచించుట=బ్రహ్మరంధ్రపర్యంతము పూరించిన వాయువును మరల సుషుమ్నా నాళి ద్వారముగ మూలాధారమునకుఁ జేర్చుట.

కుంభించుట=పూరించిన వాయువును కొన్ని నిముషములు రెండు ముక్కులను మూసి రేచించకుండ బ్రహ్మరంధ్రమందు అనఁగా కపాలకుహరమందు నిలుపుట. ఇదియే ఊర్ధ్వకుంభకము.

అధఃకుంభకము=రేచించిన వాయువును కొన్ని నిముషములు రెండు ముక్కులుమూసి, పూరించకుండ మూలాధారమందు నిలుపుట. ఇదియే అధఃకుంభకము.

ప్రాణాయామము రెండు భాగములు.—కుడిముక్కు నుమూసి యెడమముక్కుగుండ వాయువును లోపలికిఁ బీల్చి, ఎడమముక్కు మూసి కుడిముక్కుగుండ వాయువును లోపలినుండి విడుచుట పూర్వభాగము. ఎడమముక్కు మూసి కుడిముక్కుగుండ వాయువును లోపలికిఁ బీల్చి కుడిముక్కుమూసి యెడమముక్కుగుండ వాయువునులోపలినుండి విడుచుట ఉత్తరభాగము.

మూలబంధము=ఎడమకాలి మడమచేత గుదస్థానమునుమూయుట.

ఉడ్యాణబంధము=కుడికాలి మడమచేత నాభిస్థానమును మూయుట

జాలంధరబంధము=తలవంచి, గడ్డము ఱొమ్మునానం దుంచుట.

యోనిబంధము=కాలి మడమచేత గుదస్థానమును మూయుచు అపానవాయువును ఊర్ధ్వముఖముగా పయికి పీల్చి యుంచు నది యోనిబంధము.

ఈవిధముగఁ బ్రాణాయామము నిత్యము నభ్యాసము చేయుటవలన శరీరము తేలిక యగును. అభ్యాసము కాను కాను కేవలకుంభకమగును,

చెమటపట్టును. ప్రాణాయామము చేయుటవలన పైత్యము దగ్గు మొదలగు వ్యాధులు నెమ్మదించును. ఏవ్యాధియు నుండదు. భోజనానంతరమీయభ్యాసము చేయగిట్టదు. తెల్లవారుజామునఁ జేయుట యుక్తము

Note.—యమ నియ మాసనంబులు అభ్యసించిన పిమ్మటనే ప్రాణాయామ మభ్యసించవలయును. అట్లుగాక ముందుగాఁ బ్రాణాయామ మభ్యసించినచో హృదయవ్యాధులకుఁ గారణమగును. కావున జాగరూకత గలవారై యమనియమాసనంబులు ముందు అభ్యసించునది.

## V. ప్రత్యాహారము.

జ్ఞానేంద్రియములను కర్మేంద్రియములను అంతరింద్రియములను వాని వానివిషయములకుఁ బోనీయక మఱలించుట ప్రత్యాహారము. ఈప్రకారము నిత్యము నభ్యసించిన నింద్రియములు స్వాధీనములగును. ప్రాణాయామమువలన వాయువు నిలిచినపు డింద్రియవ్యాపారములును నిలుచును, మనసుసైతము నిలుచును.

**జ్ఞానేంద్రియములు**

- శ్రోత్రేంద్రియము—(చెవి) వర్ణరూప ధ్వనిరూపములైన సకల శబ్దములను వినును.
- త్వగింద్రియము—(చర్మము) మృదువు కఠినము ఉష్ణము శీతము మొదలగు గుణములను తాఁకుటవలన గ్రహించును.
- చక్షురింద్రియము—(కన్ను) పొట్టి పొడుగు లావు సన్నముగల రూపములను నలుపు తెలుపు పసుపు నీలము సునీలము యింద్రనీలము పీతము ఎఱుపు ఆకుపచ్చ మొదలుగాఁ గల రంగులుగల అనేకరూపములను జూచును.
- జిహ్వేంద్రియము—(నాలుక) ఉప్పు పులుసు కారము తీపు చేదు వగరు అను రుచులను గ్రహించును.
- ఘ్రాణేంద్రియము—(ముక్కు) సుగంధ దుర్గంధములగు వాసనలను గ్రహించును,

కర్మేంద్రియములు.

వాగింద్రియము—(నోరు)శబ్దములను బలుకును.
పాణీంద్రియము—(చేయి) ఇచ్చుట పుచ్చుకొనుట మొదలగుపనులు చేయును.
పాదేంద్రియము—(కాలు)నడుచుట ఎగురుట పరుగెత్తుట మొదలగు పనులు చేయును.
పాయ్వింద్రియము—(గుదము) మలవిసర్జనముచేయును.
ఉపస్థేంద్రియము—(యోని లేక శిశ్నము)మూత్రవిసర్జనముచేయును. సురతాదులచేత నానందించును.

అంతరింద్రియములు.

మనస్సు—కోరికలను బుట్టించును.
బుద్ధి—నిశ్చయించును.
చిత్తము—ఆలోచించును.
అహంకారము—మూర్ఖముతో పనులు చేయించును.

ఈపదునాలుగింద్రియములను తమతమవ్యాపారములకుఁ బోనీయక నిలుపవలెను. ఏసంగతినైన నాలోచించునప్పుడు మనస్సు ఆపనియందే నిలుచును. అట్టిసమయమున నెదుట నున్న వస్తువు కన్నులకుఁగనుపడదు ఇతరులు చెప్పుమాటలును వినఁబడవు. ఇది సర్వత్ర యనుభవమువలనఁ దెలియువిషయమే.అదేప్రకారముమనస్సుపరబ్రహ్మస్వరూపమందులయమైనఁ బదునాలుగింద్రియములును వ్యాపారశూన్యములై నిలుచును.

## VI ధారణము.

మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞేయము, సహస్రారము, ననెడుకమలములయందు(అనఁగా చక్రములయందు) వానికి నధిదేవత లయినగణపతి, సరస్వతితోడి బ్రహ్మ,లక్ష్మితోడివిష్ణువు, గౌరితోడిరుద్రుఁడు,ఈశ్వరుఁడు,సదాశివుఁడు, పరమాత్మ (respectively) యనువాని నాయాస్థలములయందు

ధ్యానించునపు డాధారాచక్రములయందు మనస్సును నిలుపుటయే ధారణము. ఈప్రకారముగ నిత్యము నభ్యసించినచో శరీర మెట్లునిలిపిన అట్లు నిలుచును. అభ్యాసమందు చెమటపట్టును. మనస్సుణఁగి యుండును. వృత్తిరహితముగును. వాయువుయొక్క రాకపోకలనుడిగిన ఒకజాము నిలిపిన సమర్థుఁడగును.

## VII ధ్యానము.

ధ్యానము సగుణధ్యానమనియు నిర్గుణధ్యానమనియు రెండువిధములు:-

1. సగుణధ్యానము.—హృదయపద్మమందు విరాట్పురుషుని నిలిపి మనస్సుచేత సమస్తవస్తువులను గల్పించి షోడశోపచారములను జేసి ధ్యానింప వలెను. పయినవ్రాసిన "నియమ" మందలి యీశ్వరప్రణిధానలక్షణమును జూడుఁడు.(చూ—పుట. 70.)
2. నిర్గుణధ్యానము.—వీరాసనమున నుండి, చేతులను తొడలమీఁదనుంచుకొని నేత్రంబులు మూసి, "అహం బ్రహ్మాస్మి" అను వ్యాఖ్యమునుచొప్పునఁ బరబ్రహ్మస్వరూపమే తానని నిర్వికల్పనిష్ఠఁ గలిగి యుండుట. స్థూలసూక్ష్మకారణశరీరములు తానుగావనియుఁ బంచప్రాణములు ఉపవాయువులు తానుగావనియుఁ బదునాలు గింద్రియములు తానుగావనియు, శరీరప్రాణేంద్రియములకుఁ దాను సాక్షి యనియు, నట్టిసాక్షిత్వమును వృత్తియోగమునఁ పరబ్రహ్మస్వరూపమే తానవియు, సర్వదా బ్రహ్మనిష్ఠయుండే యుండుట.

ఇట్లుధ్యానము చేయుట నిత్యము నభ్యాసము చేయఁగ నాత్మజ్యోతి దరిశన మిచ్చును. సత్యజ్ఞానానంద నిత్య నిర్మలాఖండ స్వరూపమగు పరబ్రహ్మమే తాననెడి నిశ్చయము స్వానుభవవేద్య మగునట్లు సర్వకాల సర్వావస్థలయందు ప్రారబ్ధనాశనపర్యంతము దేహావసానపర్యంతము నిర్వికల్పబ్రహ్మనిష్ఠ గలిగియుండుటే నిర్గుణధ్యానము.

# VIII. సమాధిః

శ్లో॥ సవికల్పో నిర్వికల్ప స్సమాధి ర్ద్వివిధా భవేత్
దృశ్య శబ్దాను విద్ధోయం సవికల్పః పునర్ద్విధా॥

సమాధి సవికల్పమని నిర్వికల్పమని రెండువిధములు. అందు సవికల్పము దృశ్యానువిద్ధసవికల్పమనిశ్శబ్దానువిద్ధసవికల్పమని రెండు విధములు. ఈమూండును బాహ్యాంతర భేదములచేత నాలు విధములయ్యెను. సమాధి ముక్తికిమార్గము. ముముక్షువులకు సహజనిర్వికల్పసమాధియు సుఖాసనమును ముఖ్యములు.

సమాధి సవికల్పమని నిర్వికల్పమని రెండువిధములు:—

1. సవికల్పసమాధి. ఇది రెండు విధములు.
   (1) దృశ్యానువిద్ధసవికల్పసమాధి.
   (2) శబ్దానువిద్ధసవికల్పసమాధి.
2. నిర్వికల్పసమాధి.

ఇవి బాహ్యాంతరభేదములచేత నాలువిధములు. వానివివరము.

1. బాహ్యదృశ్యానువిద్ధసవికల్పసమాధి:—బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నెడిత్రిమూర్తులు యిందాదిదేవతలు మనుష్యులు పశువులు పక్షులు క్రిమికీటకాదులు మొదలగుచేతనములును కొండలుగుహలు పర్వతములు మొదలుగాంగల అచేతనములును నేత్రములకు గోచరములగు బాహ్యదృశ్యము లనుసమస్త చేతనాచేతనములును దన తెలివియుందేపుట్టి నశించును గనుక నట్టిదృశ్యములకుం దాను విలక్షణుండ ననియుం బరబ్రహ్మస్వరూపమే తాననియుం దలంచుట బాహ్యదృశ్యానువిద్ధసవికల్పసమాధి యనంబడును.

2. అంతరదృశ్యానువిద్ధసవికల్పసమాధి :—తనయందు స్వభావము చేతఁ బుట్టునంతరదృశ్యములకు ననఁగా వృత్తులకుఁ దానువిలక్షణుఁడననియుఁ బరబ్రహ్మస్వరూపమే తాననియుఁ దలంచుటఅంతర దృశ్యానువిద్ధసవికల్పసమాధి యని చెప్పుదురు.

3. బాహ్యశబ్దానువిద్ధసవికల్పసమాధి:—బాహ్యశబ్దములనెడుసమస్త నామములకుఁ దాను విలక్షణుఁడ ననియు నామరూపక్రియారహిత మగు పరబ్రహ్మస్వరూపమే తాననియుఁదలంచుచు ఆనందముననే దేలుచుండుట బాహ్యశబ్దానువిద్ధసవికల్ప సమాధి యని తెలియునది.

4. అంతర శబ్దానువిద్ధసవికల్పసమాధి:—అంతరశబ్దములనెడు కామ క్రోధలోభమోహమదమాత్సర్యములు మొదలగువానికి ప్రణవనాదమందలి చిణీనాదము, చిణిచిణీనాదము, ఘంటానాదము, శంఖనాదము, వీణానాదము, తాళనాదము, వేణునాదము, భేరీనాదము, మృదంగనాదము, మేఘనాదములను దశవిధనాదంబులకుఁదాను విలక్షణుఁడననియుఁ బరబ్రహ్మస్వరూపమే తాననియు దలంచుటఅంతరశబ్దానువిద్ధసవికల్పసమాధియని చెప్పఁబడును.

5. బాహ్యనిర్వికల్పసమాధి:—పైనాలుగువిధములగు సవికల్పసమాధులయందును స్థిరమై అంతరబాహ్యములయందుఁ దనకంటె భిన్నమయిన దేదియుఁ దోచక పరబ్రహ్మస్వరూపముఁగనె కనుపించుట బాహ్యనిర్వికల్పసమాధి యనఁబడును.

6. అంతరనిర్వికల్పసమాధి:—తాను విలక్షణుఁడ ననెడువృత్తియు లేక తానే పరబ్రహ్మ స్వరూపమనెడు వృత్తియు లేక, యఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మస్వరూపమై తాను తానై యుండుట అంతరనిర్వికల్ప సమాధియని ప్రసిద్ధము.

(అనుభవమువలననే తెలిసికొనవలయును.)

ఈసమాధులయందు వాయువు పూర్తిగా నిలుచును. నిద్రకంటెనధికమయిన సుఖము కలుగును. సమాధినిష్ఠాగరిష్ఠునకు నన్నపానాదులయందుఁ గోరికయుండదు. బంగారము మట్టియు సమముగనే తోఁచును. అతనికి శీతోష్ణములు, సుఖదుఃఖములు, జాతిమతములు, శాస్త్రములు, కర్తలు,నుండవు.భూషింపఁడు.కొట్టడు కొట్టఁబడఁడు.తిట్టఁడు తిట్టువడఁడు చక్రవిషయమున సహస్రారమందు సమాధిని గూర్చి వ్రాయఁబడును.

☞ మఱియు సంప్రజ్ఞాతసమాధియని అసంప్రజ్ఞాతసమాధియని రెండు విధములు. అందు—మనస్సు పూర్తిగా అయిక్యము కాకుండా వుండేస్థితిగల సమాధి సంప్రజ్ఞాతసమాధి యనియు మనస్సు పునరావృత్తిరహితముగాఅయిక్యమయిబ్రహ్మానందమునమునిగి యుండేస్థితిగలసమాధిఅసంప్రజ్ఞాతసమాధియనియుఁ జెప్పుదురు. సంప్రజ్ఞాతసమాధియందు ప్రజ్ఞ యుండును అసంప్రజ్ఞాతసమాధియందు ప్రజ్ఞ లేదు. ఈయసంప్రజ్ఞాతసమాధియే అంతరనిర్వికల్ప సమాధి యని తెలియునది. యీరెంటికిని భేదమేమియు లేదు.

శ్రమలేక నిర్వాణప్రాప్తి కానేరదు. సకల ప్రాణులు మరణించుటయందు ఆత్మ నేత్రములగుండానో లేక అధోముఖముగామూలాధారముగుండానో లేక మరియేద్వారముననో బయలువెడలును. ఇట్టిసమాధులయందు అభ్యసించిన సమాధినిష్ఠాగరిష్ఠునకు కపాలకుహరము అనఁగా బ్రహ్మరంధ్రముగుండాఆత్మ అంతరాత్మ పరమాత్మ బయలువెడలును. సమాధినిష్ఠుని శరీరము మంచికళలు గలిగియుండును. వస్త్రీ చూచినను మోహించునట్లు ప్రకాశమానముగ నుండును.స్వప్రకాశము దానంతట అదే బయలువెడలును. చిత్తము ప్రాణవాయువుతో కూడా సుషుమ్నతో కలియును చిత్తనిరోధమగును, అప్పుడుమనస్సునిలుచును,

Note—ప్రాణాయామముగాని సమాధులుగాని అభ్యాసకులు జాములకు (3 hours) మించి చేయగిట్టదు. స్త్రీసంపర్కమువలన బలహీనము యిత్యాదియనష్టములగును. స్త్రీసంపర్కము లేకుండ యోగాభ్యాసము చేయువానికి శరీరమంతా సుగంధము వ్యాపించును. విశేషముగా స్త్రీసంపర్కము గలవానికి శరీరమంతయు దుర్వాసన యగును.

☞ సమాధికివిఘ్నములు--- రోగము,బడలిక, సందేహము,అజాగ్రత, సోమరితనము,విషయలోలత్వము,తప్పుఅభిప్రాయము,స్థిరము లేమి,బాధ,హీనత్వము,జాడ్యము,ఆయాసము,దగ్గు మొదలగునవి గలవి. ఇవియున్నప్పుడు సమాధులు చేయగిట్టదు. ముఖ్యముగా ప్రతిబంధములనునివర్తి చేసుకొనిసమాధినిష్ఠలకు కూర్చుండవలయును

☞ తత్వములు---పాదము మొదలు మోకాళ్ల వఱకు లకారము బీజము పృధివీతత్వము, మోకాళ్లు మొదలు గుదస్థానమువఱకు వకారము బీజము ఆపోతత్వము, గుదము మొదలు హృదయము వఱకు రకారము బీజము అగ్నితత్వము, హృదయము మొదలు భ్రూమధ్యమువఱకు యకారము బీజము వాయుతత్వము, భ్రూమధ్యము మొదలు కపాలకుహరము వఱకు హకారము బీజము ఆకాశతత్వము అని తెలియునది.

## పంచదశయోగాంగములు.

యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆసనము, మూలబంధము, దేహసామ్యము, దృక్స్థితి, ప్రాణాయామము ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధియుని పదునైదు యోగాంగములు. అందు:—

1. యమము---పృథివ్యాపస్తేజో వాయురాకాశము లనెడుపంచభూతములు, స్థూలసూక్ష్మకారణశరీరములు, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా

ఘ్రాణముల నెడు జ్ఞానేంద్రియములు, వాక్పాణిపాదపాయూపస్థల నెడు కర్మేంద్రియంబులు, మొదలగు బాహ్యాదృశ్యములును; మనోబుద్ధి చిత్తాహంకారముల నెడు నంతరింద్రియములు, ప్రాణాపానవ్యానోదానసమానము లనెడుపంచప్రాణములు, నాగకూర్మకృకుర దేవదత్తధనుంజయు లనెడు నుపవాయువులు, మొదలగునంతరదృశ్యములును; పరబ్రహ్మస్వరూపమనియు, ఆయవాఙ్మానసగోచరమగు పరబ్రహ్మమే తాననియుఁ దలంచుట యమమని చెప్పఁబడును.

2. నియమము—చతుర్దశేంద్రియములకును వానివానివిషయములకును దాను విలక్షణుఁడననియు, సచ్చిదానందస్వరూపుఁడననియు, సత్వరజస్తమోగుణసంబంధములైనవృత్తులు లేనివాఁడననియు, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు లనెడుజాతులు లేనివాఁడననియు, స్థూలసూక్ష్మస్వరూపములు లేనివాఁడననియుఁ బేరులేనివాఁడననియు, గనుకనే నామరూపక్రియారహితుఁడననియుఁ దెలిసికొని, సర్వకాలసర్వావస్థలయందును బ్రహ్మానందములో మునిఁగియుంకుట.

3. త్యాగము—శరీరము యింద్రియములు మనస్సు ప్రాణములు మొదలుగాఁగలవి తానుగాననివానియందభిమానము వదలియుండుట; సంకల్పరాహిత్యము.

4. మౌనము—"యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ" మనస్సుతోఁగూడఁ బరబ్రహ్మమును జెందనేఱక వాక్కులు మఱలుచుండును; అట్టి పరబ్రహ్మమునందే మనస్సునుమగ్నము చేసియుంచుట. మనస్సు పరబ్రహ్మమునుజూడనేరదుగాని పరబ్రహ్మమందైక్యమగును; అనఁగాఁబరబ్రహ్మమే తానగును.

"పరా ప్రాణమయీ ప్రోక్త పశ్యంతీచ మనోమయీ
మధ్యమాయింద్రియాణ్యాహుః వైఖరీవాగితిస్మృతాః"
వాక్కులు నాలుగువిధములు:—

(1) పరావాక్కు=సంకల్పము పుట్టుట.

(2) పశ్యంతివాక్కు=సంకల్పమును వెలువరించుట.

(3) మధ్యమవాక్కు=దంతతాలోష్ఠ వ్యాపారములతోఁ గూడినది.

(4) వైఖరీవాక్కు=బిగ్గఱగా మాటలాడుట.

ఈవాక్కులు దిగువనుండి యొకటొకటి యడఁగిపోఁగా జీవుఁడు నిలిచెను పరావాక్కు కూడ లేనప్పుడు బ్రహ్మానందము కలుగును. అట్టిస్థితియె మౌనము. మితభాషిగా నుండుట. మాటలాడినచోఁ జెప్పినమాటలను జ్ఞప్తినుంచక, యేసంకల్పమును లేక, నిస్సంకల్పుఁడై యుండుట.

5. దేశము—ఏప్రదేశమునందు మనసును నిలిపిన నింద్రియసంబంధములగు వికారములు లేనిదియు, సుఖదుఃఖములు జననమరణములు తాపత్రయములు మొదలుగాఁగలవి లేనిదియు, సర్వకాలసర్వావస్థలయందును సత్యమై నిర్మలమై శ్రేష్ఠమై సచ్చిదానందస్వరూపమగునదియును పెద్దలచేతఁ దెలియఁదగినదియు నవాఙ్మానసగోచరంబునగు పరబ్రహ్మము తెలియునో, యట్టిప్రదేశమే యేకాంతస్థలము. ఈసంగతిని పెద్దలవలనఁ దెలియఁజాలక బహుజను లేకాంతదేశమన నిర్జనప్రదేశమనియు నట్టడవియనియుఁ దలంచి యడవులకేగి తపస్సుచేయుదురు. గుహలకేగెదరు. అట్లుపొరఁబడక యేకాంతదేశమును జక్కఁగఁ దెలిసికొనవలెను. అదియె యాత్మ

గుహ యని చెప్పుదురు. అదియె యింద్రియోని. అట్టియో నియందు రమించిన నిరంతరసుఖముకలుగును. అట్లుచేయక యడవికిఁబోయినను, లేక గుహలలోఁ గూర్చుండినను మన సుమాత్రము నిలువక విషయములకుఁ బోవుచుండును. మనసు నిస్సంకల్పమయినయెడ నడవులతోడను, గుహలతోడను బ్రయోజనము లేదు.

[మూఢుము—చక్రవిషయము:-సహస్రారము]

6. కాలము—ప్రపంచవ్యవహారమందు వలెఁ గాలనియమము లేక యఖండముగాఁ బ్రకాశించు పరబ్రహ్మమే కాలము. యోగి, యట్టికాలస్వరూపము తానై ప్రళయకాలములకును లోఁబడక యేకరీతిగాఁ బ్రకాశించును.

7. ఆసనము—

(1) సుఖాసనము—పరబ్రహ్మస్వరూపము తానై యున్నప్పుడింద్రియములకు వ్యాపారము లేదు. నిద్రయలజడి మొదలగునవియును లేవు. కావున నాపరబ్రహ్మస్వరూపము తానై యుండుట.

(2) సిద్ధాసనము—అస్తే, జాయతే, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతే, అనుషడ్వికారములును లేనిపరబ్రహ్మము నపరోక్షజ్ఞానదృష్టిచేతఁ జూచి దానియం దైక్యమైనతోడనే యణిమాద్యష్టసిద్ధులును గలవాఁడగుట.

8. మూలబంధము—అన్నిబంధములకును మూలమైనది. పరిపూర్ణావలోకనమైనమాత్రముననే సమస్తమునకును గారణమైన యీబంధము వీడును.

9. దేహసామ్యము—సముద్రమునందు సమస్తనదులు, మురుగుకాల్వలు, మొదలగునవి యన్నియుం గలసి యభేదముగ

నున్నట్లు బ్రహ్మానందమనెడు నచలసముద్రమునందు నింద్రియములు, వానివిషయములు, నరిషడ్వర్గమును మొదలుగా గలవన్నియుఁ జేరి, వానిరూపములంబాసి పరిపూర్ణమంద్వైక్యమగుచున్నవి. అప్పుడు స్థూలసూక్ష్మకారణ మహాకారణముల నెడుశరీరభేదములు లేక రూపనామక్రియారహితమైన పరబ్రహ్మస్వరూపమనెడుపరిపూర్ణమంతటనునిండియుండును

10. దృక్స్థితి—లక్ష్యములలో శ్రేష్ఠమగు శాంభవీలక్ష్యముచేతఁ బరబ్రహ్మమందే తదేకనిష్ఠగా దృష్టిని నిలుపుట.

(1) బాహ్యలక్ష్యము= శ్రోత్రత్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములయొక్కయు, వాక్పాణిపాదపాయూపస్థ లనెడు కర్మేంద్రియముల యొక్కయు, విషయములగు శబ్దస్పర్శరూపరస గంధవచనదానగమన విసర్జనానందములయందు లక్ష్యమును నిలుపుట.

(2) అంతర్లక్ష్యము=మనో బుద్ధి చిత్తాహంకారముల యొక్కవృత్తులగు సంకల్ప నిశ్చయ చంచలకర్తవ్యములయందు లక్ష్యము నిలుపుట.

(3) మధ్యలక్ష్యము=అంతర బాహ్యమధ్యలక్ష్యము=బాహ్యేంద్రియవిషయములుఅంతరింద్రియవిషయములయందు లక్ష్యమును నిలుపుట.

(4) షణ్ముఖ=శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములు మనస్సులయందు లక్ష్యమును నిలుపుట.

(5) శాంభవి=పైనాలుగులక్ష్యములను సమష్టిగాఁజేర్చి యంతరబాహ్యములయందుఁ బ్రకాశించు పర

బ్రహ్మస్వరూపమునందు లక్ష్యము నిలుపుట. ఇది యన్నిలక్ష్యములలో శ్రేష్ఠము.

11. ప్రాణాయామము — శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లనెడు జ్ఞానేంద్రియములును వానివృత్తులగు శబ్దస్పర్శరూపరసగంధంబులును, వాక్పాణిపాదపాయూపస్థల నెడుకర్మేంద్రియంబులును వానివృత్తులగు వచనదానగమనవిసర్జనానందములును మనోబుద్ధి చిత్తాహంకారంబుల నెడునంతఃకరణ చతుష్టయంబును, వానివృత్తులగు సంకల్పనిశ్చయచంచలకర్తృత్వములును ప్రాణాపానవ్యానోదానసమానంబుల నెడు పంచప్రాణంబులును, నాగకూర్మకృకురదేవదత్తధనుంజయు లనెడునుపవాయువులును బరబ్రహ్మస్వరూపమనియు నాపరబ్రహ్మస్వరూపమే తానసియుఁ దలంచుట. అట్లు తలచునేని పైనఁజెప్పినవృత్తులన్నియు నశించును. "యద్దృశ్యం తన్నశ్యమ్" అనునట్లు కనుపడు పదార్థజాలమంతయు నశ్య మగునని యెంచి విటుసయందు విటకత్తెకువలె మనస్సును బరబ్రహ్మస్వరూపమందైక్యము చేయుట.

12. ప్రత్యాహారము — సద్గుణములను దుర్గుణములను బరబ్రహ్మస్వరూపముగాఁ దలంచుట.

13. ధారణము — మనస్సు దేనిని సంకల్పించునో, దేనిని జూచునో, యా తలఁచినది, చూచినది యంతయుఁ బరబ్రహ్మస్వరూపమని హృదయమందు నిశ్చయముగ నిలుపుట.

శ్లో॥ "యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతిభావయేత్
యద్య త్స్పృశతి హస్తాభ్యాం తత్తదాత్మేతిభావయేత్
యద్య చ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతిభావయేత్"

కైవల్యోపనిషత్.

కన్నులచేతఁ జూడఁబడునది చేతులచేత, దాకఁబడునది చెవులచేత వినఁబడునది యాత్మస్వరూపమని భావింపవలెను. నాసికచేత వాసనచూడబడునది నాలుకచేతరుచి చూడబడునది ఆత్మయని భావించవలెను. యిందువలన అణిమ మహిమ లఘిమ గరిమ ప్రాప్తి ప్రాకామ్యము వశిత్వము యీశత్వములను అష్టసిద్ధులు లభించును.

Note—ప్రపంచమందు యోగి పిచ్చివానివలెను చెవిటివానివలెను మూగవానివలెను తెలివిలేనివానివలెను యుండును. ఆతండే సిద్ధయోగి యని తెలియునది.

14. ధ్యానము—స్థూలసూక్ష్మకారణశరీరములు, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములు వాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియంబులు, మనోబుద్ధిచిత్తాహంకారంబులనెడు నంతరింద్రియములు ననునీపదునాలుగింద్రియవిషయములు, ప్రాణాపానవ్యానోదానసమానంబులనెడు పంచప్రాణంబులు, నాగకూర్మ కృకరదేవదత్తధనుంజయులనెడునుపవాయువులు, మొదలగు దృశ్యములు నేనుగాను, వీనిని దెలిసికొనెడుదృక్స్వరూపుఁడను, సాక్షిని. అనియెంచి, పట్టు తప్పక యుండుట.

15. సమాధి—సర్వకాలములయందు ననఁగా భూతభవిష్యద్వర్తమానకాలములయందు లేక అహోరాత్రులయందును; సర్వావస్థలయందు ననఁగా జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయములనెడునాలుగవస్థలయందును సమస్తము బ్రహ్మస్వరూపమేయని యెల్లప్పుడు దర్శించెనేని సమస్తవికారములను రహితమగుసహజనిర్వికల్పనిష్ఠ యగును.

# చక్రవిషయము

ప్రత్యక్షముగ కనుబడెడి యీస్థూలదేహమందు మూలాధారము నుండి కపాలకుహరమువఱకు వీణాదండమువలె నొక వెన్నెముక యుండును

"దేహస్య పశ్చిమే భాగే వీణాదండ స్వరూపభృత్
దీర్ఘాస్థి మూర్ధపర్యంతం బ్రహ్మదండీతి కథ్యతే"

ఉత్తరగీత.

శరీరముయొక్క వెనుక భాగమున వీణాదండమువలె శిరస్సు పర్యంతమును వెన్నెముక యున్నది. దానిని బ్రహ్మదండి యని చెప్పుదురు.

"తస్యాంతే సుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతి సూరిభిః
ఇడాపింగళయోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ"

ఉత్తరగీత.

వెన్నెముకమధ్యను గొట్టమువలె సూక్ష్మరూపముగ నుండు రంధ్రమును బ్రహ్మనాడి యందురు. ఆనాడి ఇడాపింగళనాడులకు మధ్యనుండినదై సుషుమ్న యను పేరం బరగుచున్నది ఈసుషుమ్నయే బ్రహ్మైక్యప్రతిపాదక మైనది గనుక బ్రహ్మనాడి యని చెప్పంబడును. ఈసుషుమ్నకంతర్గతముగా కుండలినీశక్తి గలదు.

ఈవీణాదండమునకు వీణెకు మెట్లువలెనే యొకటిమీఁద నొకటిగా ముప్పదిమూఁడు పూసలుండును. అందు మొదటి యేఁడిటినే మెడపూసలనియు కడమ యిరువదియాఱిటిని వెన్నుపూసలనియుఁ జెప్పుదురు. ఈ వెన్నెముకకే బ్రహ్మదండి మేరువు నను పేరులు ఈపూసలననుస

నాళముండును. అదియే సుషుమ్నానాళము. ఈనాళముగుండ సుషుమ్న అధోముఖముఁగ మూలాధారమునకువచ్చి మనస్సును విషయములకు పోవునట్లుచేసి తానుతిరుగా యూర్ధ్వముఖముగా వ్యాపించుచు వెన్నుపూసలను మెడపూసలను దాఁటి పెద్దనాళముతోఁ గలియును. ఈపెద్దనాళమునకే బ్రహ్మరంధ్రమని పేరు. ఈసుషుమ్న సర్పాకారముగా నున్నందున వెన్నుపామని చెప్పుదురు. ఈసుషుమ్న కడుకోమలమైనదియు బహుమృదువైనదియును గావున నేయపాయమును గలుగకుండ శిరస్సునందలి కపాలకుహర మనెడిదట్టమయిన యెముకలపెట్టెలో నిమడ్చఁబడి యతిజాగ్రతతోఁ గాపాడవలసివచ్చెను. ఈసుషుమ్న యుండెడుస్థానము బ్రహ్మరంధ్రము, ఇదియె ప్రాణాధారము.



☞ వెన్నెముకయందుండెడిముప్పదిమూఁడుపూసలనేముప్పదిముగ్గురు దేవతావరులనియు శరీరమందలిముప్పదిమూఁడుకోట్లరోమంబులే ముప్పదిమూఁడుకోట్ల దేవతలనియుఁ జెప్పుచున్నారు. ఇంద్రుఁడు; బ్రహ్మ అష్టవసువులు 8,ఏకాదశరుద్రులు 11ద్వాదశాదిత్యులు12 మొత్తమున ముప్పదిముగ్గురు దేవతావరు లనియు తెలియునది. శరీరమున నుండుముఖ్యములైన నూఱునాడులలో నొక్కొకదానికి నూఱేసి శాఖానాడులును అందొక్కొక్క శాఖానాడికి 72000 సూక్ష్మ నాడులును గలవు.

నాడులనేకముగాఁగలవు. అందుముఖ్యములగుపదింటినివివరించెద—

1. సుషుమ్న —అతికోమలమును సుకుమారమునై, యిడాపింగళ లనునాడులతో మూలాధారమునుండి యూర్ధ్వముఖము గాఁ బోయి "కుండలీశక్తి" యనుపేరితోఁ గపాలకుహర మునఁబ్రవేశించియచటనుండి నాలుకకొనకుఁజేరి "సరస్వతి" యను పేరిటఁ బ్రసిద్ధమగుచున్నది. ఈసుషుమ్న మూలా ధారమునుండి సహస్రారముదనుక వ్యాపించుచుపశ్చిమాభి ముఖమై భ్రూమధ్యమందు నిడాపింగళానాడులతోఁగలిసి యుండును. ఆస్థానమే "త్రివేణీసంగమము" "త్రికూటము" "ఆజ్ఞాచక్రము" నని చెప్పఁబడును. సుషుమ్న తెల్లనిరంగు గలది గాన "శుక్లనాడి" యని, పరబ్రహ్మమును గుఱిం చిన జ్ఞానమునకు సాధకముగావున "బ్రహ్మనాడి"యనియును జెప్పఁబడును.

☞ ఉత్తరదేశమునందు కాశీమహాక్షేత్రమునకు సమీపము నప్రయాగ(Allahabad)లో సరస్వతిగుప్తగామినిగానున్నది. అటులనే సుషుమ్నయును గుప్తగామిని యని తలంచునది.

2. ఇడ—ఎడముముక్కునందుండి వాసనలను గ్రహించును. ఇదియె చంద్రనాడి. ఈనాడి ముక్కునుండి కపాలముదనుక పోవును గనుకవాసనలను గ్రహింపఁజేయును. *(Olfactory nerve)*

3. పింగళ—కుడిముక్కునందుండివాసనలను గ్రహించును. ఇదియె సూర్యనాడి. ఈనాడియు ముక్కునుండి కపాలముదనుక పోవును గనుక నిదియు వాసనలను గ్రహింపఁజేయును. *(Olfactory nerve)* ఈయిడాపింగళనాడులుసుషుమ్నతోఁ గూడనాధారచక్రమునుండి యూర్ధ్వముఖముగాఁ బోయి భ్రూమధ్యమందుఁ జేరి "గంగా" "యమునా" యను పేరులు గలవియగును. వీనివలననే ప్రాణవాయువునకు సంచారము కలుగును. గంగాయమునాసరస్వతులు కలియుస్థానముగనుక భ్రూమధ్యమునకుఁ ద్రివేణీసంగమ మను పేరు కలిగెను.

4. పూషాలము. } అను నాడులు రెండును చెవులలోపలినుండి
5. అలంపూష. } కపాలమువఱకును పోవును గనుక నివిశబ్దములను గ్రహింపఁజేయును. ఈనాడులు లేనిచో శబ్దమునువినఁజాలము. (*Auditory nerves*)

6. గాంధారి } అను నాడులు రెండును గన్నులలోపలినుండి
7. హస్తిజిహ్వ } కపాలమువఱకును బోవును; గనుక రూపములను గ్రహింపం జేయును. *(Optic nerves.)*

8. కుహూనాడి—గుదస్థానమున నుండి మలమును విడచు నట్లు చేయును.

9. సినీవాలీనాడి—గుహ్యస్థానమం దుండి మూత్రమును వదలు నట్లు చేయును.

10. రక్తాహ్వయనాడి—గుహ్యస్థానమందుండి శుక్లశోణితములను వెడలఁ గొట్టును. లింగలేపనము కలుగజేయును.

చెవులు కన్నులు ముక్కు నాలుక—వీనినుండి యేడునాడులు మేదస్సు (*brain.*) నందు సుషుమ్నతోఁ గలియును. ఆస్థానమునే "బ్రహ్మరంధ్ర" మనియు "సప్తపథ" యనియుం జెప్పుదురు. అచ్చటనే సహస్రారముండును. శ్రోత్రచక్షుర్జిహ్వాఘ్రాణములనుండిపోవునాడులు కలియుస్థానము గనుక దీనినే "చతుష్పథ" మనియు "శృంగాటక" మనియుం జెప్పుదురు.

బ్రహ్మరంధ్రము—భూపతనమైనతోడనే బిడ్డలకు నడినెత్తిన మృదువైనగుంట యొకటియుండును. ఆగుంటకు దిగువతట్టున నొక కమలముండును. దీనికే సహస్రారకమల మని పేరు. శిశువు గర్భములో నున్నప్పుడు యీకమలము వికసించియుండును. ఆకారణముననే గర్భములోనిబిడ్డలకు నేఁడవమాసము మొదలుభూపతనమువఱకుజ్ఞానము మెండై, భూపతనమయిన తోడనే యజ్ఞాన మనెడిమాయ యావరించి, యీకమలము ముకుళించుకొని పోవును. గర్భములోనున్నప్పుడు శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములయందు ఆత్మ విస్తరించలేదు. కావున ఆయింద్రియములయొక్క విషయములున్ను లేవు. బ్రహ్మరంధ్రమునుండియేజ్ఞాననేత్రముద్వారాశిశువు గర్భము లోనుండియును సమస్తమును తెలిసికొనగలదు. నాభివద్ద నుంచివచ్చెడి తీగెగుండా తల్లిభుజించినపదార్థములయొక్క రసమును అనుభవించగలదు. బ్రహ్మరంధ్రముగుండా ఆత్మ స్థూలశరీరములో ప్రవేశించును. మొదట యేద్వారమున ప్రవేశించునో ఆద్వారముననే తిరుగ వెడలుటయే యుక్త మార్గమని పెద్దలు తలంచెదరు.

☞ భూపతనమైనది మొదలు బిడ్డలకు మాడునఁజమురు పెట్టి పసుపు రాచుట యాచారమని సర్వత్ర తెలిసిన విషయమే. ఇట్లు దినదినమును జమురు రాయరాయ బిడ్డలకు నడినెత్తిన నుండెడి గుంటపూడి కనుపడకుండును. పండ్రెండు సంవత్సరములకు నెముకలన్నియు నతుకుకొని తల గట్టిపడును.!

☞ సహస్రార కమలమునకే "బ్రహ్మరంధ్ర"మనియు, ఆకమలము యొక్క మధ్యనుండెడి నాళమునకే "సుషుమ్నా" నాళమని యుం బేరులు.

☞ బ్రహ్మరంధ్రము పదియవద్వారమని చెప్పెదరు.

"పుర మేకాదశద్వారమ్" కఠోపనిషత్.

కన్నులు రెండు, చెవులు రెండు, ముక్కురంధ్రములు రెండు, నోరు, మలమూత్రద్వారములు రెండును, నాభిద్వారము, బ్రహ్మరంధ్రము-- పదునొకండు ద్వారములు.

"నవద్వారంతు ప్రత్యక్షం దశమం మనఉచ్యతే
మనోద్వారే స్థితంగోప్యం గురువాక్యేన లభ్యతే
గురుర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంధకోటిభిః॥"

నవద్వారములు కనుబడుచున్నవి. దశమద్వారమగు మనోద్వారముగోప్యముగనున్నది. గ్రంధములుచదివితే తెలియదు. గురువువలననే తెలియవలెను.

పదిద్వారములని చెప్పినప్పుడు నవద్వారములును బ్రహ్మరంధ్రమును గూడి లెక్కకువచ్చును.

మూలాధారంబునకు నెనిమిదంగుళములమీఁదసుషుమ్నా నాళము ననుసరించి నాడీచక్రమున్నది. ఆనాడీచక్రమునుండి కుహూనాడి సినీవాలీనాడిరక్తావ్హాయనాడి యనుమూఁడునాడులునధోముఖవ్యాపనము

గలవై యుండును. ఆనాడీచక్రమునుండి యనేకనాడు లూర్ధ్వముఖ
వ్యాపనముగలవై యుండును. నాడులకుఁ గూడలిస్థానమై వానిలోఁ గొ
న్నిటి నధోముఖముగను గొన్నిటి నూర్ధ్వముఖముగను వ్యాపింపఁజేయు
మధ్యమస్థానము గనుక నాడీచక్రమని చెప్పబడును. ఱొమ్మెముకకును
వీణాదండమునకును మధ్యను అధోముఖముగా వ్రేలాడుమాంసపిండ
మునే హృదయమని చెప్పుదురు. ఇదియె హృత్పుండరీకము. ఇందు
జీవాత్మ యుండును. మేదస్సునుండియే సుషుమ్నా నాళద్వారమున ని
క్కడికి నాడులు వచ్చును. మఱియు నీసుషుమ్న మూలాధారము
నుండి తిరిగివెళ్లినపుడు తనతోడ నుండెడు ఇడ పింగళ యనునిరుచేడి
యల నిరుపక్కల నిడికొని నూఱునాడులతో ననాహతమునకువచ్చి
యానూఱునాడుల నక్కడ విడిచి యూర్ధ్వముఖవ్యాపినియై శిరస్సున
కుఁ బోవును. మఱియుఁ బసిబిడ్డలు గర్భములోనున్న కాలమందుఁ దల్లి
భుజించిన యన్నపానాదులరసమును దమనాభియందుండెడి తీగెగుండ
గ్రహించి యందువలన వృద్ధిఁబొందెదరు. భూపతన మయినతోడ్తోడన
నాతీగెను గోయుదురు. గర్భమందున్న కాలములో వాగింద్రియవ్యాపా
రము లేదు. నోటితోఁ దినుటయును లేదు. ఈతీగయె రసగ్రహణమున
కాధారము. ఈనాభినాళమును నవద్వారములకంటె మించిన యొక
ద్వారమని చెప్పుదురు.

శ్రవణ మనన నిదిధ్యాసలును, శమ దమ ఉపరతి తితీక్ష శ్రద్ధ
సమాధానములను షట్గుణసంపత్తియును, సర్వభూతదయాళుత్వమును,
యమనియమంబులును,గలిగినచో సహస్రారకమలమువికసించితోడ్తోడన
విజ్ఞానము కలుగును. అందువలన ముక్తియును గలుగును. ఇంద్రియ
సుఖమే పరమార్థము కాదు. కనుక విషయములకు లోఁబడక విజ్ఞాన
మును సంపాదించవలయును.

వీణెకు తంతెలవలె నీవీణాదండమునకు గుదస్థానమునుండికపాలము
వఱకు నొకటిమీఁద నొకటిగా మూలాధారముస్వాధిష్ఠానము మణి

పూరకము అనాహతము విశుద్ధము ఆజ్ఞేయము సహస్రారము ననెడు సప్త చక్రంబులు గలవు. అందు మొదటియాఱును షట్కమలములనియెన్నఁ బడును. సుషుమ్నానాడి యీయాఱుకమలములగుండ సంచరించును గనుక నీయాఱుకమలములకును సుషుమ్నానాళమందలినాడులతో సంబంధము గలదు. అనుభవమున నీవిషయము యోగులకుఁ జక్కఁగాఁ దెలియును.

Note---ఈమూలాధారాది కమలములు స్థూలశరీరమునందు మాత్రమే కలవు. సూక్ష్మశరీరము కారణశరీరము మహాకారణశరీరములందు కనుబడవు. మఱియు స్థూలశరీరమునందయినను కోసితే కనుబడవు. కుండలినీశక్తిని నిదురలేపి పెకలించి చూచితే అనుభవమునకు గోచరమగును. ఇందలి యేడుచక్రంబులకును యేడుగ్రహములకును సంబంధమని తెలియునది.

☞ మూలాధారచక్రముయొక్క అగ్రకోణమందు అనఁగా మధ్యను కుండలినీశక్తియుండును. మూలాధారమునకు అధోకుండలియనియు భ్రూమధ్యమునకు ఊర్ధ్వకుండలియనియు చెప్పుదురు. విషయలోలులయియుండు జనులందరికి మూలాధారమందు కుండలినీశక్తియొక్క తలయు భ్రూమధ్యమందుతోకయునుండును. మనస్సు అధోముఖవ్యాప్తియైయుండును. విజ్ఞానముఁ గలవారికి భ్రూమధ్యమందు కుండలినీశక్తియొక్క తలయు మూలాధారమందుతోకయునుండును. ఈకుండలినే సర్పాకారమని చెప్పుదురు.

## షట్కమలములు

1. మూలాధారము—స్థూలశరీరంబునందు గుదస్థానమునకంటె రెండంగుళంబులమీఁదను లింగస్థానమునకంటె రెండంగుళంబులుక్రిందను అగ్రకోణము అధోముఖముగాఁగల

మూడుకోణంబులతో రీరమునకుమధ్యనుమూలాధారచక్రమున్నది అందు నాలుగుదళములుగల కమలముండును. వ శ ష స అనెడునాలుగునుబీజములు. ఈకమలమునకధిపతియగుగణపతికిఅజపాగాయత్రీమంత్రజపమున 600 హంసలు సమర్పింపఁబడును. ఇది పృథివికి స్థానము గాన దీనికిని ముక్కునకును సంబంధము. ఇది మలవిసర్జనకుఁ గారణము. (చూడుము—హంసవిషయము.)

2. స్వాధిష్ఠానము—మూత్రద్వారమందు ఆఱుదళములు గల కమలముండును. బ భ మ య ర ల అనెడునాఱును బీజములు; ఈకమలమునకధిపతియగు సరస్వతితోఁగూడియుండు బ్రహ్మకు అజపాగాయత్రీమంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁబడును. ఇది జలమునకుస్థానముగానదీనికినినాలుకకును సంబంధము. ఇది మూత్రవిసర్జనకును శుక్లశోణితముల విసర్జనకును గారణము.

3. మణిపూరకము—నాభియందుఁ బదిదళములుఁ గల కమలముండును. డ ఢ ణ త థ ద ధ న ప ఫ అనెడుపదియును బీజములు. ఈకమలమునకధిపతియగు లక్ష్మితోఁ గూడియుండు విష్ణునకు నజపాగాయత్రీ మంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁబడును. ఇది అగ్నికిస్థానము గాన దీనికిని గన్నులకును సంబంధము. ఇందలియగ్ని భుజించిన సమస్తపదార్థములను జీర్ణము చేయును. ఇదియె చిత్తమునకు స్థానము.

4. అనాహతము—వక్షస్థలమందు బ్రొమ్మెముకకును వీణాదండమునకును మధ్యనుండెడిహృత్పద్మము. ఇది పండ్రెండుదళములు గలకమలము. క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ

అనెడు పండ్రెండును బీజములు. ఈకమలమున కధిపతి యగుపార్వతితోఁ గూడియుండురుద్రునకు అజపాగాయత్రీ మంత్రజపమున 6000 హంసలు సమర్పింపఁబడును. ఇది వాయువునకు స్థానము గాన దీనికిని త్వగింద్రియమునకును సంబాధము. ఇదియె ప్రాణవాయుసంచారమునకును అహంకారమునకును స్థానము.

"పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖం
అధో నిష్ట్యావితస్త్యాంతు నాభ్యా ముపరి తిష్ఠతి
హృదయాంతద్విజానీయా ద్విశ్వస్యాయతనం మహాత్"
తైత్తిరీయోపనిషత్.

కంఠమునకుఁ గ్రిందుగను బొడ్డునకు జానెడు మీఁదుగ నుండి యధోముఖముగా వ్రేలాడు మాంసపిండమగు హృత్పద్మమందుఁ బరమాత్మ యున్నాఁడు.

"అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్య యో ధ్వనిః
ధ్వనే రంతర్గతం జ్యోతి ర్జ్యోతి రంతర్గతం మనః
తన్మనో విలయం యాతి తద్విష్ణోః పరమం పదం"॥
ఉత్తరగీత.

కొట్టబడకయే మ్రోఁగుచుండెడు అనాహతమందు శబ్దము పుట్టును. ధ్వని యుండుటవలన శబ్దము కలుగును. ధ్వనియందు వెలుగును, ఆవెలుగునందు మనస్సు నున్నవి. మనోలీనమైనచో ముక్తి కలుగును. దీనినే యమనస్క మనియుఁ జెప్పుదురు.

మనసు ను స్వాధీనము చేసికొనుటకుమున్ముందుగాననాహతమందు దృష్టిని నిలిపినచో శబ్ద మంతయు నణఁగిప్రణవనాద మనుధ్వని వినఁబడును. అట్టులభ్యాసము చేయంజేయను ప్రణవనాదము తగ్గి స్వప్రకాశము కనఁబడును. దీనినే ఆత్మజ్యోతి యని చెప్పుదురు. పిమ్మట హిరణ్మయకోశ మగు మనస్సుయొక్క నిజమగుస్వరూపము తెలియును. అప్పటికిని సాత్వికాహంకార ముండును. మనస్సు పరబ్రహ్మమును జూడలేక పోయినను బరబ్రహ్మమం దైక్య మగును. ఈచక్రమందుఁ గొట్టఁబడక యే దశవిధప్రణవనాదములు మ్రోగుచుండును గనుక యీచక్రముఅనాహతచక్రమని చెప్పఁబడుచున్నది. ఈనాదానుభవము యోగాభ్యాసముగలవారి కే తెలియును. నాద మనఁగా మూలాధారమునుండి హృదయమునఁబుట్టిన సంగీతధ్వని. కుండలీయోగము చేత నాదబ్రహ్మమును లేపియానందమును జెందవలయును.

5. విశుద్ధము.—కంఠస్థానమందుఁ బదియాఱుదళములు గల కమల ముండును. "అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః" అనెడి పదునాఱును బీజములు. ఈకమలమున కధిపతియగు నీశ్వరునకునజపాగాయత్రీ మంత్ర జపమున 1000 హంసలుసమర్పింపఁబడును. ఇది యాకాశ హంశము గానఁ జెవులతో సంబంధము గలిగి యుండును. ఇదియె మనస్సునకు స్థానము సమస్తభూతములయందుండెడి యాత్మస్వరూపమే కృష్ణుఁ డనియు నాకృష్ణుఁడు సహస్రారమందుండు ననియు విశుద్ధచక్రంబునందలి పదియాఱు దళంబులను వీక్షించుచుండు ననియు నీపదియాఱుదళంబు లే

పదియాఱువేలగోపిక లనియు నీవీతుఁగావలననే కృష్ణుఁడు గోపికలతోఁ బొందె ననియు నాకృష్ణుఁ డస్ఖలితబ్రహ్మచారి యనియు సదోపవాసి యనియుఁ జెప్పుదురు.

"దంతములు జిహ్వా కుత్తుక తాలుతలము
కంఠనాళంబు హృదయం బగణ్యచరిత
మఱలి లోఁబడి యెచటికి మనసు మెలఁగ
వాఁగఁ దప్పక యచటను నాగవలయు."

ఇందలియర్థమును బెద్దలవలనఁ దెలిసికొని యాసుఖమునను భవింపవలయును.

౬. ఆజ్ఞాచక్రము—భ్రూమధ్యమందు రెండుదళములు గల కమల ముండును. హం క్షం యనునవి బీజములు. ఈకమల మునకధిపతి యగు సదాశివునకు నజపాగాయత్రీమంత్రజపము 1000 హంసలు సమర్పింపఁబడును. ఇది బుద్ధికిస్థానము మనస్సునకు గంఠము స్థానమైనను సకలేంద్రియవ్యాపారములు చేయుటయందు ఆజ్ఞాచక్రమునకు వచ్చును గనుక మనసునకు విషయము లగుసంకల్పవికల్పములే యీచక్రమునకు రెండుదళము లని చెప్పఁబడెను. మొదటియైదుచక్రములయందు హఠయోగులు క్రమక్రమముగ మనసు నిలిపి వాయునిరోధము చేసి అభ్యసించెదరు. రాజయోగులు ఆజ్ఞాసహస్రారచక్రములయందే అభ్యాసము చేసెదరు. ఇదియే ముక్తికాంతకు స్థానము. ఇచ్చటి ముక్తికాంత లేక జ్ఞానకాంతితో సంయోగమే జీవన్ముక్తి. ఇదియె జీవేశ్వరైక్యము. దీనినే త్రిసత్రి మనియుఁ జెప్పుదురు.




ఈ సహస్రారకమలమందుండెడి యక్షరములలో,

౧.—ఇది మనస్సును సహస్రారచక్రమందు నిలుపవలశిన స్థానము. ముందుగా మనస్సును విషయములనుండి మఱలించి అభ్యాసమందు ఆజ్ఞాచక్రముననిలిపి పిమ్మట సహస్రార చక్రమందలి యీస్థానమందు నిలుపుట కభ్యాసము చేయఁగ వృత్తిరహిత మగును. ఆరూఢియందు విదేహముక్తికలుగును.

౨.—ఇదిసహస్రారకమలముయొక్క యగ్రముననుండెడి కేసరముల మధ్యనుదుద్దు. హంస యీదుద్దుపైనుండిన స్వప్నావస్థయగును.

౩.—ఇది హంసపద్మనాళమున దిగుటకుమార్గము. యీనాళమున దిగిన సుషుప్త్యవస్థయగును.

☞ ఈపద్మమును విడుచుటయే తురీయము. అదియే సన్యాసము.

సహస్రారము—ఈకమల మాజ్ఞాచక్రమునకు మీఁదుగఁ గపాల కుహరమందుండును. ఈకమలమున కెనిమిది దళములు గలవు. ఒక్కొక్క దళమునందు 125 రేకులు. అట్లు కమలమునకు 1000 రేకులు కలిగియుండును. ఈచక్రాధిపతి యగుపరమాత్మకు అజపాగాయత్రీ మంత్రజపమున 1000 హంసలు సమర్పింపఁబడును. ఎనిమిదిదళములు గలిగియుండుటచేత నష్టదళపద్మమనియు 1000 రేకులు కలిగియుండుటచేత సహస్రారమనియు జెప్పఁబడును.

Note.—ఈయెనిమిది దళములందు యెనిమిది వృత్తులు కలవు. ఆవృత్తులనుబట్టియే యెనిమిదిదళము లని చెప్పఁబడును.

"జిహ్వాగ్రే పూర్వదిగ్భాగే త్రికోణాకారమండలే
స్రవంతీ మమృతం పశ్యే న్నేత్రాభ్యాం సుసమాహితః"
బృహదోపనిషత్.

"త్రిపుటీనిరసన మగుతఱి
సుపజిహ్వాకు నూటి నుండి యుదయింపుచుఁ దాఁ
దపనుని పగిదిని బరగెడు
నిపుణునిఁ గనుగొన్న వాఁడు నిత్యుఁడు రామా."

ఈమొదలగుప్రమాణంబు లనేకంబులు గలవు. అనుభవజ్ఞులయొద్దనీవిషయములను జక్కఁగ దెలిసికొని యోగానందము లేక బ్రహ్మానందమనెడి యమృతమునుగ్రోలి నిత్యసుఖము ననుభవింపవలయును.

"అన్తరేణ తాలుకే యఏష స్తనఇ వావలమ్బతే సేన్ద్రయోనిః
యత్రాసౌ కేశాన్తో వివర్తతే వ్యపోహ్యశీర్షకపాలే."
తైత్తిరీయోపనిషత్.

దౌడలమధ్యను స్తనమువలెనే వ్రేలాడు మాంసఖండ ముండును. అదికపాలకుహరమును జీల్చుకొని వెలుపలికివచ్చు

వేరుగాఁ గనుపడుచున్నది. ఇదియే బ్రహ్మస్వరూపప్రాప్తికి మార్గము. దీనినే కొండనాలుకయని చెప్పుదురు.

పరమాత్మస్థానములు—పరమాత్మ

స్థూలశరీరమందు అోమ్మెముకకునువీణాదండమునకునుమధ్య ను వ్రేలాడు మాంసఖండమం దుండుననియు,

(చూడుము—అనాహతచక్రము.)

సూక్ష్మశరీరమందు నేత్రస్థానమందుండుననియు,

(చూడుము—అక్షివిషయము.)

కారణశరీరమందు దాడలమధ్యను వ్రేలాడుమాంసఖండ మందుండుననియు,

మహాకారణశరీరమందు కపాలకుహరమందలి సహస్రార చక్రమందుండుననియు,

శరీరరహితమందు సర్వవ్యాపకమై యంతర్బాహ్యములయం దు సర్వత్ర నిండి నిబిడీకృతమైయుండుననియుఁ బెద్దల యభిప్రాయము.

[తాలువులమధ్యను వ్రేలాడుచుండెడి మృదువగుమాంస ఖండమునుండియె యోగానుభవము గలవారలకు సుధ (అమృతము) స్రవించుచుండును. ఆసుధాపానమందలినిరంతర సుఖము వారికే తెలియవలెను. గాన యిది పరమాత్మస్థాన ముగా నెంచఁబడినది. గ్రంధవిస్తరభీతిచేనింతటవిరమించితి.]

ఆజ్ఞాచక్రమునకు మీఁద పండ్రెండంగుళములదూరమున సహస్రార చక్రముండుటచేత నిది ద్వాదశాంతమని చెప్పఁబడును. ఆజ్ఞాచక్రము నకుఁ బైన నొక యంగుళమువఱకు శక్తియని దానిపైన మూఁడంగు ళములవఱకు వ్యాపిని యని అవల నాలుగంగుళములదాఁక సమనయని ఆమీఁదనాలుగంగుళములవఱకు నున్మనియనియు సుషుమ్నకుఁ బేరులు.

ఈయష్టదళపద్మమందు

హంస తూర్పు దళముమీఁద వాలినఁ బుణ్యమతియై పుణ్యకర్మలను జేయతలంపును,

ఆగ్నేయ దళముమీఁద వాలిన నిద్రాలస్యములు సోమరితనమును,

దక్షిణపు దళముమీఁద వాలినఁ గ్రూరపుఁబనులు చేయుతలంపును,

నైరృతి దళముమీఁద వాలినఁ బాపకర్మములను జేయుతలంపును,

పశ్చిమదళముమీఁద వాలిన నాటపాటలయందుఁదలంపును,

వాయవ్య దళముమీఁద వాలిన గురువులయొద్దికిఁ బోవలయు ననుకోరికయును గమనాగమనంబులు చేయుతలంపును.

ఉత్తరపు దళముమీఁద వాలిన సంభోగములయందిచ్ఛయును వివిధపదార్థములననుభవించవలెననుతలంపును,

ఈశాన్య దళముమీఁద వాలిన నన్న దానము ద్రవ్యదానము భూదానము మొదలుగాఁగల దానములు చేయవలయు ననుతలంపును,

కమలమధ్య మందుండిన వైరాగ్యము పరమోపశాంతి శమదమోపరతితితిక్షాశ్రద్ధాసమాధానములు మొదలగు సత్వగుణములును,

కమలముయొక్క యగ్రమున వనఁగాఁ గేసరములయందుండిన జాగ్రదవస్థయును,

ఆ కేసరములమధ్య దుద్దుపైనుండిన స్వాప్నావస్థయును,

పద్మనాళమున దిగిన సుషుప్త్యవస్థయును గలుగును.

ఈపద్మమునువిడుచుటయేతురీయము. అదియేసన్యాసము.అట్లుగాన మనస్సు నూర్ధ్వముఖవ్యాపనముచేసి మెల్లనమూలాధారంబుదాఁటుట వలనఁబృధివీతత్వంబు జయంబగును. పిమ్మటస్వాధిష్ఠానకమలంబునకెక్కి యొకనిమిషముండియంతనదియు నతిక్రమించుటవలన జలతత్వంబు జయంబగును.అనంతరము మణిపూరక కమలంబునఁ బ్రవేశించి యందుం డెడిసమానవాయువునుగూడి యాకమలముదాఁటుటవలన దేజోతత్వంబు జయంబగును. అంతననాహత కమలంబుఁజేరి యందలిప్రాణవాయువును గలిసి యాకమలమును దాఁటుటవలన వాయుతత్వంబుజయంబగును. విశుద్ధకమలంబుంజేరియందలియుదానవాయువునుగలిసియాకమలమును దాఁటుటవలన నాకాశతత్వమ్మజయంబగును. ఆపిమ్మట నాజ్ఞాచక్రం బుంజేరి యందు స్థిరముగా నిలిచి మిట్టమధ్యాహ్న మందలి సూర్యునివలెనే నివాతస్థానంబు (గాలిలేనిచోటు) నందుండెడి దీపంబుంబోలియుండి య దియునతిక్రమించుటవలన మనస్తత్వంబు జయంబగును. అందుండిమెల్లనఁ జంద్రమండలంబు దాఁటుటవలన సహస్రారకమలవాసుండును గురు స్వరూపుండు నగును. నాదబిందుకళల నతిక్రమించి సహస్రారకమల మందుజేరి సుఖాసీనుండై యణిమాద్యష్ట సిద్ధులును దూరశ్రవణఆ కాశగమనముల సిద్ధియును గలిగి నిగ్రహానుగ్రహ సామర్థ్యము గలిగి త్రికాలజ్ఞానియై సమస్తలోకములయందలి సమస్త వ్యాపారములను గరతలామలకముగాఁగనుగొనుచు సర్వజ్ఞుండై యుండును. ఇదిసమస్త యోగములకు రాజుగా(శ్రేష్టమైనదిగా)నుండును గనుక రాజయోగమని చెప్పఁబడును. అట్టిరాజయోగ మభ్యసించి కృతార్థులుగావలయును.

"సుషుమ్నా నాడికామధ్యే విద్యుల్లేఖేవ భాస్వరమ్"

సుషుమ్నా నాడిమధ్యమందు మెఱపుఁదీగెయున్నది. ఈమె ఱపుఁదీగెయందలికాంతికేకళయనియునాకళలోసిమ్మళయే పరబ్రహ్మస్వరూపమునియుం జెప్పుదురు.

పంచాక్షరియందలి

న కారమే పృథివీతత్త్వమనియు నాధారచక్రమనియు,
మ కారమే యాపోతత్త్వమనియు స్వాధిష్ఠానచక్రమనియు,
శ్శి కారమే యగ్నితత్త్వమనియు మణిపూరకచక్రమనియు,
వా కారమే వాయుతత్త్వమనియు ననాహతచక్రమనియు,
య కారమే యాకాశతత్త్వమనియు విశుద్ధచక్రమనియు,
ఓం కారమే యాజ్ఞాచక్రమనియు,
అన్నిటి సంపుటీకరణమే సహస్రారమనియుఁ జెప్పంబడును.

# అష్టసిద్ధులు.

1. అణిమ—అన్ని జంతువులకంటె స్వల్పజంతువవలె కనుపడుట. తన యాకారమునకంటె కొద్దియాకారముగల జీవమువలెనేయగుట. కఠినమగు రాతిలో నయినను ప్రవేశించుట.

2. మహిమ—బ్రహ్మవిష్ణుమహేశ్వరులను త్రిమూర్తులకంటె బెద్దవాఁడుగాఁగనుపడుట. అన్నిటికంటెను అధిక్యతగా నుండుట.

3. లఘిమ—దూదికంటెను దేలికయైయుండుట. ఏమాత్రమునుబరువు లేకుండుట ఆకాశగమనము కలిగియుండుట.

4. గరిమ—బరువుగలసమస్త జీవములకంటెను సమస్తపదార్థములకంటెనుబరువై యుండుట. ఇనుముకంటెను విశేషబరువుగా నుండుట.

5. ప్రాప్తి—కోరినదానినెల్లఁ గలుగఁజేసికొనుట. తన కేయాకారము గావలెననిన నాయాకారమును బొందుట. కోరినచోటికెల్ల క్షణమాత్రములోఁబోవుట. కోరినవస్తువును గాని జీవమును గాని తనయొద్దికిఁదెప్పించుకొనుట.

6. ప్రాకామ్యము—ఆకాశగమనము గలిగియుండుట. తనశరీరమును వదలి త్రిలోకసుందరమగు యవ్వనరూపమును దానుగోరి నంతకాలము బొందియుండుట.
7. వశిత్వము—సమస్తజంతువులను దుష్టమృగములను పెద్దపులి చిరుతపులి సింహము మదగజము మొదలుగాఁగల యడవి జంతువులను మొసలి చేప తాఁబేలు మొదలుగాఁగలనీటి జంతువులను సర్పములు మొదలుగాఁగలవానిని మచ్చికచేసి వశపఱచుకొనుట.
8. ఈశత్వము— కామక్రోధలోభమోహమదమాత్సర్యము లనెడు నరిషడ్వర్గము జయించియాధ్యాత్మికాధిభౌతికాధిదైవికము లనెడుతాపత్రయములులేనివాఁడై జితేంద్రియుఁడై యపరోక్షసాక్షాత్కారస్వానుభవము గలిగియుండుట. భూతభవిష్యద్వర్తమానవిషయములనుసర్వమునుగ్రహించియీశ్వరునివలెనే సృష్టిస్థితిలయములకుఁ గారణభూతుఁడగుట.

# సప్తభూమికలు.

భూమికలు జ్ఞానభూమికలని యజ్ఞానభూమికలని ద్వివిధము. జ్ఞానభూమికలు ఊర్ధ్వలోకములనియు అజ్ఞానభూమికలు అధోలోకములనియు తెలియునది.

| అజ్ఞానభూమికలు. | జ్ఞానభూమికలు. |
|---|---|
| 1. బీజజాగ్రము. | 1. శుభేచ్ఛ. |
| 2. జాగ్రము. | 2. విచారణ. |
| 3. మహాజాగ్రము. | 3. తనుమానసి. |
| 4. జాగ్రత్స్వప్నము. | 4. సత్వాపత్తి. |
| 5. స్వప్నము. | 5. అసంసక్తి. |
| 6. స్వప్నజాగ్రము. | 6. పదార్థాభావన. |
| 7. సుషుప్తి. | 7. తురీయము. |

ఇందలి యజ్ఞానభూమికలను ముందువివరించెద.

1. బీజజాగ్రము—స్థానము పొత్తికడుపు. లోకము అతలము. వర్ణము తెలుపు. ఇందుఁ గొన్నిపన్నగములుండును. నామ రూపక్రియారహితమును స్వప్రకాశము నఖండపరిపూర్ణ సచ్చిదానందము నగుపరబ్రహ్మమందుఁ గలిగినత్రిగుణాత్మకమైన ప్రకృతియనెడు తెలివి బీజరూపంబుగా నుండుటచేత బీజజాగ్రమనంబడును. ఇదియె జ్ఞప్తికి నూతనావస్థ.

2. జాగ్రము—స్థానము పిఱుఁదులు. లోకము వితలము. చాయ నలుపు. ఆ బీజరూపమగు తెలివి ప్రపంచాభిముఖమై సంకల్పముతోఁ గూడియుండుట.

3. మహాజాగ్రము—స్థానము తొడలు. లోకము సుతలము. రంగు పచ్చన. ఆ తెలివియే లోకవాసన ప్రబలి వివిధవిషయములయందును వేరువేరుభావనలచేత నిర్ధారణలుచేయుట మహాజాగ్రమని చెప్పంబడును.

4. జాగ్రత్స్వప్నము—స్థానము మోకాళ్లు. లోకము తలాతలము. ఇందుఁ గులకతాళ్లు నిండుకొనియుండును. దానవు లేలుదురు. వస్తుజాలమునందుఁ జూచినవి చూడనివి మనసునందు సంకల్పించి వ్యర్థముగ మనోరాజ్యమేలుట జాగ్రత్స్వప్నమని చెప్పంబడును.

5. స్వప్నము—స్థానము పిక్కలు. లోకము మహాతలము. ఇది పర్వతమయము. తెలివి జాగ్రత లేనిదై కల్పితస్వరూపములను జూచియు నిజమను నమ్మిక కలుగుటయే స్వప్నము. జాగ్రతయందు రజ్జుసర్పభ్రాంతియు, శుక్తిరజితభ్రాంతియు నెండమావులనుజూచినీరనుకొనెడిభ్రాంతియును,గలిగినను

విచారణయుండును. ఆవిచారణచేత నిజము తెలియఁగలదు. స్వప్నమందు విచారణ లేదు.

6. స్వప్నజాగ్రము—స్థానము చీలమండలు. లోకము రసాతలము చిరకాలము చూడఁబడకుండుటచేత స్థూలదేహా పుస్ఫురణ తప్పి జాగ్రద్దశవలెనే చిరకాలానువృత్తంబగు స్వప్నమే స్వప్న జాగ్రమని చెప్పంబడును. ఇది జాగ్రద్దశయందునుగలుగును.

7. సుషుప్తి—స్థాన మఱకాళ్లు. లోకము పాతాళము. ఈ యాఱవస్థలు లేకయాత్మయొక్క ప్రతిబింబస్వరూపమగు ప్రపంచమందలి విషయసుఖములయందు మునుఁగుటయే సుషుప్తియని చెప్పఁబడును. ఇది యేజడంబై యొప్పుజీవునియొక్కస్థితి. అప్పుడీ జీవుఁడు గాఢాంధకారంబున మునిఁగియుండును.

ప్రపంచమసత్యమనియు, సత్యమగు పదార్థమేదియో తెలియక పెద్దలను వెదకుచుండును. ప్రథమమందు నీయజ్ఞానభూమికలను దాఁటినవాఁడై పిమ్మట జ్ఞానభూమికలను దాఁటవలయును. జ్ఞానభూమికలే ముఖ్యంబులు గనుక సప్తభూమికలని చెప్పఁబడును. అజ్ఞానభూమికలందు పామరులుసంచరించెదరు. మోక్షమందపేక్షఁగలవారుజ్ఞానభూమికలందు సంచరించెదరు జ్ఞానభూమికలు:—

1. శుభేచ్ఛ—స్థానము బొడ్డు. లోకము భూలోకము. మనుజులకు వాసస్థానము. ఈభూమికయందుఁ బ్రజ్ఞయునహంకారమును లేక యుండవలయును.

2. విచారణ—స్థానము కడుపు. లోకము భువర్లోకము. ఇందు యక్షులు రాక్షసులు గంధర్వులు కిన్నరులు కింపురుషులు సిద్ధులు మునులును నివసింతురు. సత్సాంగత్యము వైరాగ్యము కలిగి పెద్దలవలన వేదాంతశాస్త్రములను దెలిసి

కొనుచు శ్రవణ మనన నిదిధ్యాసలచే నాత్మానుసంధానము చేయుట. అనఁగా మనస్సు సువృత్తిరహితముగను ఊర్ధ్వగామిగను జేసి యాజ్ఞాచక్రమందు నిలుపుటయె విచారణయనఁబడును.

3. తనుమానసి—స్థానము బొమ్మ. లోకము సువర్లోకము. ఇందు దేవతలు వసువులు రుద్రులు ఆదిత్యులును నివసింతురు. ఇచ్చటనే చంద్రలోకమును బిత్రులోకమునుగలవు. ఈపయి రెండుభూమికలయొక్క పూర్ణమయినఅభ్యాసమువలన విషయములలోఁ దగులక మనసును క్షీణింపచేయుచు ఆత్మానుసంధానము చేయంజేయ మనస్సు క్రిమక్రిమముగా వృత్తిరహితమై విషయములకుఁ బోకయుండును. ఇట్టు లింద్రియములు విషయములును రహితమై తెలివి యభిముఖముగ నుండుస్థితియే తనుమానసి యనఁబడును.

[ఈమూఁడు భూమికలే జాగ్రిదవస్థయనఁబడును. ఇందుండు వారికి పునర్జన్మము కలదు; గాని కడమనాలుగుభూమికలయందు నుండువారి కిఁక జన్మము లేదు. నాలుగవభూమికయందుండువారికిని జన్మముకలుగదు.]

4. సత్వాపత్తి—స్థానము మెడ. లోకము మహర్లోకము. ఇందు భృగువు మొదలుగాఁగలఋషులు నివసింతురు. పైమూఁడు భూమికల యభ్యాసముచేతను మనస్సు సంకల్పరహితమై జ్ఞానేంద్రియ కర్మేంద్రియ విషయములనొందక యేసంకల్పమును లేక పరబ్రహ్మనిష్ఠయందే యుండును. ఇట్టి స్థితియే సత్వాపత్తి యనఁబడును. మనస్సు పరబ్రహ్మమునుజూడ నేరదు కాని పరబ్రహ్మస్వరూపము నొందును.

Mind cannot see *Parabramha:*
but can become *Parabramha* and
dissolve itself into *Parabramha.*

ఈభూమికయందు జగత్తు స్వప్నమువలెఁ దోఁచును గాన నిదిస్వప్నావస్థయనఁబడును. అట్టి యనుభవము గలవాఁడు బ్రహ్మవిదుఁడని చెప్పఁబడును.

5. అసంసక్తి—స్థానము ముఖము. లోకము జనర్లోకము. ఇందు సనకాదులు నివసింతురు. ఈనాలుగుభూమికల యభ్యాసముచేత మనస్సు విషయరహితమును సంకల్పరహితమును సత్వరజస్తమోగుణరహితమునై శుద్ధసత్వప్రధానమునుగాక పరబ్రహ్మనిష్ఠయందుఁ బట్టుతప్పక యుండును. ఇదియె సుషుప్త్యవస్థ. అట్టియనుభవముగలవానినే బ్రహ్మవిద్వరుఁడని చెప్పుదురు.

6. పదార్థాభావన—స్థానము భ్రూమధ్యము. లోకముతపోలోకము. ఇందు వైరాగ్యముగలవారు నివసింతురు. వీరే బ్రహ్మమానసపుత్రులు. పైఅయిదుభూమికలయభ్యాసముచేత నంతరబహిర్థ్య దృశ్యములు లేక సమస్తవాసనాక్షయమై తమకన్యము లేక సమస్తముతమస్వరూపమేయనియు నదియె పరబ్రహ్మమనియుఁ దలంచుదురు. ఇదియె జీవన్ముక్తి. ఇదియె తుర్యావస్థ. అట్టి యనుభవముఁగలవాఁడు బ్రహ్మవిద్వరీయుఁడని చెప్పఁబడును.

7. తురీయము—స్థానముకపాలకుహరము. లోకము సత్యలోకము ఈలోకమందే యన్నిలోకములు యిమిడియున్నవి మొదటి యాఱుభూమికలయభ్యాసముచేతను సమస్తమును దనస్వరూపమనెడువృత్తి; యనఁగా నఖండపరిపూర్ణసచ్చిదానంద

పరబ్రహ్మముతానేకాని తనకంటె వేఱుకాదనెడు వృత్తికుదు రును. ఏభేదమునులేక పరబ్రహ్మముగు తానుతానెయై యుం డుననుట. అవాఙ్మానస గోచరము. ఇదితుర్యాతీతము. ఇది యె విదేహముక్తి. అట్టియనుభవముగలవానిని బ్రహ్మవిద్వ రిష్ఠుఁడని చెప్పుదురు. (అనుభవైక వేద్యము.)

"ఏమహనీయులు సప్తమ
భూమిక నింపొందువారు పుణ్యులు నాత్మా
రాములు వారలె వినుమా
రామమహాత్పదమందు రంజిలుదు రొగిన్॥"

సప్తమ మగుతురీయ భూమికయందునుండు ధన్యులె పుణ్యపురుషులు నాత్మారాములు ననఁ దగినవారు. వారలెపుడును బరబ్రహ్మపదవియం దే క్రీడించుచుందురు.

## హంసవిషయము

హంస యనఁగా ఉచ్ఛ్వాసనిశ్వాసంబులు. దీనికే ప్రాణమనియు చెప్పుదురు. హకార బిందు సకారములే హంస. హకారము శివబీజము, సకారము శక్తిబీజమును, యీరెంటిమధ్యను శివశ్శక్తులకు ఐక్యస్థానమై బిందురూప మగుబుద్ధితత్వము ప్రకాశించుచుండును. హకారమే శుక్లము. సకారమే రక్తము. ఈరెంటియొక్క సంయోగమే బిందువు. హకారమే సూర్యనాడి లేక పింగళ యని చెప్పఁబడి కుడిముక్కున వాయువునుపీల్చును. సకారమే చంద్రనాడి లేక ఇడ యనిచెప్పఁబడి ఎడమముక్కున వాయువును పీల్చును. మధ్యనుండెడిబిందువునకే తేజోనాడి యని లేక సుషుమ్న యని చెప్పఁబడును. సకారము శక్తిబీజము గనుక బుద్ధి సకారముపైపున తిరిగినప్పుడు ప్రపంచవిషయజ్ఞానమును హకారము

వైపున తిరిగినప్పుడు నిర్విషయజ్ఞానమున్ను కలుగును. ఈ మూఁడే నాదబిందుకళలు. యీహంస ప్రకృతిమయమైన ప్రపంచజ్ఞానము శివమయమైన పరబ్రహ్మజ్ఞానము అనెడు రెండురెక్కలతో చిద్బిందురూపమున సకలప్రాణులయొక్క సహస్రారకమలములయందు సంచరించుచుండును.

ఈహంస ప్రాణవాయురూపమున ప్రత్యక్షముగ కనుబడును.

ప్రాణము=లోపలికిపోయి వెలుపలికివచ్చు శ్వాసము.

1 ప్రాణము = 4 సెకనులు: four seconds of time.

6 ప్రాణములు = 1 ఫలము, లేక విఘడియ.

15 ప్రాణములు = 1 నిముషము—one minute.

60 నిముషములు= 1 గంట—one hour.

24 గంటలు = 1 దినము—one day.

కనుక దినమునకు ప్రాణములు 21600.

ఈహంసలను అజపాగాయత్రీ మంత్రజపమున

| | | |
|---|---|---|
| ఆధారచక్రమున కధిపతి యగు గణపతికి ... | ... | 600 |
| స్వాధిష్ఠానచక్రమున కధిపతి యగుబ్రహ్మకు | ... | 6000 |
| మణిపూరకచక్రమున కధిపతి యగు విష్ణుకు | ... | 6000 |
| అనాహతచక్రమున కధిపతి యగురుద్రునకు | ... | 6000 |
| విశుద్ధచక్రమున కధిపతి యగుయీశ్వరునకు | ... | 1000 |
| ఆజ్ఞాచక్రమున కధిపతి యగుసదాశివునకు | ... | 1000 |
| సహస్రారచక్రమున కధిపతి యగుపరమాత్మకు | ... | 1000 |
| | | 21600 |

ఈప్రకారముగ నిత్యము అజపాగాయత్రీమంత్రజపమున వారివారికి 21600 హంసలు పంచిపెట్టగను దనకుకర్తవ్యము లేదు. జ్ఞాతమనో బుద్ధిచిత్తాహంకారంబులనియెడు ఆకాశపంచకంబును, సమానవ్యానో

దానప్రాణాపానంబులనియెడు వాయుపంచకంబును, శ్రోత్రత్వక్చక్షుర్జి హ్వాఘ్రాణంబులనియెడు అగ్నిపంచకంబును, శబ్దస్పర్శరూపరస గంధం బులనియెడు జలపంచకంబును, వాక్పాణిపాదపాయూపస్థలనియెడుపృథ్వీ పంచకంబును, యీయిరువదియైదు తత్వంబులును సహస్రారంబుననుం డెడిసుషుమ్నతో సంబంధమగుటనుబట్టి 25000 హంసలగును. అందు లో 3400 కుంభకమందునిలుచును. అది యోగులకే అనుభవనీయమును కరతలామలకంబు నగును. కడమ 21600 హంసలు అజపాగాయత్రీమం త్రజపమున ఆయాచక్రాధిదేవతలకు సమర్పింపఁబడును.

ఈహంస మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయంబు లనుషడాధారంబులఁజుట్టి తిరుగుచుండును. ఆరోహణము అవరోహణములే సోహము. కనుక నాదబ్రహ్మమును లేపి యానందించవ లయును. రేచకపూరకములేఆరోహణఅవరోహణంబులని తెలియునది.

అజపాగాయత్రీమంత్రజపమున 21600హంసలు ఆయాచక్రాధిదేవత లకు సమముగాఁ బంచిపెట్టుకొనుటకు కారణంబేమని విచారించినచో ఆయాచక్రములయందు సుషుమ్నయొక్క సంచారము చక్కఁగ తెలి యఁగలదు. సూర్యోదయము మొదలు తిరుగ సూర్యోదయమువఱకు 21600 హంసలు సమర్పించబడును. దినమునకు 60 ఘడియలు; 3600 విఘడియలు. పగలు ముప్పదిగడియలు ; రాత్రి ముప్పదిగడియలు. సుషుమ్న 600హంసలకాలముమూలాధారచక్రమందుండుననియు 6000 హంసలకాలము స్వాధిష్ఠానచక్రమందుండుననియు 6000హంసలకాలము మణిపూరకచక్రమం దుండుననియు 6000 హంసలకాలము అనాహతచ క్రమందుండుననియు 1000హంసలకాలము విశుద్ధచక్రమందుండుననియు 1000 హంసలకాలము ఆజ్ఞాచక్రమం దుండుననియు 1000 హంసలకాల ముసహస్రారచక్రమం దుండుననియు అనుభవమున తెలియఁగలదు.

| | హంసలు. | గడియలు. | గంటలు | నిముష ములు | శెకను లు. |
|---|---|---|---|---|---|
| మూలాధారము. | 600 | ౧-౪౦ | 0 | 40 | 0 |
| స్వాధిష్ఠానము. | 6000 | ౧౬-౪౦ | 6 | 40 | 0 |
| మణిపూరకము. | 6000 | ౧౬-౪౦ | 6 | 40 | 0 |
| అనాహతము. | 6000 | ౧౬-౪౦ | 6 | 40 | 0 |
| విశుద్ధము. | 1000 | ౨-౪౬౪౦ | 1 | 6 | 40 |
| ఆజ్ఞేయము. | 1000 | ౨-౪౬౪౦ | 1 | 6 | 40 |
| సహస్రారము. | 1000 | ౨-౪౬౪౦ | 1 | 6 | 40 |
| | 21600 | ౬౦-౦ | 24 | 0 | 0 |

సూర్యోదయ మెప్పుడయితే ఆనిముషము మొదలు కాలము నేర్పరచవలయును. సూర్యోదయము 6 గంటల కేనని యీదిగువ ఆయాచక్రములయందు సుషుమ్న నిలుచు కాలము తెలుపఁబడెను. లేక సూర్యోదయము 6 గంటలకుపయిన కొన్ని నిముషములకు అగునెడల ఆసముషములను యీక్రిందవివరింపబడియుండు కాలమునకు చేర్చినచో సరియైన కాలము తెలియఁగలదు.

| | | మొదలు. | | | | వఱకు. | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | ఘం | ని | శె | | ఘం | ని | శె |
| మూలాధారము. | ఉదయము | 6 | - | - | ఉదయము. | 6 | 40 | - |
| స్వాధిష్ఠానము. | ఉదయము. | 6 | 40 | - | పగలు. | 1 | 20 | - |
| మణిపూరకము. | పగలు. | 1 | 20 | - | రాత్రి. | 8 | - | - |
| అనాహతము. | రాత్రి. | 8 | - | - | రాత్రి. | 2 | 40 | - |
| విశుద్ధము. | రాత్రి. | 2 | 40 | - | రాత్రి. | 3 | 46 | 40 |
| ఆజ్ఞేయము. | రాత్రి. | 3 | 46 | 40 | రాత్రి. | 4 | 53 | 20 |
| సహస్రారము. | రాత్రి. | 4 | 53 | 20 | ఉదయము | 6 | - | - |

హంస మూలాధారము నుండెడికాలమందు తెలివి సహస్రారము నుండి అధోముఖవ్యాప్తియైవిషయములతోఁ గూడుకొని వ్యవహారము లను జరిపించును. ఆపిమ్మట మూలాధారచక్రమునుండి స్వాధిష్ఠానమున కువచ్చి మిక్కిలి జాగ్రతతోపనులు చేయుంచును. ఆవెనుక స్వాధిష్ఠాన మునువదలి మణిపూరకమునకు వచ్చినతోడనే జఠరాగ్నిని ప్రజ్వరిల్లఁ జేయును. ఆప్రకారము మణిపూరకమునకు వచ్చినపిమ్మట అనఁగా అప రాహ్ణకాలమందు పితృకార్యములయందు పిండములుపెట్టుట సర్వత్ర తెలిసినవిషయమే. మణిపూరకము నందున్న సమయమందు భుజించిన పదార్థము జీర్ణముకాఁగలదు. ఆపిమ్మట అనాహతమునకువచ్చినచో నిద్ర బోవుకాలము సమీపించునని తెలియునది. యీఅనాహతమందు ప్రవే శించినపిమ్మట మొదటిపాదముతప్ప తక్కినమూఁడుపాగములు సుషుప్తి కాలమని తెలియవలెను. అందలి నాలుగవపాదము గాఢసుషుప్తి.అనా హతమును దాఁటి విశుద్ధమునకు వచ్చినచో తెలివి వికసించును. ఆజ్ఞా చక్రము సహస్రారకమలములయందు సంచరించెడికాలము మనస్సునకు విశ్రాంతిని కలుగఁజేసి సుఖము నిచ్చుకాలమని తెలియునది. ఈకాలము యోగాభ్యాసముచేయుటకునుమనస్సువృత్తిరహితమై బ్రహ్మానందమును బొందుటకును మంచిసమయము. కావున యీకారణములచేత ఆయా కాలములనుబట్టి హంస సంచరించును గనుక అన్ని చక్రములయందు సమానముగానుండక భేదములుగనుండెనని తెలియునది.

## అక్షి విషయము

అక్షి యనఁగా నేత్రము.ఇంద్రియములలో ప్రధానమగునేత్రమును గురించి చెప్పఁబడును.

"చక్షుర్మధ్యే స్థితం గుహ్యం మంగుష్ఠం పరమాత్మకమ్"
నేత్రమునకుమధ్యను గోప్యముగ అంగుష్ఠమాత్రపురు షుఁడగు పరమాత్మయున్నాఁడు.

"నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా
నీవారశూకవ త్తన్వీపీతాభాస్వాత్త్యనూపమా
తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః॥"

తైత్తిరీయోపనిషత్.

నేత్రస్థానమందుం డెడినల్లగుడ్డునకే నల్లకలువయని చెప్పుదురు. అందుమధ్యను నివ్వరిధాన్యపుముల్లువలెనే అతిసూక్ష్మముగు రంధ్రమున్నది. అందు విద్యుల్లేఖ యనెడు మెఱపుతీగె ప్రకాశించుచుండును. అదియే కళ. నిష్కళయే పరమాత్మ స్వరూపము. ఈనేత్రస్థానమేపరమాత్మస్థానమని పెద్దలు చెప్పుదురు. ఈకళయే ముక్తికాంతయనియు జ్యోతియనియు స్వప్రకాశమనియు చెప్పుదురు ఈప్రకాశమువల్లనే సూర్యునికిని ప్రకాశము కలిగినది. సూర్యునివలన చంద్రునికి ప్రకాశముకలిగినది. కావున వెలుఁగునకుకారణము కళయేయని తెలియునది.ఇదియు హిరణ్మయకోశము.

సూర్యునియొక్క కాంతి తెలుపు అని సర్వత్ర తెలిసినవిషయమే. అదియే శుద్ధసత్వప్రధానము. సూర్యకాంతి ప్రత్యక్షముగ తెలుపురంగుగలదైనను నిజముగ విచారించి చూడఁగా వివిధరంగులయొక్క చేరికయని తెలియఁగలదు.

సూర్యకాంతి ముక్కోణపు అద్దము (prism) చేత భాగించఁబడి వివిధరంగులు అయినట్లు నేత్రస్థానమందును 7 రంగులు గలవు.

1. ఎరుపు. (red)

2. నారింజపండు వర్ణము--ఎరుపు పసుపు కలిసినవర్ణము.
(orange)

3. పసుపుపచ్చ వర్ణము. (yellow)

4. ఆకుపచ్చ వర్ణము. (green)

5. నీల వర్ణము--దీనికే నల్లగుడ్డు అని చెప్పెదరు. (blue)

6. సునీల వర్ణము--ఇదియె పాప. (indigo)

7. ఇంద్రనీల వర్ణము. (violet)

[అద్దమును తెచ్చి అందులో ప్రతిబింబమునుచూచినచో అన్నిరంగులు తెలియఁగలవు. ఈయేడురంగులుసప్తచక్రంబులనియు అందలికళయే సుషుమ్నయనియు నిష్కళయే పరబ్రహ్మస్వరూపమనియు పెద్దలుచెప్పుదురు—2, 3, 4, రంగులుకలిపి తెలుపుగాయెన్నఁబడును.]

ఎఱుపు—తెల్లగుడ్డుచుట్టూ వుండేది. పృధివీతత్వము, క్రియాశక్తి, బ్రహ్మ అధిదేవత, అకారంమాతృక, అన్నమయకోశము, సద్యోజాతముఖము.

తెలుపు—తెల్లగుడ్డు. ఆపోతత్వము, జ్ఞానశక్తి, విష్ణుఅధిదేవత, ఉకారంమాతృక, ప్రాణమయకోశము, వామదేవముఖము.

నలుపు—తెల్లగుడ్డుమధ్య నుండునల్లగుడ్డు. తేజోతత్వము, ఇచ్ఛాశక్తి, రుద్రుఁడు అధిదేవత, మనోమయకోశము, తత్పురుషముఖము

సునీలము—నల్లగుడ్డుమధ్యనుండుసీలమైనపాప. వాయుతత్వము, అదిశక్తి, ఈశ్వరుఁడధిదేవత, అర్ధమాతృక, విజ్ఞానమయకోశము, అఘోరముఖము.

ఇంద్రనీలము—పాపమధ్యను వెలిగేకళ. ఆకాశతత్వము, పరాశక్తి సదాశివుఁడు అధిదేవత, ఓంకారముమాతృక, ఆనందమయకోశము, ఈశానముఖము,

[ఈఅయిదురంగులు అయిదుచక్రములనియు బిందువే ఆజ్ఞాచక్రమనియు కళయే సహస్రారమనియు నిష్కళయే పరబ్రహ్మస్వరూపమనియు తెలియునది.]

నల్లగుడ్డునకే అండాండమనియు, గంగయనియు, చంద్రమండలమనియు, నాదమనియు, ఇడయనియు, కామాక్షియనియు, స్థూలదేహమనియు,జాగ్రదవస్థయనియు,తమోగుణమనియు

పాపకే పిండాండమనియు, యమునయనియు, నీలతోయదమనియు సూర్యమండలమనియు, బిందువనియు, పింగళయనియు, మీనాక్షియనియు,సూక్ష్మశరీరమనియు,స్వప్నావస్థయనియు రాజసగుణమనియు,

పాపమధ్యను వెలిగేకళకే బ్రహ్మాండమనియు, సరస్వతియనియు,విద్యుల్లేఖయనియు, అగ్నిమండలమనియు, కళయనియు,సుషుమ్నయనియు, విశాలాక్షియనియు, కారణదేహమనియు, మహాకారణమనియు, సుషుప్త్యవస్థయనియు, తుర్యావస్థయనియు సాత్వికగుణమనియు చెప్పుదురు.

[ఈకళలో నిష్కళయే పరబ్రహ్మస్వరూపము]

పృధివ్యాపస్తేజోవాయు రాకాశములనెడు పంచభూతములు, క్రియాశక్తిజ్ఞానశక్తి యిచ్ఛాశక్తిఆదిశక్తి పరాశక్తి యనెడుపంచశక్తులును, బ్రహ్మవిష్ణు రుద్రయీశ్వర సదాశివులనియెడి పంచదైవతములును, అకారఉకార మకార అర్ధమాత్రిక ఓంకారము లనియెడు పంచమాతృకలును అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములనెడు పంచకోశంబులును, అండాండ పిండాడ బ్రహ్మాండములనియెడు అండత్రయమును, గంగాయమునా సరస్వతులనియెడు వేణీత్రయమును, సూర్యచంద్రాగ్ని మండలంబులనియెడు మండలత్రయంబును, నాదబిందుకళ

లును,ఇడాపింగళసుషుమ్నలును,కామాక్షిమీనాక్షివిశాలాక్షియనెడు అక్షిత్రయమును,సత్వరజస్తమోగుణంబులును,మూలాధారస్వాధిష్ఠాన మణిపూరక అనాహతవిశుద్ధఆజ్ఞేయసహస్రారంబులనియెడు సప్తచక్రంబులును, స్థూలసూక్ష్మకారణశరీరంబులనియెడు శరీరత్రయంబును,జాగ్రత్స్వప్నసుషుప్తులనియెడు అవస్థాత్రయంబును, నేత్రస్థానమందె నిరూపించఁబడియెను. సమస్తవృత్తులును నేత్రస్థానమందె పుట్టును. నిద్రయును సంగమమందలికోరికయును అచ్చటనేకలుగును. రేతోస్ఖలనము ఆస్థానమునందేకలుగును. కావుననే రేతోస్ఖలనమప్పుడునీరసమునునిస్త్రాణయును నేత్రములయందు బరువునుకలుగును. ఇదిస్వానుభవమువల్లనే తెలియఁగలదు.

"అణోరణీయా న్మహతోమహీయా
నాత్మాగుహాయాం నిహితోస్యజన్తోః"

తైత్తిరీయోపనిషత్తు.

అతిసూక్ష్మములగు అణువులకంటె అణువును అతిస్థూలమైన మహత్తుకంటె మహత్తును అగుపరమాత్మ జంతువులయొక్క బుద్ధిగుహయందుండును.

"జాలసూర్యమరీచిస్థం యత్సూక్ష్మతరంరజః
తస్యషష్టాష్ట మోభాగః అణురిత్యభిధీయతే॥"

ఇంటికప్పులోని సందులగుండాజారెడుసూర్యకాంతిలోని నలుసుయొక్క ఆరోభాగమునకు లేక ఎనిమిదోభాగమునకు అణువనిపేరు.

నేత్రమందలి పాపకుమధ్యను నివ్వరిముల్లువంటిఅతిసూక్ష్మమగురంధ్రమున్నది. ఇక్కడినుంచియే నాడులుకపాలమునకుపోవును ఆరంధ్రమధ్యమందు ముక్తికాంతయున్నది. ఈనాళమే నడినాళమనియు బ్రహ్మరంధ్రమనియు మేరుశిఖరమనియు సుషుమ్నానాళమనియు చెప్పుదురు. అందుండెడిముక్తికాంతకే కళయనియు ఆపోజ్యోతియనియు చెప్పుదురు,

మనస్సును క్రమక్రమముగా లీనముచేసి, చూచేవాఁడున్ను చూడఁబడునదియును లేక, నిరామయుఁడై తుర్యావస్థనుపొంది ముక్తినొందవలయును. ఉపనిషత్తులుచదివితిమనియు మహావాక్యవిచారణవల్ల పరబ్రహ్మమయితిమనియు చెప్పుదురు. అదిభావంబుగాని యనుభవంబుగాదు స్త్రీనిపొంది తేసే ఆసుఖము తెలియవలెగాని కళాశాస్త్రము మొదలగు పుస్తకములు చదివినంతమాత్రముననే తెలియదు. సంగతులుమాత్రము తెలియునుగాని అనుభవముండదు- అట్లే బ్రహ్మానందానుభవమును ఉపనిషత్తులు మొదలుగాఁగలపుస్తకములు చదివినంతమాత్రముననుఁ,నాకు తెలుసును అనివిద్యామదముచేత చెప్పినంతమాత్రముననుఁ, అనుభవము కలుగనేరదు గాన మనస్సును వృత్తిరహితము చేసి అనుభవజ్ఞులు గావలయును.

***Mind should be concentrated & centred at the focus.***

చంద్రునికి సూర్యునివలననే కాంతకలిగెనుగాని సహజకాంతిలేదు. ఆసూర్యుఁడే పరబ్రహ్మమని కొందరుతలంచెదరు. అదియు అజ్ఞానము. సూర్యునికినిస్వతంత్రకాంతిలేకసమస్తభూతములయందు అంతరాత్మగా వెలిగే స్వప్రకాశమువల్లనే సూర్యునికికాంతి కలిగినది. ఈకళయును పరబ్రహ్మమనికొందరజ్ఞులుతలంచెదరు.ఆకళలోనిష్కళయేపరబ్రహ్మము. ఇదినిశ్చయము. అనిపెద్దలయభిప్రాయము.

చిదాకాశము.— ఇంద్రియగోచరంబు లగువస్తువులు విషయంబులనంబడు. అట్టివిషయంబులం దొక్కొకటి తెలివిచేగ్రహింపంబడియుండ నా తెలివి యావిషయంబునువిడచి మరియొకవిషయమునకు పోవునపుడు పూర్వముపొందియున్న విషయంబునువదలుటచేతనుయితరవిషయంబునుగ్రహింపకుండుటచేతనుయీమధ్యకాలంబున విషయంబులనంటకుండు నా తెలివికి

యేరూపంబో అదియ చిదాకాశంబు. స్థూలంబునకుచూచు వాఁడుసాక్షియనియు, చూచువానికి మనస్సు సాక్షియనియు మనసున కగ్రముగ బుద్ధియనియు, బుద్ధి కగ్రముగ ఆత్మ యనియు, ఆత్మ కగ్రముగ పరమాత్మయనియు, పరమాత్మ కగ్రముగ పరబ్రహ్మమనియు పెద్దలయభిప్రాయము.

అక్షురుఁడు.—రక్త శ్వేత కృష్ణ నీల వర్ణములమధ్యను బ్రకాశించు ఆపోజ్యోతినేసీలతో యదమధ్యస్థమయినవిద్యుల్లేఖయనియు అక్షురుండనియు చెప్పుదురు. ఇదియే అంతర్లక్ష్యం, గగన ముద్రి, శిఖాస్థానము, అగ్నిశిఖ, సర్వసాక్షి, చిన్మయనేత్రి స్థానము, మేరుశిఖరము, కైలాసము, సత్యలోకవైకుంఠము లకు స్థానము అని చెప్పుదురు.

"అధిప యిదిమర్త్యమంగధరాగ్రసుధ్య
వార్థినడుమ కృష్ణాశ్రయద్వారవతిని
యాత్ముఁడున్నాఁడు సూక్ష్మదృగ్వ్యాప్తిచేత
జ్ఞాతగలవాఁడవైకను సాజ్ఞగాను."

ఇందలియర్థమును బెద్దలవలనఁ దెలియునది.

## పంచముద్రలు.

1. ఖేచరి—పర్వత గుహాప్రదేశంబున ఆసనంబున సమాసీనుండై పద్మాసనమునందు కూర్చొని అర్ధోన్మీలితలోచనుండై నవ ద్వారంబులఁ జిత్తంబుచే నిరోధించి విషయములతోకూడ యింద్రియములను ప్రత్యాహారముగావించి కుండలీశక్తిని మేలుకొలిపి ప్రాణవాయునిరోధముచేసి తాలువులమధ్యప్ర దేశంబున జిహ్వామూలంబు లగ్నంబగుటఁగావించి బహిరం

తరములయందును ఊర్ధ్వాధోభాగంబులయందునుభావాభావ రూపంబులయందును సంయోగింపని మనోదృష్టిన్వహించి దంతంబులచేతం దంతంబులస్పృశింపక మనస్సునుఊర్ధ్వముఖముగ మూర్ధ్నియందుంచి వృత్తిరహితముచేయవలయును. ఇదియ ఖేచరిముద్ర. ఈముద్ర తెలియువఱకు అతికష్టమనియు తెలిసినపిమ్మట అతిసులభమనియు అనుభవజ్ఞులు చెప్పుదురు.

2. భూచరి:—నేత్రములు గదలింపక నాసికాగ్రమున దృష్టినిలుపుట.

3. మధ్యలక్ష్యము:—కనులు సగముమూసి నాసికామధ్యమందు దృష్టినినిలిపి అంతర్లక్ష్యమందు మనసునునిలుపునది.

4. షణ్ముఖి:—నేత్రములు రెండు, శ్రోత్రములురెండు, నాసికా రంధ్రములురెండు, యీయాఱురంధ్రములుమూశి భ్రూమధ్యమందు దృష్టిని నిలిపి నాదబిందు చిత్కళలను తెలియునది.

5. శాంభవి. "అంతర్లక్ష్యం బహిర్దృష్టి ర్ని మేషో న్మేషవర్జితా
ఏషాసా శాంభవీముద్రా సర్వతంత్రేషు గోపితా॥"

లక్ష్యములు మూఁడువిధములు:—

1. బహిర్లక్ష్యము—నేత్రములఁ దెరచి మనస్సును వృత్తులకుఁ బోనీయక యొకవస్తువయందుఁ గదలనీయక నిలుపుట. ఇందు దృశ్యమందు లక్ష్యమును నిలుపునది. ప్రథమమందు బహిర్లక్ష్యమును అభ్యసించునది.

2. మధ్యలక్ష్యము—నేత్రములఁ దెరచి మనస్సును వృత్తులకుఁబోనీయక అభిముఖముచేసికొని భ్రూమధ్యమందు లక్ష్యమునునిలుపునది. ఇందు దర్శనము (చూపు) నందే లక్ష్యమును నిలుపునది. బహి

ర్లక్ష్యమందు నిలిచినపిమ్మట మధ్యలక్ష్య మభ్య
సించునది. ఈ రెండులక్ష్యములు అభ్యాస
మాయినపిమ్మట అంతర్లక్ష్యమభ్యసించునది.

3. అంతర్లక్ష్యము—నేత్రములఁ దెరచి శ్రోత్రత్వక్చక్షు
ర్జిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియములు వా
క్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియములు
మనోబుద్ధిచిత్తాహంకారములను అంతరింద్రియ
ములు యీపదునాలుగింద్రియములను ప్రాణా
పానవ్యానోదానసమానంబు లనెడిపంచప్రాణం
బులను నాగకూర్మకృకరదేవదత్తధనుంజయు
లనెడియుపవాయువులను జయించి దృష్టిని శబ్ద
గుణకంబును పంచభూతాత్మకంబును అగుఆకా
శంబునందువదలి మనస్సును వృత్తులకుఁ బోనీ
యక అభిముఖముచేసికొని భ్రూమధ్యమునకంత
రముగా లక్ష్యమును నిలిపి అక్కడివింతలను
చక్కఁగఁ జూచునది. ఇందు ద్రష్టయందు లక్ష్య
మును నిలుపునది. ఇదియ శాంభవీముద్ర.

---

ఖేచరి షణ్ముఖి శాంభవీ ముద్రలయందు అంతర్లక్ష్యమున్ను భూచరి ముద్రయందు బహిర్లక్ష్యమున్ను మధ్యముద్రయందు మధ్యలక్ష్యమున్ను ఉంచునది.

## పిండోత్పత్తి.

గర్భమందలి పిండముయొక్క యుత్పత్తినిగురించినది గనుక పిండోత్పత్తియని జెప్పఁబడియె.

ఆరగించిన అన్నము 7 దినములకు రసమగును. రసము 7 దినములకు రుధిరమగును. రుధిరము 7 దినములకు మాంసమగును మాం

సము 7 దినములకు మేదస్సగును. మేదస్సు 7 దినములకు అస్థియగును. అస్థి 7 దినములకు మజ్జయగును. మజ్జ 7 దినములకు శుక్లశోణితములగును.

సతిపతులు రతులుసల్పఁగ శుక్లశోణితములు మేళనమై అయిదుదినములకు నీరుబుగ్గయగును. సంయోగమునకు కూడనిదినములు బ్రహ్మచర్యమునందుఁ జెప్పఁబడియె. (మూ—పుట. 67)

పదిదినములకు నెత్తురై పదునేనుదినములకు మాంసపుముద్దయగును. ఇరువదిదినములకు గట్టిపడి యిరువదియైదుదినములకు మనుష్యాకారంబేర్పడును. మొదటినెలయందు పంచభూతములుకూడి తలయేరుపడును. రెండవనెలను మేదస్సు చేతులు కాళులు యేరుపడి మూఁడవ నెలను ఎముకలు మజ్జ గోళ్ళు వెండ్రుకలు చర్మము కలుగును. నాలుగవ నెలను అవయవములును సప్తధాతువులును అయిదువ నెలయందు చెవులు ముక్కు కన్నులు నోరు జనించి ఆఁకలిదప్పులు పుట్టును. ఆఱవ నెలయందు కడుపు కంఠనాళము యేరుపడి అరణియందు అగ్ని ప్రవేశించునట్లు జీవుఁడు గర్భరూపముగఁ బ్రవేశించుచున్నాఁడు. ఈమాసమందే మావిచేతఁ గప్పఁబడి తల్లిభుజించిన అన్నపానాదులవలన తృప్తి నొందుచుండును. ఏడవనెలయందు జనించిన రోగియగును. ఈమాసమందే జ్ఞానముకలుగును. ఎనిమిదవనెలయందు కలిగినబిడ్డ బ్రతుకదు. తల్లిగాని బిడ్డగాని మృతినొందును. తొమ్మిదవనెలయందు గర్భమందలి శిశువునకు విజ్ఞానముకలుగును. మావి యనెడుసంచియందలి నీటియందు తోణికిసలాడుచుండును. శుక్లశోణితవికారముగ మాతృగర్భములోచిక్కుపడి జఠరాగ్నిచేతను క్రిమికీటకాదులచేతను మాతృభుక్తకటుకషాయాది పదార్థములచేతను శ్రమనొందుచుండినను, బయలునతిరుగ నభ్యాసము లేనిమెలుక తానున్నకలుగే ప్రపంచమనియు సౌఖ్యమైనదియనియు యెంచినట్లు, మాతృగర్భకోశమే సుఖమైనదిగాతలంచి అచ్చట నేయుండ

నిశ్చయించి ప్రపంచములోకిపోజాలనని పరితపించుచుండగను యగ్నిదేవుఁడు గర్భమందలి బాలునియెదుట నిలిచి ధైర్యము చెప్పెను "నేనగ్నిదేవుండను. సర్వాంతర్యామిని. సర్వభక్షకుండను నీకుభృత్యుండనై నీనేత్రస్థానమందుండి నీవుసమస్తమునుజూచునటులఁ జేయగలను. వాక్కుస్థానమందుండి సంభాషించునట్లును నాభిస్థానంబున జఠరాగ్నిరూపంబుగనుండినవాఁడనై భుజించిన సమస్తపదార్థములు జీర్ణమగునట్లుగను నిద్రనుకల్పించి సౌఖ్యముకలుగునట్లుగను జేసెదను. ఇట్టిసమర్థుఁడను నేను నీకుసహాయుఁడనై యుండఁగనీకేమికొదువ! ప్రపంచములోకి రమ్ము. జ్ఞానసంపన్నుఁడ వగుదువు. నీవు మహనీయుండవు. మోక్షమును సాధించుకొనుటకు నేను సహాయుండ నయ్యెదను ప్రారబ్ధవశమున నీవిట్లు జన్మించవలసివచ్చెను. ఏవారికిని విధినిదాట నశక్యంబు. చేసికొనిన వారికి చేసికొనినంత యనులోకోక్తిననుసరించి యనుభవింపకతీరదు" అనిధైర్యమును జెప్పి యంతర్థానము నొందును. పిదప సూర్యుఁడు ప్రసన్నుఁడై ధైర్యము చెప్పును. "నేనుసూర్యుఁడను. నీనేత్రములకధిదేవతనై విశ్వమంతయుజూచునట్లు చేసెదను. జ్ఞానమునకు కారణభూతుఁడనై మోక్షమునుసాధించుటయందునీకుసహాయము చేసెదను. వెరువక ప్రపంచమునకు రమ్ము. నీవు మహనీయుండవు. నిన్ను నీవెరుగవు. కర్మచేత నిట్లయితివి. భయమునువదలిరమ్ము" అని ధైర్యమును జెప్పి యంతర్థానమునొందును. అనంతరము చంద్రుఁడు మనస్థానమందుండెదననియు వాయువు పంచప్రాణములుగానుండెదననియు వరుణుఁడు జిహ్వయందుండెదననియు బ్రహ్మగుహ్యేంద్రియమందుండెదననియు రుద్రుఁడు అహంకారమున కధిదేవతనై యుండెదననియు విష్ణువు పాదములయందుండి [illegible] పెద్దలవద్దికి నడిపించి మోక్షసాధకమందు సహాయుఁడనయ్యెదననియు బృహస్పతి బుద్ధియందుండి మోక్షమార్గమున

సహాయుండనయ్యెదననియు దేవతలందరు ధైర్యముజెప్పిరి. మృత్యుదేవత గుదస్థానమందుండి మలవిసర్జనమునుచేయుచు సత్పథమును దప్పిననాడు చంపెదనని చెప్పినను దేవతలందరు చెప్పినమాటలవలన ధైర్యముగల వాఁడై పదిమాసములునిండగను నాభినాళముక్రమముగాబలియుటచేత మాతయొక్క-సమానవాయువు నిలువతావులేక వ్యానవాయువుచేతఁ ద్రోయఁబడి తల్లి అన్నకోశములోనుండి పండినపండునకు తొడిమదాని కదిసల్లినచందంబున జారుచుండఁగ నొప్పులు కనుపించును. అప్పుడు వాయువకుంభింపఁబడును. అట్టికుంభకము చేతపొరయందున్న శిశువుఅధో ముఖమై తెలివినశించి కుంభకము చేతనే పొరపగిలి శిశువుభూమిమీఁదఁ బడి జన్మించును.

ఋతుకాలమందలి సరిదినములయందు గర్భమునిలిచిన మొగబిడ్డ లును బేసిదినములయందు గర్భమునిలిచిన యాఁడుబిడ్డలును కలుగుదురు.

తండ్రి యంశములు:—ఎముకలు, మెదడు, వీర్యము.

తల్లి యంశములు:—నెత్తురు, వెండ్రుకలు, మాంసము.

సంభోగకాలమందుఁ బురుషునికి రాజసగుణమెచ్చిన రాజసుండును, తామసగుణమెచ్చినతామసుండునుసత్వగుణమెచ్చినసాత్వికుండునుస్త్రీకి రాజసగుణమెచ్చిన వ్యర్థుండును, తామసగుణమెచ్చినకూరుఁడును, సత్వ గుణమెచ్చిన తపస్సంపన్నుఁడును; ఉదయకాలంబున జనించినసాత్వికుం డును, మధ్యాహ్న కాలమందు జనించినదుష్టవర్తనముగలధూర్తుఁడును అస్తమయకాలమందు జనించిన అసురరూపుఁడును, రాత్రిసరి పొద్దున జనించిన సకలసామ్రాజ్యసంపదలు గలవాఁడును, వేకువజామున జనిం చిన దీర్ఘాయుష్మంతుండును, అగుపుత్రుండు కలుగును,

మఱియు శుక్లమధికమయిన పురుషుఁడును, శోణిత మధికమైన స్త్రీయును, శుక్లశోణితములు సమమైన నపుంసకుండును, గర్భమందు శుక్లశోణితములు వాయువుచే భేదింపఁబడెనేని యిరువురు లేక ముగ్గురు శిశువులు కలుగుదురు.

అష్టమమాసమందు స్త్రీపురుషులు రతిసల్పఁగ వీర్యమును శిశువు గుడిచి పాపకర్ముండును జాడ్యగ్రస్తుఁడునుఅగును. తొమ్మిదవమాసమందురమించఁగ పిండము గర్భమునుండి యూడిపడును.

గర్భిణీస్త్రీలు పరుగెత్తకూడదు. గోకుకొనగూడదు. వేగముగ నడువగిట్టదు. బలువైన పనులఁ జేయగిట్టదు. ఋతుకాలమందలి పదియాఱవ దినమున నిలిచిన గర్భమందు బ్రహ్మవిద్యాధురంధరుఁడు కలుగును. తల్లి గర్భమందుఁ పురుషుఁడు కుడిప్రక్కను స్త్రీ యెడమప్రక్క నుండుదురు.

దేహమలములు—క్రొవ్వు, రేతస్సు, రక్తము, చీమిడి, మూత్రము, మలము, చెవిగులిమి, గోళ్లు, మురికి, కఫము, కంటిపుసి, చెమట.

జన్మములు నాలుగువిధములు.

1. జరాయుజములు—మావియందుఁబుట్టి మావితోనే భూమిమీఁదఁ బడుమనుష్యులు పశువులు మృగములు. పుణ్యముయొక్క ఆధిక్యతచేత నిట్టిజన్మ కలుగును.

2. అండజములు—గ్రుడ్డువలనఁ బుట్టెడు పక్షులు సర్పములు మొదలుగాఁగలవి.

3. స్వేదజములు—చెమటవలనఁ బుట్టెడు నల్లి దోమ మొదలుగాఁగలవి.

4. ఉద్భిజ్జములు—భూమినిఁబగులగొట్టుకొని పైకివచ్చెడువృక్షములు, నేలనల్లుకొనుతీగెలు మొదలుగాఁగలవి. పాపముయొక్క ఆధిక్యతచేత నిట్టిజన్మకలుగును.

ఉత్తరాయణము—పుష్యమాసము మొదలు జ్యేష్ఠమువరకునుండు ఆఱుమాసములు. ఇది దేవతలకు పగటికాలము. అందువలన స్వర్గద్వారములు తెఱచి యుండును.

దక్షిణాయనము—మిగిలిన యాఱుమాసములు. ఇది దేవతలకు రాత్రికాలము. అందువలనస్వర్గద్వారములు మూసియుండును.

ఉత్తరాయణమందు మృతినొందిన వారుస్వర్గస్థులనియు దక్షిణాయనమందు మృతినొందినవారు స్వర్గద్వారములు మూసియుండుటవలన స్వర్గస్థులుకానేరరనియు చెప్పుదురు. ఈలోకోక్తికి నిజమైనయర్థమును వోచించవలెను. భూలోక భువర్లోక సువర్లోకమహర్లోక జనర్లోక తపోలోక సత్యలోకములు నాభి మొదలుకొని ఊర్ధ్వభాగమందుండును. భూలోకమునకు నాభిస్థానము. సత్యలోక మన్నిటికిఁ బైనయుండునుగనుకదీనికే ఉత్తరాయణమనియు అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళంబులు అనెడుఅధోలోకములలో పాతాళము చివరనుండును గనుక దీనికి దక్షిణాయనమనియు చెప్పుదురు. మృతినొందుట యనఁగా మనస్సు మగ్నతయగుట. ఉత్తరాయణమందు మనసు ఊర్ధ్వముఖవ్యాపనముగలదై నిర్విషయమందు మగ్నతయగును. దక్షిణాయనమందు అధోముఖవ్యాపనముగలదై విషయములయందు మగ్నతయగును. కనుక ఉత్తరాయణమందు మృతినొందినవానికి-అనఁగా ఎవనిమనస్సు ఊర్ధ్వముఖవ్యాపనముగలదై నిర్విషయమందు మగ్నతయగునో అట్టివానికి నిరంతరసుఖము కలుగును. అదియె స్వర్గస్థులగుట.

(అనుభవనీయము.)

మానుషజన్మంబు దుర్లభంబు. అందుఁ బురుషత్వంబు దుర్గమంబు. అదియు శతవర్షపరిమితంబయిన జీవితకాలంబున నియతంబై యుండు. అందు సగమంధకారబంధుర మగురాత్రిరూపంబున నిద్రాదివ్యవహారం

బుల నిరర్థకంబయినను యిరువదిసంవత్సరంబులు బాల్యయౌవన కౌమారవయోవిశేషంబుల గడచు. ముప్పదిసంవత్సరంబులు తృష్ణకామక్రోధలోభమోహమదమాత్సర్యములునుగలిగి అష్టపాశంబులఁ గట్టువడి విడివడసమర్థుండుగాక దారాపుత్రాదులు మొదలుగాగల సంసారతాపత్రయములలో జిక్కువడి గడ్డమువిూసము నెరసి నరములుకీళ్లును పట్టువదలి చెవులువినఁబడక కండ్లుకనుబడక దంతములూడి అహంకారము జిహ్వచాపల్యమధికమై దగ్గు కఫము మొదలగు వ్యాధులుగలవాఁడై కట్టనుపూనియైనను నడునశక్తి లేకున్నను స్త్రీలమీఁదనుధనముమీఁదను ఆశమాత్రము విశేషముగాఁగలవాఁడై వ్యాధులచేతను మనోవ్యాకులముచేతను క్షీణించుచు చచ్చుచుఁబుట్టుచుండును.

మానుషప్రమాణంబు 8 జానలపొడుగు. ముప్పదిమూఁడుకోట్లరోమంబులును సమానవ్యానోదాన ప్రాణాపానంబులను పంచప్రాణంబులును, అన్నమయప్రాణమయమనోమయ విజ్ఞానమయఆనందమయములనెడు పంచకోశంబులును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వ ఘ్రాణంబులనెడు జ్ఞానేంద్రియములును వాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియంబులును దశవాయువులును డెబ్బదిరెండు వేలనాడులునుబదిరంధ్రంబులును త్వక్చర్మమాంసరుధిరమేదోమజ్జాస్థియనెడు సప్తధాతువులును కామక్రోధలోభమోహమదమాత్సర్యంబు లనెడుఅరిషడ్వర్గంబును నవద్వారంబులును గలిగిమాయాశరీరంబయ్యె.

జన్మములన్నియు ఋణమువల్ల నేర్పడును.

"ఋణానుబంధ రూపేణ పశు పత్నీ సుతాలయాః
ఋణక్షయే క్షయంయాంతి కాత్రపరివేదనా."

భార్యా బిడ్డలు పశువులు ఋణమువలన నేకలుగుచున్నవి. ఋణము తీరినతోడ్తోడన యవి నశించును. పుణ్యము గలవారికి అర్చిరాదిమార్గమని ధూమాదిమార్గమని రెండుమార్గములు. పాపము చేసినవారు నరకమందు వసింతురు.

1. అర్చిరాదిమార్గము.—ఇది సగుణబ్రహ్మోపాసకులు బ్రహ్మలోకమునకుఁబోవుమార్గము.

"అగ్నిర్జ్యోతి రహశ్శుక్లష్షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతాగచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః"

భగవద్గీత—8 అ. 24 శ్లో.

తేజస్సు పగలు శుక్లపక్షము ఉత్తరాయణము దేవయానము ఇడానాడి తేజోమార్గము—ఈ మార్గమునఁ బోవువారు యోగాభ్యాసముచేత వైరాగ్యము పరమోపశాంతియును కలిగి సంకల్పరహితులయి మనస్సన్న్యాసముగలవారై క్రమముగా సూర్యలోకమును పొంది అనంతరము బ్రహ్మలోకముఁజేరి ముక్తులగుచున్నారు. దీనినే సూర్యమార్గమనియు, నివృత్తి మార్గమనియుఁ జెప్పుదురు.

2. ధూమాదిమార్గము.—కర్మచేయువారు అనఁగా

"అగ్నిహోత్రం తపస్సత్యం వేదానాంచానుపాలనమ్
ఆతిథ్యం వైశ్వదేవంచ ఇష్టమిత్యభిధీయతే"

అగ్నిహోత్రములు తపస్సు సత్యవాక్పరిపాలన వేదపఠనము అతిథిఅభ్యాగతులకుఆతిథ్యమిచ్చుట వైశ్వదేవకర్మచేయుట మొదలుగాఁగలకర్మలను జేయువారికి పితృలోకమునకుఁ బోవుమార్గముతాముచేయు అగ్నిహోత్రధూమము ద్వారాకలుగును.

"ధూమోరాత్రిస్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనమ్
తత్రచాన్ద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్యనివర్తతే॥"

భగవద్గీత—8 అ. 25 శ్లో.

పోగ రాత్రి కృష్ణపక్షము దక్షిణాయనము పితృయానము పింగళానాడి—యీమార్గమున బోవువారు చంద్రలోకముఁ జేరి అచ్చట పుణ్యఫలమనుభవించి "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" అను న్యాయము చొప్పున మేఘమందుఁబడి జలమై, ఆ జలరూపమున ఓషధులలో జేరి అన్నమై, తద్వారా శుక్లంబై స్త్రీగర్భంబునం జేరి గర్భనరకమనుభవించి జననమై కర్మలుచేయుచు చచ్చుచు పుట్టుచుందురు. ఈమార్గమునఁ బోవువారికి పుణ్యక్షయానంతరము పునర్జన్మకలదు. దీనినే ప్రవృత్తిమార్గమనియు, చంద్రమార్గమనియు, జెప్పుదురు.

☞ అపరోక్షజ్ఞానముగలవారు సాధనచతుష్టయ సంపత్తిఁగలవారై శ్రవణ మనన నిదిధ్యాసలచేత బ్రహ్మవేత్తలై పైరెండుమార్గములను విడిచి జీవన్ముక్తులై పిమ్మట విదేహముక్తులగుదురు.

## పంచీకరణము.

సంఖ్యను గురించి చెప్పునది గనుక సాంఖ్యమనియు పంచమహాభూతములయొక్క భాగములను పంచిపెట్టుటను తెలియఁజేయునది గనుక పంచీకరణమనియుఁ జెప్పెదరు.

"మాయాశ్శబళితంబ్రహ్మ, బ్రహ్మణోరవ్యక్తం,అవ్యక్తాన్మహత్, మహతో అహంకారః, అహంకారాత్పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యోపంచమహాభూతాని, పంచమాభూతేభ్యో అఖిలంజగత్"

నిర్గుణసాక్షాత్కారపరబ్రహ్మస్వరూపమునందు చంద్రునియందలిచంద్రికవలె మాయాశక్తియుండును. అదియ మూలప్రకృతి బహిర్ముఖ

వ్యాప్తియైనప్పుడే యీ మాయాశక్తి కలదు. వృత్తిరహితమప్పుడు మాయాశక్తి లేదు. అసత్యమగుప్రపంచమును సత్యమని నమ్మించెడి వృత్తియే మాయ.

ఒకవస్తువకు దగ్గఱగానుండిచూచినపు డొకరూపమును దూరమున నుండి చూచినపుడు మఱియొకరూపమునువిశేషదూరముననుండిచూచి నప్పుడు యింకొకరూపమును కలిగియుండుట మనముకన్నులారఁజూచు చుంటిమి. ఒకవస్తువయందే వివిధరూపము లుండుటనుంచి నిజమైన రూపము లేదని మనకు తెలియఁగలదు. ఏవికారముతోచూచితే ఆవికా రముతో కనుబడును. వికారములు చూపునందేయున్నవి. త్రాటినిచూచి పామని భయపడినవానికి అది పాముగాదు త్రాడుఅనిచెప్పినమాత్రము ననే లాభముండదు. ఆమిథ్యాస్వరూప మగుపామును చంపనుద్యోగించి కర్రను దీపమును తీసుకపోయి కర్రతో దెబ్బవేయను ఆపాము కదలక మెదలక యుండుటను జూచి యది పాముగాదు త్రాడని భయపడినవా నికిచెప్పి వానినిగూడ తీసుకపోయిచూపించగను ఆభయముపోయిత్రా డనునిశ్చయము కలుగును. అట్లుగాక దీపమును కర్రను తీసుకపోయి వానిభయము తీర్చకనే అది పాముకాదు త్రాడనిచెప్పిన వీనినివెర్రివాఁ డని చెప్పుదురు. వాఁడి భయమున్ను పోదు. స్వప్నావస్థయందుఁ గనిన కల అసత్యమని తెలిసినను తానునిజముగాజూచినట్టుగను పనులుఅన్ని యు జేసినట్టుగను కథగాఁజెప్పినరీతిని యీప్రపంచమంతయు అసత్య మనియు అబద్ధమనియు నిశ్చయముగా తెలిసినను అధ్యారోపాపవాద ముగా ప్రపంచసృష్టిని పంచీకరణమందు చెప్పవలసివచ్చెను.

ఈమాయ త్రిగుణాత్మిక గనుక సత్వగుణము రజోగుణము తమో గుణము అనుమూఁడుగుణములు కలది. ఈమాయ వచ్చినతోడనే నిర్గుణ బ్రహ్మకు సగుణబ్రహ్మ యని చెప్పవలసివచ్చెను.

సత్వగుణము—జ్ఞానసుఖములయం దిచ్ఛనుపుట్టించును.

రజోగుణము—రాగతృష్ణలయం దిచ్ఛనుపుట్టించును.

తమోగుణము—విపరీతజ్ఞానము నిద్రాలస్యాదులు పుట్టించును.

సత్వగుణముయొక్క ఉత్తమగతి—బ్రహ్మ, ధర్మదేవత, మహత్తు, అవ్యక్తములు కలిగెను.

సత్వగుణముయొక్క మధ్యమగతి—సోమయాజులు, ఋషులు, దేవతలు వేదాభిమానులు, ధ్రువుఁడు, వర్మ, దేవతలు, పితరులు మొదలగువారు కలిగిరి.

సత్వగుణముయొక్క అధమగతి—వానప్రస్థులు, సన్యాసులు, బ్రాహ్మణులు, విమానసంచారులు, నక్షత్రములు, దైత్యులు మొదలగువారు కలిగిరి.

రజోగుణముయొక్క ఉత్తమగతి—గంధర్వులు, గుహ్యకులు, యక్షులు విద్యాధరులు, అప్సరసలు, మొదలగువారు కలిగిరి.

రజోగుణముయొక్క మధ్యమగతి—రాజులు, క్షత్రియులు, రాజపురోహితులు, వాదము జేయువారు మొదలగువారు పుట్టిరి.

రజోగుణముయొక్క అధమగతి—మల్లులు, నటులు, యోధులు, జూదరులు, తాగుబోతులు మొదలగువారుపుట్టిరి.

తమోగుణముయొక్క ఉత్తమగతి—చారణులు, పక్షులు, పురుషులు, రాక్షసులు, పిశాచములు, మొదలుగాఁగలవి కలిగెను.

తమోగుణముయొక్క మధ్యమగతి—ఏనుఁగు, గుఱ్ఱము, శూద్రులు, తురకలు, సింగము, పులి మొదలుగాఁగలవి కలిగెను.

తమోగుణముయొక్క అధమగతి— వృక్షములు, పురుగులు, తేళ్లు, చేపలు, తాబేళ్లు, మృగములు, పశువులు, మొదలుగాఁగలవి కలిగెను.

సత్వగుణము—కోపములేక సంకల్పమునులేక కలిమిలేములు సమము
గాఁజూచుచు గురుసేవచేయుట. ఈగుణములు కలిగిచచ్చిన
వాఁడు బ్రహ్మలోకమందుగాని దేవలోకమందు గాని తిరిగి
పుట్టును.

రాజసగుణము—కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములుకలి
గియుండుట. మనస్తాపము కలిగియుండుట. ఈగుణములుకలి
గి చచ్చినవాఁడు స్త్రీయోనియందుఁ బుట్టును.

తమోగుణము— దయలేమి, ఆలస్యము,అలసట, జయము, అహంకా
రమువిశేషముగాఁగలిగియుండుట,కోప మధికము-ఈగుణము
లుకలిగి చచ్చినవాఁడు గాడిదయై పుట్టును.

[కావున సర్వకాలములయందును సాత్వికగుణమే కలిగియుండవలెను.]

ఈత్రిగుణాత్మకయగుసగుణబ్రహ్మయందుఅవ్యక్తముపుట్టెను. అదియ
మూలప్రకృతి. ఆ అవ్యక్తమందు మహత్తత్వమును, మహత్తత్వ
మందు అహంకారమును, అహంకారమందు శబ్దస్పర్శరూపరసగంధంబు
లనియెడు పంచతన్మాత్రలు కలిగెను.ఆపంచతన్మాత్రలవలనఁ బృథివ్యాప
స్తేజోవాయ్వాకాశంబులనియెడుపంచభూతంబులును, ఆపంచభూతముల
యొక్క అన్యోన్యసమ్మేళనమువలన సమస్తజగత్తును ఏరుపడియెను.

అవ్యక్తము రెండువిధములు.—

1. మాయ.—2. అవిద్య.

అందు మాయ శుద్ధసత్వప్రధాన గనుక పరబ్రహ్మజ్ఞానమును కలు
గఁజేయును. అవిద్య మలినసత్వప్రధాన గనుక ప్రపంచజ్ఞానమును కలు
గజేసి విషయములయందు మనస్సును ప్రవేశింపఁజేయును. మాయాప్ర
తిబింబము సర్వజ్ఞత్వాది గుణములుగల ఈశ్వరుఁడనియును అవిద్యా
ప్రతిబింబము కించిజ్జ్ఞత్వాది గుణములుగల జీవుండనియుఆయీశ్వరునకే

అవ్యాకృతుఁడు లేక అంతర్యామి యనియు ఆజీవునకే ప్రాజ్ఞుఁడనియు పారమార్థికుఁడనియు చెప్పుదురు. ఈశ్వరునకు మాయయే కారణశరీరమును సుషుప్త్యవస్థయును ఆనందమయకోశంబును అగును. జీవునకు అవిద్యయే కారణశరీరమును సుషుప్త్యవస్థయును ఆనందమయకోశంబును అగును.

సగుణబ్రహ్మము త్రిగుణములలో తమోగుణమును వీక్షించుటచేత ఆవరణశక్తి గలిగెననియు, ఆవరణశక్తిప్రతిబింబమే విక్షేపశక్తియనియు చెప్పుదురు.

☞ మాయా ప్రతిబింబము యీశ్వరుఁ డనఁగ మాయయందు ప్రతిఫలించిన ఆత్మయందు యీశ్వరుఁడు కలిగెను అనిగ్రహించునది; అట్లే తక్కినవానిని గ్రహించునది. ఆత్మ యనఁగా సగుణబ్రహ్మయని చెప్పుదురు.

మహదహంకారమునందు శబ్దగుణకమగు ఆకాశముకలిగెను. ఆకాశమునందు శబ్దస్పర్శగుణకమగు వాయువుకలిగెను. వాయువునందు శబ్దస్పర్శరూపగుణకమగు అగ్ని కలిగెను. అగ్నియందు శబ్దస్పర్శరూపరసగుణకమగు జలము కలిగెను. జలమునందు శబ్దస్పర్శరూపరసగంధగుణకమగు పృథివికలిగెను. ఆపృథివియందు ఓషధులుకలిగెను. ఓషధులవల్ల అన్నముకలిగెను. అన్నమువలన జీవులువృద్ధిఁబొందిరి.

☞ ఈశ్వరునికిసద్యోజాత వామదేవ తత్పురుష అఘోరయీశాన్యములనెడు అయిదుముఖములుగలవు. అందలి యీశాన్యముఖమందు ఆకాశముపుట్టెను. అఘోరముఖమునందు వాయువుపుట్టెను. తత్పురుషముఖమందు అగ్నిపుట్టెను. వామదేవముఖమందు ఉదకముపుట్టెను. సద్యోజాతముఖమందు పృథివిపుట్టెను.

పంచమహాభూతములు తామససమష్టిపంచభూతములని తామసవ్యష్టిపంచభూతములని రెండుసమభాగములుగఁ జేయఁబడెను.

పృథివి = $\frac{1}{2}$ పృథివి + $\frac{1}{2}$ పృథివి.

జలము = $\frac{1}{2}$ జలము + $\frac{1}{2}$ జలము.

అగ్ని = $\frac{1}{2}$ అగ్ని + $\frac{1}{2}$ అగ్ని.

వాయువు = $\frac{1}{2}$ వాయువు + $\frac{1}{2}$ వాయువు.

ఆకాశము = $\frac{1}{2}$ ఆకాశము + $\frac{1}{2}$ ఆకాశము.

ఈ అరభాగములలో మొదటియరభాగములు తామససమష్టి పంచభూతములు. వానినివేరుగనుంచి రెండవయరభాగములగు తామసవ్యష్టి పంచభూతములను యొక్కొక్కటి నాలుగుభాగములుగ విభజించునది

$\frac{1}{2}$ పృథివి = $\frac{1}{8}$ పృథివి + $\frac{1}{8}$ పృథివి + $\frac{1}{8}$ పృథివి + $\frac{1}{8}$ పృథివి.

$\frac{1}{2}$ జలము = $\frac{1}{8}$ జలము + $\frac{1}{8}$ జలము + $\frac{1}{8}$ జలము + $\frac{1}{8}$ జలము.

$\frac{1}{2}$ అగ్ని = $\frac{1}{8}$ అగ్ని + $\frac{1}{8}$ అగ్ని + $\frac{1}{8}$ అగ్ని + $\frac{1}{8}$ అగ్ని.

$\frac{1}{2}$ వాయువు = $\frac{1}{8}$ వాయువు + $\frac{1}{8}$ వాయువు + $\frac{1}{8}$ వాయువు + $\frac{1}{8}$ వాయువు

$\frac{1}{2}$ ఆకాశము = $\frac{1}{8}$ ఆకాశము + $\frac{1}{8}$ ఆకాశము + $\frac{1}{8}$ ఆకాశము + $\frac{1}{8}$ ఆకాశము

ఒకభూతమున కొక పెద్దభాగమునుతక్కినభూతములచిన్న భాగముల నొక్కొక్కటియును కలిసి పంచీకృతమగుభూతమగును. అట్టిపంచీకృతములగు భూతములతోఁ జేయఁబడినదియె కరచరణాద్యవయవములతోఁ గనుబడు యీస్థూలశరీరము.

పంచీకృతపంచమహాభూతములు } అపంచీకృత పంచమహాభూతములు.

ఆకాశము = $\frac{1}{2}$ ఆకాశము + $\frac{1}{8}$ వాయువు + $\frac{1}{8}$ అగ్ని + $\frac{1}{8}$ జలము + $\frac{1}{8}$ పృథివి.

ఇందువలన మోహము, లజ్జ, భయము, ద్వేషము, రాగములు కలిగెను. సదాశివుఁడు అధిదేవత, పరాశక్తి.

వాయువు= $\frac{1}{8}$ ఆకాశము + $\frac{1}{2}$ వాయువు + $\frac{1}{8}$ అగ్ని + $\frac{1}{8}$ జలము + $\frac{1}{8}$ పృథివి.
ఇందువలన పడియుండుట, చాచుట, ముడుచుట, ఎగురుట, పరుగెత్తుటలు కలిగెను. ఈశ్వరుఁడు అధిదేవత. ఆదిశక్తి.

అగ్ని = $\frac{1}{8}$ ఆకాశము + $\frac{1}{8}$ వాయువు + $\frac{1}{2}$ అగ్ని + $\frac{1}{8}$ జలము + $\frac{1}{8}$ పృథివి.
ఇందువలన సంగమము, ఆలస్యము, నిద్ర, దప్పిక, ఆఁకలి కలిగెను. రుద్రుఁడు అధిదేవత. ఇచ్ఛాశక్తి.

జలము= $\frac{1}{8}$ ఆకాశము + $\frac{1}{8}$ వాయువు + $\frac{1}{8}$ అగ్ని + $\frac{1}{2}$ జలము + $\frac{1}{8}$ పృథివి.
ఇందువలన శుక్లము, రక్తము, చెమట, మూత్రము, ఉమ్మినీరు కలిగెను. విష్ణువు అధిదేవత. జ్ఞానశక్తి.

పృథివి= $\frac{1}{8}$ ఆకాశము + $\frac{1}{8}$ వాయువు + $\frac{1}{8}$ అగ్ని + $\frac{1}{8}$ జలము + $\frac{1}{2}$ పృథివి.
ఇందువలన రోమములు, నరములు, చర్మము, మాంసము, ఎముకలు కలిగెను. బ్రహ్మ అధిదేవత. క్రియాశక్తి.

తత్వములు—యిరువదియైదు.

1. జ్ఞాత—$\frac{1}{2}$ తమోగుణసంబంధమగు ఆకాశము. ఇదియె సమష్టిభాగము. దీనికి సాధనము జ్ఞానము. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు అంతరింద్రియముల యొక్క విషయవ్యాపారములను ఏ తెలివి చేతను తెలిసికొనునో ఆ తెలివియే అంతఃకరణస్థానమందునఁ జేరి జ్ఞాతయనియు జీవుఁడనియుఁ జెప్పఁబడును. వీనికే ప్రత్యగాత్మ, జీవసాక్షి, అంతర్యామి, పరమాత్మ, యనిపేరులు. అధిదేవత కూటస్థుఁడు విషయము జ్ఞేయము. సాత్వికాకాశమందలి యర్థభాగము ప్రత్యగాత్మాధి దేవతతోఁగూడి జ్ఞాతయందు జేరి సకలేంద్రియ ప్రభుత్వముఁ జేయుచున్నది.

2. మనస్సు—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగు ఆకాశము + $\frac{1}{8}$ తమోగుణసంబంధ మగువాయువు. కంఠస్థానము. సాత్విక వాయువులో

సగభాగము చంద్రాధిదేవతతో మనస్సునందుఁజేరి సంకల్పించుచున్నది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆకాశపంచకం; అంతఃకరణములు; ఆంతరింద్రియములు | అహంకారము | చిత్తము. | బుద్ధి. | మనస్సు. | జ్ఞాత. |
| వాయుపంచకం; పంచప్రాణములు. | అపానము. | ప్రాణము. | ఉదానము. | వ్యానము. | సమానము. |
| అగ్నిపంచకం; జ్ఞానేంద్రియములు; మధ్యేంద్రియములు. | ఘ్రాణము. | జిహ్వ. | చక్షువు. | త్వక్కు. | శ్రోత్రము. |
| జలపంచకం; పంచతన్మాత్రలు; | గంధము. | రసము. | రూపము. | స్పర్శము. | శబ్దము. |
| పృథివిపంచకం; కర్మేంద్రియములు; బాహ్యేంద్రియములు. | పాయువు. | ఉపస్థ. | పాదము. | పాణి. | వాక్కు. |

3. బుద్ధి—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగు ఆకాశము + $\frac{1}{8}$ తమోగుణసంబంధ మగుఅగ్ని. ముఖము స్థానము. సాత్వికాగ్నిలో సగభాగము బృహస్పత్యాధిదేవతతోఁ గూడి బుద్ధియందు నిలిచి మనస్సునందలి సంకల్పములను నిశ్చయిస్తున్నది.

4. చిత్తము—$\frac{1}{8}$ తమోగుణసంబంధ మగుఆకాశము + $\frac{1}{8}$ తమోగుణసంబంధ మగుజలము. అధిదేవత జీవుఁడు. నాభి స్థానము. సాత్వికజలములోసగభాగము క్షేత్రజ్ఞాధిదేవతతోఁగూడి చిత్తమందుఁజేరి బుద్ధిచేసిననిశ్చయమును ఆలోచన చేయుచున్నది.

5. అహంకారము—$\frac{1}{8}$ తమోగుణసంబంధ మగుఆకాశము + $\frac{1}{8}$ తమోగుణసంబంధ మగుపృథివి. హృదయము స్థానము. సాత్వికపృథివిలో సగభాగము అహంకారముతోఁ గూడి అభిమానించుచున్నది.

"హృది ప్రాణో గుదే పాన స్సమానో నాభిసంస్థితః
ఉదానః కంఠదేశస్థో వ్యాన స్సర్వశరీరగః"

6. సమానవాయువు—$\frac{1}{8}$ తమోగుణసంబంధ మగువాయువు + $\frac{1}{8}$ తమోగుణసంబంధ మగుఆకాశము. ప్రాణాపానములమధ్యను నాభిస్థానమందుండి భుజించిన భక్ష్యభోజ్యచోష్యలేహ్యము లనెడుచతుర్విధాన్నమును జీర్ణముచేసి సప్తధాతువులకు పంచిపెట్టి దారుఢ్యమును కలుగజేయును. రాజసాకాశములో సగభాగము సమానవాయువందుఁ జేరిజఠరాగ్నిని ప్రజ్వరిల్లఁజేసిచతుర్విధపదార్థములనుపచనము చేయుచున్నది.

7. వ్యానవాయువు—$\frac{1}{8}$ తమోగుణసంబంధ మగువాయువు. ఇదియె సమష్టిభాగము. ఈవాయువు శరీరమందంతను వ్యాపించి

నదై కన్నులు చెవులు కాలిమడమలు పిరుదులు ముక్కు యీ స్థానములయందుండి ప్రాణాపానవాయు సంచారమును గలుగఁజేయును. రాజసవాయువులలో సగభాగము వ్యాన వాయువందు జేరి అన్నరసమును నరములకుఁబంచి పెట్టును

8. ఉదానవాయువు—½ తమోగుణసంబంధమగు వాయువు + ⅛ తమోగుణసంబంధమగు అగ్ని. ఈవాయువు కంఠస్థానమందుండి యిష్ట పదార్థములను తినుచు మ్రింగుచు అసహ్యపదార్థములను వెలుపలికిఁ త్రోయుచు వాగింద్రియమందుఁ జేరి అకారాది యేబదియక్షరములను బలికించుచు వాంతి మొదలగువానిని కలుగ చేయు చుండును. రాజసాగ్నిలో సగభాగము ఉదానవాయువందుఁ జేరి చాచుట ముడుచుట మొదలగు వ్యాపారములను జేయించుచు సుషుమ్నా నాడిద్వారా ఊర్ధ్వముఖ వ్యాపనముగలదై జీవునికి పుణ్యముచేత మంచిపదవులను పాపముచేత నరకమును కలుగఁజేయును.

9. ప్రాణవాయువు—½ తమోగుణసంబంధ మగు వాయువు + ⅛ తమోగుణసంబంధ మగు జలము.

"ముఖ నాసిక యోర్మధ్యే ప్రాణ స్సంచరతే సదా."

ఉత్తరగీత.

హృదయస్థానమందుండినదై ముక్కురంధ్రములగుండ ఉచ్ఛ్వాస నిశ్వాసరూపములచేత 21600 హంసలుగా సంచరించును. రాజసజలములో సగభాగము ప్రాణవాయువందుఁ జేరి నోటియందుండి ఉచ్చారణను, నాభియందుండి శబ్దమును గలుగఁ జేయును. ముక్కునందుండి శ్వాస

ళను పూరించుట రేచించుటలు జేయును. హృదయమం దుండి దగ్గు మొదలుగాఁగల వ్యాధులుగలుగఁజేయును.

10. అపానవాయువు—⅛ తమోగుణసంబంధమగు వాయువు +⅛ తమోగుణసంబంధ మగుపృథివి. మలమూత్రద్వారముల యందుండును. రాజసపృథివిలో సగభాగము అపానవాయువందుఁ జేరి అధోగమనవ్యాపారము జేయుచు మలమూత్రశుక్లములను వెళ్లఁద్రోయును.

ఉపవాయువులు.—

(1) నాగము—వాక్కునందుండిమాట్లాడించును. వాంతిచేయించును.

(2) కూర్మము—కన్నులు మూయుట తెరచుటలను చేతులు యిచ్చుట పుచ్చుకొనుటల యందును వ్యాపారములఁ జేయించును.

(3) కృకరము—పాదము స్థానముగాఁ గలదై తుమ్మించును.

(4) దేవదత్తము—ఉపస్థస్థానముగాఁగలదై ఆవలింతలు కలుగఁ జేయును.

(5) ధనుంజయము—పాయుస్థానముగాఁగలదై ఘోషించును.

11. శ్రోత్రేంద్రియము—⅛ తమోగుణసంబంధ మగుఅగ్ని +⅛ తమోగుణసంబంధ మగుఆకాశము. సాత్వికాకాశములో సగభాగము దిక్కులనేలఅధిదేవతతోఁగూడి శ్రోత్రేంద్రియమందుఁ జేరి వివిధశబ్దములను గ్రహిస్తున్నది.

12. త్వగింద్రియము—⅛ తమోగుణసంబంధమగు అగ్ని +⅛ తమోగుణ సంబంధమగువాయువు. సాత్వికవాయువులో సగభాగము వాయువు అను అధిదేవతతోఁగూడి త్వగింద్రియమందుఁ జేరి స్పర్శలను గ్రహిస్తున్నది.

13. చక్షురింద్రియము—$\frac{1}{2}$ తమోగుణసంబంధమగుఅగ్ని. ఇదియె సమష్టిభాగము. సాత్వికాగ్నిలో సగభాగము సూర్యుఁడను అధిదేవతతోఁగూడి రూపములను జూచుచున్నది.

14. జిహ్వేంద్రియము—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగుఅగ్ని + $\frac{1}{8}$ తమోగుణసంబంధమగుజలము. సాత్వికజలములో సగభాగము వరుణుఁడుఅను అధిదేవతతోఁగూడి సప్తవిధరసగ్రహణమును జేయును.

15. ఘ్రాణేంద్రియము—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగుఅగ్ని + $\frac{1}{8}$ తమోగుణసంబంధమగుపృథివి. సాత్వికపృథివిలో సగభాగము అశ్వినులు అనుఅధిదేవతలతోఁగూడి వాసనలను గ్రహించును.

16. శబ్దము—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగుజలము + $\frac{1}{8}$ తమోగుణసంబంధమగు ఆకాశము. శ్రోత్రము స్థానము.

17. స్పర్శము—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగుజలము + $\frac{1}{8}$ తమోగుణసంబంధమగు వాయువు. త్వక్కు స్థానము.

18. రూపము—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగుజలము + $\frac{1}{8}$ తమోగుణసంబంధమగు అగ్ని. నేత్రము స్థానము.

19. రసము—$\frac{1}{2}$ తమోగుణసంబంధమగుజలము. ఇదియెసమష్టిభాగవిషయము మాధుర్యముగానుండుట. జిహ్వ స్థానము.

20. గంధము—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగుజలము + $\frac{1}{8}$ తమోగుణసంబంధమగుపృథివి. ఘ్రాణేంద్రియము స్థానము.

21. వాగింద్రియము—$\frac{1}{8}$ తమోగుణసంబంధమగుపృథివి. + $\frac{1}{8}$ తమోగుణసంబంధమగు ఆకాశము. రాజసాకాశములో సగభాగము సరస్వతియను అధిదేవతతోఁగూడిమాటలను పలికిస్తున్నది,

22. పాణేంద్రియము—క తమోగుణసంబంధమగుపృథివి + క తమోగుణసంబంధమగువాయువు. రాజసవాయువులో సగభాగము ఇంద్రుడను అధిదేవతతోఁగూడి దానములను చేయుచున్నది.

23. పాదేంద్రియము—క తమోగుణసంబంధమగు పృథివి + క తమోగుణసంబంధమగు అగ్ని. రాజసాగ్నిలో సగభాగము ఉపేంద్రుఁడుఅను అధిదేవతతోఁగూడి గమనాగమనములు చేయుచున్నది.

24. ఉపస్థేంద్రియము—క తమోగుణసంబంధమగు పృథివి + క తమోగుణసంబంధమగు జలము. రాజసాగ్నిలో సగభాగము బ్రహ్మ అధి దేవతతోఁగూడి విషయానందములను గలుగఁజేయుచున్నది.

25. పాయురింద్రియము—క తమోగుణసంబంధమగు పృథివి. ఇదియె సమష్టిభాగము. రాజసపృథివిలో సగభాగము మృత్యువు అను అధి దేవతతోఁగూడి మలవిసర్జనము చేయుచున్నది.

జ్ఞాతమనోబుద్ధి చిత్తాహంకారంబులే అంతరింద్రియములు.

సమానవ్యానోదానప్రాణాపానంబులే పంచప్రాణంబులు.

శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులే జ్ఞానేంద్రియంబులు.

శబ్దస్పర్శరూపరసగంధంబులేపంచతన్మాత్రలు.పంచవిషయంబులు

వాక్పాణిపాదపాయూపస్థంబులే కర్మేంద్రియంబులు.

ఈయిరువదియైదునుగూడి స్థూలశరీరంబని చెప్పఁబడును.

జ్ఞాత కూటస్థుఁడనుఅధిదేవతచేతఁ బ్రేరేపింపఁబడి సమానవాయువుతోఁ గూడి శ్రోత్రేంద్రియద్వారా శబ్దములనుగ్రహించుచు వాక్కుచేత పలుకుచుండును.

## పంచీకరణము.

జ్ఞాత మనోరూపుఁడై చంద్రాధిదేవతచేతఁ బ్రేరేపింపఁబడి వ్యానవాయువుతోఁగూడి త్వగింద్రియద్వారా స్పర్శలను గ్రహించుచు పాణీంద్రియముద్వారా దానప్రతిగ్రహములను చేయుచుండును.

జ్ఞాత బుద్ధిరూపుఁడై బృహస్పత్యాధిదేవతచేతఁ బ్రేరేపింపఁబడి ఉదానవాయువుతోఁగూడుకొని చక్షురింద్రియద్వారా రూపములను గ్రహించుచు పాదేంద్రియముచేత గమనాగమనంబులు చేయుచుండును.

జ్ఞాత చిత్తరూపుఁడై క్షేత్రజ్ఞాధిదేవతచేతఁ బ్రేరేపింపఁబడి ప్రాణవాయువుతోఁగూడుకొని జిహ్వేంద్రియద్వారా రసములను గ్రహించుచు గుహ్యేంద్రియద్వారా మూత్రవిసర్జనయు శుక్లశోణితముల విసర్జనయు చేయుచు సంభోగములయందానందించుచుండును.

జ్ఞాత అహంకారరూపుఁడై రుద్రాధిదేవతచేతఁ బ్రేరేపింపఁబడి అపానవాయువుతోఁగూడుకొని ఘ్రాణేంద్రియద్వారా గంధములను గ్రహించుచు పాయురింద్రియద్వారా మలమును విసర్జించుచుండును.

జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు పంచప్రాణములు మనోబుద్ధులు. యీపదునేడింటితోఁగూడినది సూక్ష్మశరీరంబు. జ్ఞాతయే కారణశరీరంబు. సూక్ష్మశరీరంబునకు పందొమ్మిదితత్వంబులని కొందఱు చెప్పెదరు. పైనఁజెప్పఁబడినపదునేడును చిత్తాహంకారంబులు రెండునుగూడి పందొమ్మిది యగును.

| తత్వములు. | అధిదేవతలు. | విషయములు |
|---|---|---|
| 1. జ్ఞాత. | కూటస్థుఁడు. | జ్ఞేయము. |
| 2. మనస్సు. | చంద్రుఁడు. | సంకల్పవికల్పములు. |
| 3. బుద్ధి. | బృహస్పతి. | నిశ్చయము. |
| 4. చిత్తము. | క్షేత్రజ్ఞుఁడు. | చంచలము. |
| 5. అహంకారము. | రుద్రుఁడు. | నేననెడి అభిమానము. |
| 6. సమానవాయువు. | జయుఁడు. | ఆహారమును పచనముచేసును. |
| 7. వ్యానవాయువు. | విశ్వయోని. | అన్నరసమును పంచిపెట్టును. |
| 8. ఉదానవాయువు. | అజుఁడు. | తినుట మ్రింగుట మొదలగునవి |
| 9. ప్రాణవాయువు. | విశిష్టుఁడు. | శ్వాసరూపమున సంచరించు. |
| 10. అపానము. | విశ్వకర్త. | మలములను దోఁయుట. |
| 11. శ్రోత్రము. | దిక్కులు. | శబ్దములను వినుట. |
| 12. త్వక్కు. | వాయువు. | స్పర్శలను దెలిసికొనుట. |
| 13. చక్షువు. | సూర్యుఁడు. | దశవిధరూపములను చూచుట. |
| 14. జిహ్వ | వరుణుఁడు. | రుచులను దెలిసికొనుట. |
| 15. ఘ్రాణము. | అశ్వినులు. | వాసనలను దెలిసికొనుట. |
| 16. శబ్దము. | సదాశివుఁడు. | ఏకదేశశబ్దమును దెలిసికొనుట. |
| 17. స్పర్శము. | ఈశ్వరుడు. | ఏకదేశస్పర్శను దెలిసికొనుట. |
| 18. రూపము. | రుద్రుఁడు. | ఏకదేశరూపమునుదెలిసికొనుట |
| 19. రసము. | విష్ణువు. | ఏకదేశరసమును దెలిసికొనుట. |
| 20. గంధము. | బ్రహ్మ. | ఏకదేశగంధమునుదెలిసికొనుట. |
| 21. వాక్కు. | అగ్ని. | పుణ్యపాపమిశ్రసంభాషణము. |
| 22. పాణి. | ఇంద్రుఁడు. | దానప్రతిగ్రహములు. |
| 23. పాదము. | ఉపేంద్రుఁడు. | గమనాగమనంబులు. |
| 24. గుహ్యము. | బ్రహ్మ. | సంయోగానందము. |
| 25. పాయువు. | మృత్యువు. | మలవిసర్జనము. |

పంచమహాభూతములయొక్క సమష్టివ్యష్టి భాగముల అన్యోన్యసమ్మేళనమువలన యిరువదియైదుతత్వంబులు కలిగెను. యేభూతముయొక్క వ్యష్టిభాగములు ఆయాభూతముయొక్క సమష్టిభాగముతోకలియగను యిరువదియైదుతత్వములు లయమై పంచమహాభూతములు నిలుచును. పృధివిజలమందును జలమగ్నియందును అగ్నివాయువందును వాయువు ఆకాశమందును ఆకాశమహంకారమందును అహంకారముమహత్తత్వమందును, మహత్తత్వము మూలప్రకృతియందును మూలప్రకృతినిర్గుణ సాక్షాత్కార పరబ్రహ్మస్వరూపమందును లయమగును.

## శ రీ ర ము లు

స్థూలశరీరము—త్వక్చర్మమాంసరుధిరమేదో మజ్జాస్థి యనుసప్తధాతువులతో కూడుకొని యుండునదియును మాతాపితృల యొక్క శుక్లశోణితములవలనఁ బుట్టినదియును కరచరణాద్యవయవములు గలిగి, శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులనెడు జ్ఞానేంద్రియంబులు, జ్ఞాతమనోబుద్ధిచిత్తాహంకారంబు లనెడుఅంతరింద్రియంబులు, సమానవ్యానోదాన ప్రాణాపానంబులనెడు పంచప్రాణములు, శబ్దస్పర్శ రూపరసగంధంబులనెడు పంచవిషయంబులు, వాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియంబులు,యీ యిరువదియైదింటితోఁ గూడినదియును స్తంభమువలె ప్రత్యక్షముగ కనుబడునట్టిదియే స్థూలశరీరము.

దీనినిపొందిన

| యీశ్వరునకు | జీవునకు |
|---|---|
| 1. విరాట్పురుషుఁడు | 1. విశ్వుఁడు |
| 2. వైరాజసుఁడు | 2. చిదాభాసుఁడు |
| 3. వైశ్వానరుఁడు | 3. వ్యావహారికుఁడు |

అని చెప్పుదురు. ఇందు జాగ్రదవస్థ; విశ్వుఁడభిమాని; అన్నమయకోశము.

"పంచీకృత మహాభూత సంభవం కర్మసంచితమ్
శరీరం సుఖదుఃఖానాం భోగాయ తనముచ్యతే"

పంచీకరణము చేయఁబడిన పంచమహాభూతములవల్ల నేరుపడి ఆగామిసంచిత ప్రారబ్ధములు గలిగినట్టి స్థూలశరీరమే సుఖదుఃఖానుభవమున కునికిపట్టు.

దీనినిపొందిన బ్రహ్మవేత్తకు ఓత యని చెప్పుదురు.

సూక్ష్మశరీరము-

"పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితం
అపంచీకృతభూతోత్థం సూక్ష్మాంగంభోగసాధనమ్"

సమానవ్యానోదానప్రాణాపానంబులనెడు పంచప్రాణంబులును మనోబుద్ధులును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణంబులనెడు జ్ఞానేంద్రియంబులును వాక్పాణి పాదపాయూపస్థ లనెడు కర్మేంద్రియంబులును యీపదునేడింటితోఁగూడినదియు అపంచీకృత పంచమహాభూతముల వల్ల యేర్పడినదియునగు సూక్ష్మశరీరము సుఖదుఃఖములననుభవించుటకు సాధకము. దీనిని పొందినయీశ్వరునకు హిరణ్యగర్భుఁడనియు, బ్రహ్మవేత్తకు అనుజ్ఞాత యనియుఁ బేరులు. ఇందు స్వప్నావస్థ; తైజసుఁడభిమాని. ప్రాణమయ మనోమయ కోశంబులు.

కారణశరీరము—మలినసత్వరజస్తమోగుణాత్మకమైన యవిద్యయే కారణశరీరము. మహదహంకారమే కారణశరీరము.

"అనాద్యవిద్యానిర్వాచ్యా కారణోపాధిరుచ్యతే
ఉపాధిత్రితయాదన్య మాత్మానమవధారయేత్"

వాక్కుచేతఁ జెప్పనలవికానిదియును ఆదిలే నిదియు నగునజ్ఞానమే కారణశరీరము. ఆత్మ ను యీమూఁడుశరీరములకు విలక్షణముగా తెలిసికొనునది.

దీనినిపొందినయీశ్వరునకు అవ్యాకృతుఁడనియు బ్రహ్మ వేత్తకు అనుజ్ఞైకరసుఁడనియుఁ బేరులు. విజ్ఞానమయ ఆ నందమయకోశంబులు.

మహాకారణము—తుర్యావస్థ, కూటస్థుఁడభిమాని, మలినరహితమైన శుద్ధమనస్సే మహాకారణశరీరము. దీనినిపొందినయీశ్వ రునకు పరమాత్మయనియు బ్రహ్మవేత్తకు అవికల్పుఁడని యుఁ జెప్పుదురు. ఈమహాకారణశరీరమందుండువానికే శరీరత్రయవిలక్షణుఁడనియుఅవస్థాత్రయసాక్షియనియు, సర్వసాక్షియనియుఁ జెప్పుదురు. హిరణ్మయకోశము. ఈ శరీరరహితమందు సాక్షిత్వముగూడనుబోయి పరబ్రహ్మ మం దైక్యమగును. అదియ తుర్యాతీతము.

*N. B.*—మలినరహితమైన శుద్ధమనస్సు మహదహంకారముతో కలిసినప్పుడు దానికి మనస్సనియు జీవుఁడనియు చెప్పుదురు.

☞ సాక్షిత్వమున్నంతవఱకు నాలుగవశరీరమగు మహాకారణ శరీరమున్నది. అది సాక్షిగానుండును. ఈసాక్షిత్వముపోయి, యైక్యమై నప్పుడాశరీరముఁకూడఁ బోయి పరబ్రహ్మస్వరూపము లేక పరిపూర్ణ మగును. దీనినే యచలమనియుఁ జెప్పుదురు.

జహల్లక్షణము—ఒకదానిని వదలి మఱియొకదానిని తీసికొనుట.

అజహల్లక్షణము—ఒకదానికి తోడు మఱియొకదానిని తీసికొనుట.

జహదజహల్లక్షణము—తనకుండిన దానిలో కొంతభాగమును వదిలి కొంతభాగమును తీసికొనుట.

శ్రవణము—సద్గురువులవద్దఁజేరి వేదాంతశాస్త్రములవినుట.

మననము—పెద్దలవలనఁ దెలిసికొనినదానిని మనసునందు చింతనము చేయుట.

నిదిధ్యాస—ఆమననమువలన కలిగినపరిజ్ఞానమును నిష్ఠచేయుట.

పంచాగ్నులు—జ్ఞానాగ్ని భ్రూమధ్యమందు ఆత్మయను పదమందును,
కాలాగ్ని పాదములయందు అహంయను పదమందును,
క్షుధాగ్ని నాభియందును,
శీతాగ్ని హృదయమందును,
కోపాగ్ని నేత్రమందునుండును.

## అవస్థలు

1. జాగ్రత—శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులనెడు జ్ఞానేంద్రియంబులు వాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియంబులు మనోబుద్ధి చిత్తాహంకారంబులనెడు అంతరింద్రియంబులు యీపదునాలుగింద్రియ విషయములతోఁగూడి ఆత్మయందు పరాశక్తిసహితుండై సుఖదుఃఖముల నెరింగెడిది జాగ్రత. నేత్రస్థానము. ఇంద్రియములచేత సమస్త పదార్థములను తెలియుటమే జాగ్రదవస్థ. దీనిని అభిమానించుకున్న జీవుఁడు విశ్వుఁడనియు,చిదాభాసుఁడనియు, వ్యావహారికుఁడనియు,మూఁడువిధములుగఁజెప్పఁబడును

"నేత్రస్థం జాగ్రతం విద్యా త్కంఠే స్వప్న సమావిశేత్
సుషుప్తి హృదయస్థంతు తురీయం మూర్ధ్న్యవస్థితః"

2. స్వప్నము—ఆపదునాలుగింటితో ఆత్ముఁడు కంఠస్థానమునకు వచ్చినప్పుడు కన్నది స్వప్నము. జాగ్రదవస్థయందు అనుభవింపఁబడిన పదార్థములు జ్ఞాపకమునకు రావడమే స్వప్నము. దీనిని అభిమానించుకొనిన జీవునకు తైజసుఁడనియు, స్వప్నకల్పితుఁడనియు, ప్రాతిభాసికుఁడనియు మూఁడువిధములుగఁ జెప్పఁబడును.


జాగ్రత్స్వప్నములయందు రాగ ద్వేష కామ క్రోధ లోభ మోహ దంభ దర్ప మద మాత్సర్య ఈర్ష్య అసూయ అహంకార యిచ్ఛ భక్తి శ్రద్ధ సుఖ దుఃఖంబులు కలుగును.

3. సుషుప్తి—అంతఃకరణలో చిత్తాహంకారంబులనువిడచి మనోబుద్ధులతో ఆత్ముఁడు హృదయమునకు వచ్చినప్పుడు సుషుప్త్యవస్థ. ఇంద్రియములన్ని అవిద్యలో కలియడమే సుషుప్త్యవస్థ. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు వ్యాపారశూన్యములైనవుడునిద్రించుచున్నాఁడని చెప్పుదురు. ఇదియసుషుప్త్యవస్థ. దీనిని అభిమానించుకొనిన జీవునికి ప్రాజ్ఞుఁడనియు, అవిచ్ఛిన్నుఁడనియు, పారమార్థికుఁడనియుఁ బేరులు.

4. తుర్యము—ఈఅవస్థయందుకనినది ఏవారికిని చెప్పలేనిదే తుర్యంబు. స్థానము మూర్ధ్ని. దేవుఁడు గలఁడనెడి ఆస్తిక్యబుద్ధి గలిగి నిత్యానిత్యవస్తువివేకజ్ఞానము గలిగి యుండుటయే తురీయము.

5. తుర్యాతీతము—ఆత్ముఁడు ఒక్కఁడై మూలాధారంబునకు వచ్చినప్పుడు తన్నుదానుమఱచి పరమానందసుఖస్వరూపము

ననుండియథాప్రకారంబునవచ్చును. ఇదియమనస్కంబు. ఈ అవస్థా పంచకమార్గంబు యోగియెఱుంగు. దీనికే ఉన్మన్యవస్థయనియు చెప్పుదురు.

# పంచకోశములు

కోశము=కత్తిని ఒరయును, పిండమును మావియును, కప్పియున్నట్లు కప్పెడునదియె కోశము. సంచియని చెప్పుదురు.

1. అన్నమయకోశము—

"అన్నవికార శుక్లశోణితజన్య షడ్భావవికారసహితం
అన్నేనైవ వర్ధమానం ఇదం స్థూలశరీర మన్నమయకోశః"

అన్నమువలనఁబుట్టిఅన్నమువలననేవృద్ధిఁబొంది శుక్లశోణితములవలనఁ గలిగిన ఉండుటపుట్టుట పెరుగుటమారుట చిక్కుట నశించుట యనునాఱుభావవికారములు గలదై స్తంభమువలె స్థూలమై ప్రత్యక్షముగ కరచరణాద్యవయవములతోను త్వక్చర్మమాంసరుధిర మేదోస్థిమజ్జలనెడు సప్తధాతువులతోను గూడినదై సమస్తప్రాణికోటికి కనుబడెడిస్థూలశరీరమే అన్నమయకోశము. స్థూలశరీరము జన్మమునకంటె పూర్వమందును మరణమునకుఁబరమందును లేదు ఆత్మ యెల్లప్పుడుకలదు గనుక యిది యాత్మకాదు. మాతాపితృలయొక్క సంయోగమువలన కలిగి లయమగుచున్నది గనుక యాత్మకాదు.

2. ప్రాణమయకోశము—

"ప్రాణాదిపంచకంప్రాణమయఃకర్మేంద్రియైర్యుతమ్"
సమానవ్యానోదానప్రాణ అపానంబులనెడు పంచప్రాణంబులువాక్పాణిపాదపాయూపస్థలనెడు కర్మేంద్రియం

బులు నాగకూర్మకృకరదేవదత్తధనుంజయులనెడు ఉప వాయువులును గూడిప్రాణమయకోశమనంబడు. ఇదిఘటములవలెనే జడస్వభావముగలిగి క్షుత్పిపాసలతోను రజోగుణ అహంకారంబులతోను గూడుకొని యున్నందున యాత్మకాదు.

3. మనోమయకోశము—హంసస్వరూపంబగుప్రాణవాయువునంనుమనసునిల్వగాను మనోమయకోశమగును.

"జ్ఞానేంద్రియై ర్మనోయుక్తం మనోమయ ఇతీరితః" మనస్సు, శ్రోత్రత్వక్చక్షు ర్జిహ్వాఘ్రాణేంద్రియంబులు అనెడి జ్ఞానేంద్రియములైదును జేరి మనోమయకోశమగును. నేననెడి అభిమానముగల మనస్సు జడముగనుక మనోమయకోశము ఆత్మకాదు. ఇందు కామక్రోధలోభమోహమదమాత్సర్యములును వికారములును గలవు. కామక్రోధాదివృత్తులు ఒకప్పుడుండి యొకప్పుడు లేకపోతున్నవి గనుక యిది యాత్మకాదు. సుషుప్తిలోజడమైపడియుండి అహంకారముతో గూడుకొనియున్నది గనుక యాత్మకాదు.

4. విజ్ఞానమయకోశము— ఆమనస్సుచేత జ్ఞానమెరిగి ధ్యానమననాదివృత్తి కలిగినప్పుడే విజ్ఞానమయకోశము.

"బుద్ధిజ్ఞానేంద్రియై ర్యుక్తం విజ్ఞానమయకోశమ్"

బుద్ధియును శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లనెడుజ్ఞానేంద్రియంబులైదును గూడి విజ్ఞానమయకోశము. ఈ కోశమందు విద్యామదమును తద్ద్వారా మహాదహంకారమును గలవు గనుక యిది యాత్మకాదు. చిచ్ఛక్తితో

గూడుకొని యుండే బుద్ధివృత్తి జాగ్రత్స్వప్నముల యందుఁ బరిణమిస్తున్నందున యిది యాత్మకాదు.

5. ఆనందమయకోశము—అజ్ఞానమందు పరమానందమును పొంది నాను అనెడిదియె ఆనందమయకోశము. మలినసత్వరజస్తమోగుణాత్మికమైనయవిద్యయే ఆనందమయకోశము

"ప్రియమోద ప్రమోదవృత్తిమదజ్ఞాన ప్రధాన
మంతఃకరణం ఆనందమయకోశ ఇత్యుచ్యతే"

ప్రియము మోదము ప్రమోదము అనెడువృత్తులతోఁ గూడిన యజ్ఞానమే ప్రధానముగాఁగల యంతఃకరణయే ఆనందమయకోశము.

ప్రియము=పదార్థమును జూచినమాత్రమున కలుగుసంతోషము.

మోదము=తనకు లభించినపిమ్మట కలిగిన సంతోషము.

ప్రమోదము=అనుభవించినపిమ్మట కలిగినసంతోషము.

ఈకోశముఘటమువలెజడమయినదిగనుకయాత్మకాదు

☞ తాటినిచూచి పామనిభయమును బొందినవానికి విచారణచేత భయముదీరి సంశయమురహితమయినటుల శ్రవణమనననిదిధ్యాసలచేతను నిత్యానిత్యవస్తువివేకవిచారణచేతను పంచకోశములురహితమై సర్వసాక్షియగు ఆత్మహిరణ్మయకోశమందున్నట్లు తోఁచఁబడును. ఆహిరణ్మయకోశమునుదాఁటిఅమనస్కంబయినచో సాక్షిత్వముగూడబోయి పరబ్రహ్మమందైక్యమగును అప్పుడు నిర్గుణసాక్షాత్కార పరబ్రహ్మస్వరూపము దప్ప అన్య మేమియులేదు. చెప్పేవారును లేరు చూచునది చూడఁబడునదియును లేక సమస్తము పరబ్రహ్మస్వరూపమగును.

ఈకోశములు యొకటొకటిగా యంతరముగానుండును. అన్నమయకోశంబున కంతరముగా ప్రాణమయకోశంబును, ప్రాణమయకోశంబున కంతరముగా మనోమయకోశంబును, మనోమయకోశంబున కంతరముగా విజ్ఞానమయకోశంబును, విజ్ఞానమయకోశంబునకంతరముగా ఆనందమయకోశంబును ఆనందమయకోశంబునకంతరముగాహిరణ్మయకోశంబును గలవు. హిరణ్మయకోశముయొక్క నాశనమప్పుడురూపనామక్రియారహితమును ఆవరణరహితమును అగుఅచలపరిపూర్ణమే నిలచియుండును.

## ప్రణవవిషయము.

ఓం=అ+ఉ+మ్.

శ్లో॥ ప్రథమం తారకం చైవ ద్వితీయం దండముచ్యతే
తృతీయం కుండలాకారం చతుర్థం చార్ధచంద్రకమ్
పంచమం బిందుసంయుక్తం ఓమితి జ్యోతిరూపకమ్.

ప్రణవము అక్షరత్రయంబై మంత్రత్రయంబై నాదబిందుకళాత్మకంబై సృష్టిస్థితిలయకారణభూతంబై విరాట్సూత్రాత్మఅంతర్యామిభావంబై శక్తిత్రయంబై యుండు.

అకారము—పీతవర్ణము, రజోగుణము, స్థూలదేహము, ఋగ్వేదము, నాదము, బ్రహ్మ, జాగ్రదవస్థ.

ఉకారము—శుక్లవర్ణము, సత్వగుణము, సూక్ష్మదేహము, యజుర్వేదము, బిందువు, విష్ణు, స్వప్నావస్థ.

మకారము—కృష్ణవర్ణము, తమోగుణము, కారణదేహము, సామవేదము, కళ, మహేశ్వరుఁడు. సుషుప్త్యవస్థ. ఈస్థితియందు యోగి బ్రహ్మస్వరూపమును తనయందే కనుగొనును.

ఓంకారము—శుద్ధసాత్త్వికగుణము, మహాకారణదేహము, అథర్వణవేదము, సర్వసాక్షి. తుర్యావస్థ. దీనికే అర్ధమాత్రకయనియు చెప్పుదురు.

[ప్రణవము అవాఙ్మానసగోచరము, అవాచ్యము. తుర్యాతీతము. ఉచ్చారణ లేదు.]

శ్లో॥ అకారార్థో విష్ణు ర్జగదుదయరక్షాప్రలయకృత్।
మకారార్థో జీవ స్తదుపకరణం వైష్ణవమిదమ్।
ఉకారో నన్యార్హం నియమయతి సమ్బన్ధమనయోః।
త్రయీసార స్త్రాత్మా ప్రణవఇమ మర్థం సమదిశత్॥

ప్రణవమందలి మూఁడు అక్షరములే మూఁడు వేదములనియు మూఁడు సంధ్యలుఅనియు, మూఁడు గుణములనియు చెప్పుదురు.

## ఆశ్రమములు.

బ్రహ్మచర్యము గార్హస్థ్యము వానప్రస్థము సన్యాసముఅని ఆశ్రమములు నాలుగు విధములు.

1. బ్రహ్మచర్యము—బ్రాహ్మణుఁడు ఉపనయనము అయినతోడనే నిత్యమును ప్రాతఃకాలమున స్నానముచేసి గురువును ఆశ్రయించి వేదమును అభ్యసించుచు అగ్నియందు సమిధాధానముచేయుట, నేలనిద్రించుట, భిక్షమెత్తుట, గురుశుశ్రూషలుసేయుట మొదలుగాఁగల పనులుచేయుచు శిఖాయజ్ఞోపవీతంబును మౌంజీ కృష్ణాజిన దండ కమండల ధరుండై వేదాధ్యయనాది సత్కర్మ సహితుఁడై స్త్రీసంచారస్థలవర్జితుండై గురుగృహావాసుండై క్షౌరాదికర్మరహితుండై యుండవలయు. సర్వకాల సర్వావ

స్థలయందును బరబ్రహ్మచింతన కలిగి యుండవలయును. బ్రహ్మచర్యము=సతిని గూడకపోవుట అనియర్థము చెప్పెదరు. శిఖండికిభార్యలేదు, సతినిగూడుటలేదు. కావున దానిని బ్రహ్మచారియని చెప్పవలయును. అందువల్ల దానికిని ముక్తియుండవలయును. అట్లుముక్తిలేదు కాఁబట్టి బ్రహ్మచర్యమున కది యర్థముకాదు. బ్రహ్మచర్యమనఁగా బ్రహ్మపదార్థమందలిగమనముకలిగియుండుట. పరబ్రహ్మస్వరూపావలోకనమందు నడవడికగలవాఁడు బ్రహ్మచారి.

2. గృహస్థాశ్రమము—గృహము అనఁగాభార్య. అది గలిగివర్తించు వాఁడు గృహస్థుఁడు.

"స్నానంసంధ్యాజపోహోమస్స్వాధ్యాయోదేవపూజనమ్
ం వైశ్యదేవంచ సత్కర్మాణి దినేదినే"

స్నానము, సంధ్య, జపము, హోమము, స్వాధ్యాయము, దేవతపూజ, ఆతిధ్యము, వైశ్వదేవము, అనెడు సత్కర్మములను నిత్యము చేయవలయును.

గృహస్థాశ్రమమునందున్న వాఁడుఅతిధివాకిటవచ్చియుండఁగా యెంతప్రియమైన వస్తువునైనను అతనికిఁ బెట్టక భుజింపఁగూడదు. అతిథిపూజలను జేయవలయును.

"అతిధి ద్వారతిష్ఠంతి అపోగృహ్ణంతి యేనరాః
ఆపోశనంసురాపానంఅన్నంగోమాంససన్నిభమ్"

అతిధి=ప్రతిదినమురాక ఒకకాలమందుమాత్రమువచ్చువాఁడు. బ్రతికియుండినకాలమందే దానధర్మములుచేయ

వలయును. చచ్చినవెనుక ధనము తమతోటిరానేరదు. అట్టి దానియందు ఆశపడి మోసపోయినవారై తాము కడుపారదినక చేతులారనొకరికిఁబెట్టక గణించెదరు. తుదకు దొంగలుపాలుకాని రాజులపాలుగాని యగును.

"అనిత్యానిశరీరాణి విభవోనైవశాశ్వతః
నిత్యంసన్నిహితోమృత్యుఃకర్తవ్యంధర్మసంగ్రహః"

శరీరము లనిత్యములనియు ఐశ్వర్యముశాశ్వతముకాదనియు మృత్యువ వెంటనున్నదనియు తెలిసికొని దానధర్మములు చేయుచుండవలయును.

"నాన్నోదకసమందానం ద్వాదశ్యాఃనపరంవ్రతం
నగాయత్ర్యాఃపరంమంత్రం నమాతుర్దైవతంపరం"

ఆఁకలి గొనినవారికి అన్నము బెట్టి తృప్తిపరచవలయును దిక్కులేక చచ్చినవారికి అగ్నిసంస్కారాదికర్మలు నడుపుచు అభ్యాగతులైనయతులకు భిక్షచేసి యర్చించుటచేతను దరిద్రులకు గావలసిన ద్రవ్యము మొదలగునవి శక్తికొలదియిచ్చి యాదరించుటచేతను వారలకుతృప్తినికలుగఁజేయుచు ఆతురులై వచ్చినసన్యాసులకు అన్నమును ఉండుటకుఁ దగినతావును యిచ్చి వారలకు తృప్తినిఁ గలుగఁజేయు చుండవలయును. అగ్నిష్టోమాదులైన యజ్ఞకర్మలచేత దేవతలను శ్రాద్ధములచేత పితృదేవతలను మృష్టాన్నభోజనాదులచేత అతిథులను ఆప్తులను తృప్తి నొందించవలయును.

జన్మమెత్తినందుకు పరోపకారమే ముఖ్యము.

'పరోపకారాయఫలంతివృక్షాః పరోపకారాయవహంతినద్యః
పరోపకారాయచరంతిగావఃపరోపకారార్థమిదంశరీరమ్"

అష్టభోగములు:—

దాసో భృత్య స్సుతో బంధు ర్వస్త్ర వాహన మేవచ।
ధన ధాన్య సమృద్ధిశ్చ హ్యష్టభోగాః ప్రకీర్తితాః॥

☞ అగ్ని హోత్ర వైశ్వదేవాదులచేత దేవతలఋణమును, వేదాంతార్థములను దెలిసికొనుటచేత ఋషిఋణమును,పుత్రోత్పత్తిచేతఁ బితృఋణమును దీరును.

3. వానప్రస్థము:—తానుముసలివాఁడై తనకుమారునికిఁ బుత్రోత్పత్తి కలిగినపిమ్మట భార్యనుపుత్రునియొద్ద నుంచియైనను లేక ఆమెకు తనవెంటరానిష్టమైనయడల భార్యతో నైనను వనమునకుఁబోయి నివసించి పర్ణశాలయైనను పర్వతి గుహయైనను ఆశ్రయించి మంచు గాలి వర్షము ఎండ అగ్నివలనిబాధలను సహించుచు జరారోగంబులచేతఁ జిక్కి సమర్థుండుగాని సమయంబున నిరశనవ్రతుండై పంచాగ్నుల నాత్మారోపణంబుఁ జేయుచు జితేంద్రియుఁడై యుండవలయును. ఈఆశ్రిమమందు 12 సంవత్సరములుండవలెను. అట్లుకానియెడల యెనిమిదైనానాలుగైనా రెండైనా ఒకసంవత్సరమైనా యుండవలయును. పిమ్మట సన్యాసాశ్రిమమును స్వీకరించవచ్చును.

4. సన్యాసము—భార్యను వదిలినటువంటివాఁడై ఏకాకియైతలవెండ్రుకలు గోరు మీసము పీనినిక్షౌరముచేసికొనిత్రిదండము కమండలముసారకాయబుర్రపీనినిధరించిజితేంద్రియుఁడై యొక్కచోటనుండక స్థిరబుద్ధి గలవాఁడుగాను బ్రహ్మచింతఁగలవాఁడుగాను దేశసంచారముచేయుచుసర్వసంగములనువిడిచి భుజించినచోట శయనింపక శయనించిన

చోటభుజింపక విచ్చలవిడిగా జరించుచు దేహావసానము నకెదురుచూచుచుండవలయును. ప్రాణమును కాపాడు కొనుటకుమాత్రము మితాహారమును భుజించవలెను. నిత్యము 12000 ప్రణవము జపముచేయవలయును.

☞ త్రిదండములు--ఎవఁడయితే మనోవాక్కాయముల పాపకృత్యములు చేయక మనస్సును స్వాధీనముచేసికొనునో ఆతండేమూఁడు దండములు ధరించినసన్యాసి. బాహ్యమునకు త్రిదండములు ధరించుటకాదు.

*There should be perfect control over one's own mind.*

"మహాపాతకినశ్చైవ శేషాశ్చాకార్యకారిణః
తపసైవసుతప్తేన ముచ్యతే కిల్బిషాత్తతః॥

పంచమహాపాతకములైనను తపస్సుచేత నివర్తియగుచున్నవి.

పంచమహాపాతకములు——బ్రహ్మహత్య, కల్లుద్రాగుట, బంగారముదొంగిలించుట, గురుభార్యనుపొందుట, ఈనలుగురిలో నెవరితోనైనఁగూడియుండుట.

తే॥ కల్లుద్రావుట గురుపత్నిఁ గవయుటయును
విప్రుఁజంపుట బ్రహ్మస్వవిషయమయిన
ముచ్చిమియు నివిగలిగిన క్రూరజనులఁ
బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు.

భారతము.

☞ అజ్ఞానముచేత చేయబడిన మహాపాతకములే తపస్సుచేత నివర్తియగునుగాని సంకల్పముచేత తెలిసిచేయఁబడిన పాపములు నివర్తికానేరవు. విజ్ఞానమువలన మహాపాపములయినను నశించును.

గాని తెలిసిచేసిన పాపములకు నివర్తి లేదు. తెలియక చేసిన బ్రహ్మహత్య, గోహత్య, స్త్రీహత్య, శిశుహత్య మొదలగుమహాపాపములు కూడనశించును. ఈసంగతిని మూఢు లెఱుంగక భంగపడి అంగలార్చుచున్నారు.

విశ్వామిత్రుఁడు వినయముచేత బ్రాహ్మణత్వమును బొందెను. తలఁ బోడిచేయించుకున్నంతమాత్రముననే సన్యాసమని చెప్పేయెడల భర్త చనిపోయిన విధవలకందరికిని ముక్తియని చెప్పవలయును. అట్లు చెప్పుటకు వీలులేదు. సంకల్పరాహిత్యముగాని సన్యాసి నీటియందు నేతిబొట్టువలెనే విషయములలో మునిగిపోవును. రాగలఫలమునుకోరక యే కర్మనుచేయుట సన్యాసము. సంకల్పరాహిత్యమే అసంగము.

"జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునఃపునః
సంసార సాగరందుఃఖం తస్మాజ్జాగ్రిత జాగ్రతః"

పుట్టుకయును ముదిమియును భార్యయును దుఃఖములకు కారణములని గుర్తెఱిగి నిత్యానిత్యవస్తువివేకముగలిగి సంసారసాగరమును దాటుటకు మార్గమును పెద్దలవలనఁదెలిసికొనజాలక కపటసన్యాసులు తనభార్యలనువదలి పరదారలను పరధనమును గ్రహింపఁగోరి తమలోని కపటమును దెలియనీయక తిరుగుచుండఁగ వారినిజూచి నిరాశకులుగ దాయని పూజించుదురు. గురుగింజదాని ముక్కునందు నలుపుగలిగి యుండురీతిని కపట సన్యాసులు వెలుపలికి యోగ్యులవలెనే కనుబడుదురు. సహజామనస్క రాజయోగులును బ్రిహ్మనిష్ఠాగరిష్ఠులును అగుపెద్దలు దొరకుట దుర్లభము అట్టి పెద్దలు లభించినను శిష్యునియొక్క అనేక జన్మములయందు చేసినపాపమువలన కపటసన్యాసులుగానే కనుబడుదురు. అనేకజన్మార్జితపుణ్యమువలననే నిజమైనపెద్దలని తెలియగలదు కోతికి కొబ్బెరకాయదొరికిననుమధురమును గ్రహించలేదు,షండుఁడురంభ

పరసనున్నను రతిక్రీడలసుఖమును దెలిసికొనజాలఁడు. అవ్రుచంటికిపిఱుదు లుకప్పియుండి రక్తమును పీల్చునేగాని క్షీరమునుత్రాగి మధురమును గ్రహించలేవు. అట్లే పెద్దల సాన్నిధ్యమందున్నశిష్యుఁడు పాపకూపారమునఁ బడియుండుటవలన వ్యక్తి కలుగదు.

సన్యాసము మూఁడు విధములు-

1. మందము.—సంసారమందలి యుపద్రవములకు నోర్వ లేకుండుటచేత సన్యసించును.

2. తీవ్రము—కర్మయబద్ధముని విడిచినవాఁడు.

(1) కుటీచకము—భూసంచారము చేయుటకు శక్తిలేక గ్రామమందునగాని నదీతీరమందుగాని పల్లెయందుగాని పట్టణమందుగాని మఠము గట్టుకొని ఉదరపోషణముగా భోజనము చేయుచు కాషాయవస్త్రముదండకమండలముధరించియుండువాఁడుకుటీచకసన్యాసి. కర్మలనువిడిచి పుత్రునియొద్దనేభిక్షనుతీసుకొనుచుయింటివద్దనే యుండుట. ఇందుభుక్తిసుఖమేగాని ముక్తిలేదు.

(2) బహూదకము—గంగగోదావరికృష్ణకావేరి మొదలగుపుణ్యతీర్థములయందుస్నానము చేసికొనుచుఅయోధ్య మధురకాశి కంచి అవంతికపూరి ద్వారక మొదలగు పుణ్యస్థలములదర్శించుచు సంచారమునకు శక్తి కలిగియుండువాఁడు. తీర్థయాత్రల ఫలమేగాని ముక్తి లేదు.

3. తీవ్రతరము—

(1) హంస—అర్చిరాదిమార్గములచేత సూర్య లోకమునుపొంది తద్వారా బ్రహ్మలోక ముఁ జేరియచ్చటబ్రహ్మవిచారణచేసి పర బ్రహ్మమందైక్యమగును.

(2) పరమహంస— జ్ఞానభూమిక లేడింటిలో మొదటిమూఁడు భూములలోనేయుండి మృతినొందినస్వర్గలోకములయందు దేవ తలచేతపూజింపఁబడి "క్షీణేపుణ్యేమర్త్య లోకేవిశన్తి" యనున్యాయము చొప్పున భూలోకమునకు వచ్చి స్వప్రయత్నము వలన పైభూమికలనెక్కి ముక్తుఁడగును. అందిచ్ఛ గలవాఁడు ఆజన్మమందుఁగాని మఱియొక జన్మమందుఁగాని పై భూమి కలకుఁ బోగలఁడు. అట్లుగాక పరిపూర్ణుఁ డు ఈజన్మయందే విదేహ ముక్తుఁడగును ఆతండే పరమహంస. అట్టివానినే బ్రహ్మ వేత్త యని చెప్పుదురు.

మనోలయము స్వరూపలయమని అరూపలయమని రెండువిధములు. స్వరూపలయమును పొందినవారు జీవన్ముక్తులు. వీరు దగ్ధపటలవతుగా నుందువారు. అరూపలయమును పొందినవారు విదేహముక్తులు. అట్టి వారు దగ్ధపటలము గూడను లేకుండునట్లు శరీరరహితమును ఆగామి సంచిత ప్రారబ్ధనాశనమును గలవారని చెప్పఁబడుదురు.

# ఆగామి సంచితప్రారబ్ధములు

సంచితము—అనేకజన్మములనుండి చేసినపుణ్యపాపకర్మలయొక్క రాసులు. ఇదియే బీజవతుగా జన్మకు కారణము.

ఆగామి—ఈజన్మయందు బుద్ధి తెలిసిన పిమ్మట చేసినపుణ్యపాపకర్మ. ఇదియె ముందుజన్మకు కారణమును ప్రారబ్ధమును అగును.

ప్రారబ్ధము—ఈజన్మయందుఅనుభవించుట కేర్పడినకర్మఫలము.ఏవారికిని ప్రారబ్ధమనుభవించక తీరదనియెడు లోకోక్తిని చెవులార వినుచున్నాము. ప్రారబ్ధము స్వేచ్ఛాప్రారబ్ధమని పరేచ్ఛాప్రారబ్ధమని అనిచ్ఛాప్రారబ్ధమని మూఁడువిధములు.

"ప్రారబ్ధం భోగతో నశ్యేత్ తత్వజ్ఞానేన సంచితం
ఆగామి ద్వివిధంకర్మతద్వేషీ ప్రియవాదినోః"

"హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి
లలాట లిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే"

చేసికొనినవారికి చేసికొనినంత యనుభవించకతీరదు.

'ధర ఖర్వాటుఁడొకండు సూర్యకరసంతప్తప్రధానాంగుఁడై
త్వరతోఁడన్ బఱువెత్తిచేరి నిలిచెన్ దాళద్రుమచ్ఛాయద
చ్ఛిరముల్ తత్ఫలపాతవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగా
బోరిదై ప్రాపహతుండుపోవుకడకుంబోవుంగదా యాపదల్."

బట్టతలవాఁడొకడు ఎండదెబ్బవలన పరుగెత్తిపోయి యొకతాటిచెట్టుక్రింద నిలువ నాతాటిపండొకటి తటాలున తలపైనపడి తల బ్రద్దలయ్యెను. కనుక విధినిదాఁట నెవరితరము. ప్రారబ్ధ మనుభవింపక తీరదు.

# మహావాక్యములు.

---

1. ప్రజ్ఞానంబ్రహ్మ —

"ఏనేక్షతే శృణోతీదం జిఘ్రతీవా కరోతిచ
స్వాద్వస్వాదు విజానాతి తత్ప్రజ్ఞాన మితీర్యతే."

స్వాధిష్ఠాన చిదాభాసుఁడైన జీవుఁడు కన్నులనుండి వెడలినఅంతఃకరణవృత్తితోఁగూడుకొన్న ఏజ్ఞానముచేత నేత్రమునకు విషయములగు తెలుపు, నలుపు, పసుపు, ఆకుపచ్చ, ఎఱుపు, మిశ్రము, లావు, సన్నము, పొట్టి, పొడుగు అనెడి దశవిధరూపంబులను జూచుచున్నాఁడో; శ్రోత్రమునుండి వెడలిన ఏజ్ఞానముచేత శ్రోత్రమునకు విషయములగు అకారాది షోడశస్వరూపశబ్దంబులను వినుచున్నాఁడో; నాసికాద్వారములనుండి వెడలిన ఏజ్ఞానముచేత నాసికకువిషయములగుసుగంధదుర్గంధములను గ్రహించునో; జిహ్వనుండి వెడలిన ఏజ్ఞానముచేత నాలుకకు విషయములగు వగరు తీపు ఉప్పు కారము చేదు పులుసు అనెడిషడ్రసములను గ్రహించునో; త్వగింద్రియమునుండి వెడలిన ఏజ్ఞానముచేత త్వగింద్రియమునకు విషయములగు శీత ఉష్ణ మృదు కఠిన స్పర్శంబులను గ్రహించునో; వాక్కుగుండా బయలువెడలిన అంతఃకరణవృత్తితోఁ గూడుకొన్న ఏజ్ఞానముచేత మాట్లాడుచున్నాఁడో; ఏజ్ఞానముచేత చేతులతో యిచ్చుట పుచ్చుకొనుటలు గ్రహించునో; ఏజ్ఞానముచేత కాళ్లతో నడు

నడమును గ్రహించునో; ఏజ్ఞానముచేత పాయురింద్రియముద్వారా మలవిసర్జనను తెలిసికొనునో; ఏజ్ఞానముచేతఉపస్థేంద్రియమందలి విషయానందమును గ్రహించునో అదియ ప్రజ్ఞానము. అనఁగా సమస్తభూతముల యందు అంతరాత్మగానుండు తెలివియే ప్రజ్ఞానము. బ్రహ్మయనఁగా సమస్తభూతములయందును మనుష్యుల యందును ఖండఖండములుగాప్రకాశించెడుఆత్మస్వరూపమే బ్రహ్మస్వరూపము. చైతన్యమనినను ప్రజ్ఞానమనినను బ్రహ్మమనినను పరబ్రహ్మమనినను ఆత్మస్వరూపమనినను పేళ్లుమాత్రమే వేరు కాని వస్తువ యొకటియే యని తెలియునది.ఆప్రజ్ఞానముబ్రహ్మస్వరూపమే గానిపరబ్రహ్మమునకు అన్యముగాదు అని యీవాక్యమువల్ల తెలియఁగలదు. ఇది ఋగ్వేదవాక్యము; జాగ్రదవస్థ; స్థూలశరీరము; అన్నమయకోశము.

2. అహంబ్రహ్మాస్మి—అహం=నేను; బ్రహ్మ=పరబ్రహ్మము; అస్మి=అయితిని. అనఁగా నేను అనియెడు అహంభావముపోయి పరబ్రహ్మమంద్వైక్యమగుచున్నాను. ఇచట జీవుఁడే అహం శబ్దముచేత చెప్పబడుచున్నాఁడు. ఇది యజుర్వేదవాక్యము;స్వప్నావస్థ; సూక్ష్మశరీరము; ప్రాణమయమనోమయకోశములు.

పరిపూర్ణపరాత్మేస్మిఁ దేహేవిద్యాధికారిణీ
బుద్ధిస్సాక్షీ తయాస్థిత్వా స్ఫురన్నహ మితీర్యతే॥

3. తత్వమసి--తత్ = ఆపరబ్రహ్మస్వరూపము; త్వం= నీవు-- అనఁగా దేహేంద్రియాదులకు అతీతమై సాక్షిభూతమైనచైతన్యమగునీవు; అసి=అయితివి.

"ఏకమేవాద్వితీయ్యంస్యా న్నామరూపవివర్జితమ్
సృష్టేఃపురాతునాప్యన్య తాదృక్తతదితీర్యతే"

సృష్టికి పూర్వమందు నామరూపరహిత మైచిదూపుఁడైన యేఆత్మ యుండెనో ఆయాత్మ స్థితిసమయమందును యుప దేశకాలమందును తత్ అనెడిపదము చేత చెప్పఁబడును.

"శ్రోత్రదేహేంద్రియాతీతా చిత్త్వత్త్వంపదేరితాః
ఏకతాగ్రాహ్యా తేసీతి తద్రైక్యమను భూయతాః"

వినునటువంటి శిష్యునియొక్క దేహేం ద్రియాదులకు అతీతమైసాక్షిభూతమైన చైతన్యముత్వంపదము చేత చెప్పఁబడును

వాచ్యార్థము. లక్ష్యార్థము.

తత్...ఈశ్వరస్వరూపము...పరమాత్మ స్వరూపము.

త్వం...జీవస్వరూపము...ప్రత్యగాత్మ స్వరూపము.

అసి...జీవేశ్వరైక్యము...ప్రత్యగాత్మ పరమాత్మైక్యము.

ఇదిసామవేదవాక్యము; సుషుప్త్యవస్థ; కారణశరీరము; విజ్ఞానమయకోశము.

4. అయమాత్మాబ్రహ్మ—

అయం=స్వప్రకాశమై నిత్యమై అపరోక్షమై యుండుయీ

ఆత్మా=ఆత్మస్వరూపమే

బ్రహ్మ=పరబ్రహ్మము.

ఇది అధర్వాణవేదవాక్యము; తుర్యావస్థ; మహాకారణశరీరము; ఆనందమయకోశము,

స్వప్రకాశపరోక్షత్వా దయమిత్యుక్తితోమతః
అహంకారాదిదేహాంతా త్ప్రత్యగాత్మేతిగీయతే॥
దృశ్యమానస్యసర్వస్య జగత స్తత్వమీర్యతే
బ్రహ్మశబ్దేనతద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకమ్॥

సర్వంఖల్విదంబ్రహ్మ—సమస్తము బ్రహ్మస్వరూపము. తుర్యాతీతము; శరీరరహితము; పంచకోశరహితము.

## ముక్తివిషయము.

ముక్తియనఁగా విడుపు అని యర్థము. బంధములనుండి విడుపునకే ముక్తియని చెప్పుదురు.

ముక్తి రెండు విధములు:—

1. జీవన్ముక్తి—స్వరూప లయము.
2. విదేహముక్తి—అరూప లయము.

అందు జీవన్ముక్తుఁ డెట్టివాఁ డనఁగా—

సుఖమునకు సంతోషించఁడు. దుఃఖమునకు వ్యసనపడఁడు. మంచిసువాసనలను గ్రహించలేడు. మఱియు రాగద్వేషములు లేనివాఁడును, అహంకారము లేనివాఁడును, ప్రత్యుపకారమును గోరకయే పరులకుపకారము చేయువాఁడును, తనకార్యముల హానివృద్ధులకు భయపడనివాఁడును, పరమోపశాంతిఁ గలిగియుండువాఁడును తనవలన లోకులకు భయమును కలుగజేయనివాఁడును పరులఁజూచి భయపడనివాఁడును, జ్ఞానేంద్రియములచేత దెలిసికొనియు సుఖదుఃఖములను జెందనివాఁడును,ఏకాగ్రచిత్తము గలవాఁడును, సర్వభూతదయాళుత్వముగలవాఁడును, నిత్యతృప్తి గలవాఁడును,యదృచ్ఛాలాభసం

తుష్టియు మృదు మధుర సంభాషణయు గలవాఁడును, మనోసంకల్పము లేనివాఁడును, అన్యస్త్రీలయందు కోరిక లేనివాఁడును, ప్రియ అప్రియములు లేక నిద్రబోవువాని వలెసంచరించువాఁడును, సుషుప్తదశయందువలె జాగ్రతదశయందును సంకల్పము లేనివాఁడై ఏకోరికయును లేక ఆశయును లేక సహజనిర్వికల్పసమాధియందుండువాఁడును, శత్రువు మిత్రువు సమానముగాఁ గలవాఁడును, నడచునపుడుగాని కూర్చుండునపుడుగాని జాగ్రతయందుగాని సుషుప్తియందుగాని స్వప్నమందుగాని పరుండునపుడుగాని నిద్రించునపుడుగానియెవనిచిత్తంబు విచారపరంబుగాకుండునట్టివాఁడును, జీవన్ముక్తుఁడని యెన్నఁబడును.

విదేహముక్తుఁ డెట్టివాఁడనగా—

జననమరణంబులు శరీరధర్మంబులు గనుక వాటినిపొందనివాఁడును,ఆదిమధ్యాంతరహితంబై మనస్సును దేహమును లేనివాఁడును, స్థూలసూక్ష్మకారణ మహాకారణ శరీరంబులు లేనివాఁడును. అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశంబులు లేనివాఁడును, పృథివ్యాపస్తేజో వాయురాకాశంబు లనెడు పంచభూతంబులు లేనివాఁడును, అచలపరిపూర్ణుఁడును, సమస్తమందు అంతరబాహ్యములయందు నిండి నిబిడీకృతమై యుండువాఁడును, నిర్గుణసాక్షాత్కారపరబ్రహ్మస్వరూపమే స్వరూపముగాఁగలవాఁడును,విదేహముక్తుఁడని చెప్పఁబడును.

పురుషప్రయత్నముచేతమున్ముందుగాధనమునార్జించి ఆధనమువలన సద్గుణసంపన్నులగుసాధువుల నాదరించెనేని “సాధునాం దర్శనం పు

ణ్యామ్” అనున్యాయము వలన సజ్జనసాంగత్యమును విషయరహితమును గలుగును. విషయసుఖములయం దిచ్ఛలేమి వలన విచారణ కలుగును. విచారణవలన చిత్తోపశమంబును, ఆత్మావలోకనంబును కలుగును. చీకటిలోనడచువాఁడు మోడుచెట్టునుజూచి దొంగయని భయపడినట్లు రూపనామంబులతోఁగూడిన ప్రపంచమును సత్యమని నమ్మి

“మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధు సహోదరాః
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మా జ్జాగ్రతజాగ్రతః”

తల్లియు దండ్రియు చుట్టములు అన్నదమ్ములు ధనము యిల్లు నశించునవి యనియు ఆకారణమునవలన జాగ్రతతోనుండవలెనసియు దెలియక

“అన్యాయార్జితం విత్తం సహమూలం వినశ్యతి”

యనుప్రమాణముచొప్పున అన్యాయముగా ధనమును సంపాదించి ఆ ధనము ముందుండిన మూలధనముతోఁటి నశించును అని తెలియకనే సంతోషించుచుండెదరు. ముముక్షువు అట్లుకోరక నేనుబ్రాహ్మణుఁడను, అగ్రకులమందుఁ బుట్టినవాఁడను, గృహస్థుఁడను, విద్యాధిక్యతఁగలవాఁడను, సదాచారసంపన్నుఁడను, సోమయాజిని, యజ్ఞంబులన్నియు జేసినవాఁడను, వైశ్వదేవాదికర్మలు చేసినవాఁడను, అనెడివిశేషంబు లన్నిటి న్విడిచి భయరహితుండై పుత్రమిత్రగళత్రాది విషయంబగుకోరికనువిడిచి అహంకారరహితుండై సమస్తముఅసత్యమని నిశ్చయజ్ఞానమే సమాధి గాఁగలవాఁడై తనకిష్టములగువస్తువులను త్యజించి మనసునువిషయములకు బోనీక నిలుపవలెను. అగ్నికి ఉష్ణమువలెనే, మనస్సునకు సంకల్పము విషయము. చిత్తమృతియే మోక్షము. మనంబు దేని ననుసంధానంబు చేయు దానిని సర్వేంద్రియవృత్తులును రాజాజ్ఞను మంత్రులు శిరసావహించినట్లు క్షణమాత్రంబుననే పొందగలవు. కావున విషయములయందుభోగేచ్ఛ లేకమనంబునందలిమలంబును సమూలంబుగా బోఁగొట్టి

వలయును. నేను దుఃఖయుక్తుండనుగాను, నాకు దేహంబులేదు, పరిపూర్ణుఁడను, ద్వయదోషరహితుఁడను, నేను మాంసంబునుగాను, అస్థులునుగాను, శరీరత్రయవిలక్షణుఁడ, నని తెలిసి మహాకారణస్వరూపుఁడై సాక్షిగానుండవలయును. సమాధితరుణములయందు భార్యాబిడ్డలను దలపక ముక్తికాంతనే గురిగానుంచుకొని సమస్తదుఃఖములను విడనాడి "విగత తాపము" అనెడుఅరణ్యమందు నిలిచి, అదియే నిర్జనప్రదేశము గనుక అట్టి వృత్తిరహిత మగుప్రదేశమందు వర్తించుటవలన బుద్ధి విశ్రాంతిఁ బొందగలదు. మాంసమును తినవలెనని చేఁప గాలములో జిక్కుబడినట్లు విషయసుఖముల కాశించి నశింపకుఁడు.

పరబ్రహ్మజ్ఞానమును దెలిసికొనుట కాసక్తిఁగలవాఁ డేజాతియందున్నను బ్రహ్మవిద్యోపదేశంబున కర్హుఁడు. మూర్ఖునకు బోధించగిట్టదు. అట్లుబోధించిన సమస్తఆభరణములతో అలంకరింపఁబడిన తనపుత్రిని కలలోనఁజూచిన పురుషునకిచ్చి వివాహము చేసినట్లగును.

పుష్యరాగము మొదలగురాళ్లన్నియు రత్నముచేత కోయఁబడును. రత్నము రత్నముచేతనేకోయబడవలయునుగాని మరిదేనిచేతను కోయబడదు. అట్లే మనస్సుచేతనే మనస్సును భేదించవలయును.

సమాధిలక్షణమెట్లనఁగా—

"జీవాత్మ పరమాత్మై క్యావస్థా త్రిపుటిరహితా
పరమానందస్వరూపా శుద్ధచైతన్యాత్మికా సమాధిః"

జీవాత్మపరమాత్మల కైక్యమును జేయవలయును. నేను అనెడిదియే జీవాత్మ; తాను అనెడిదియే పరమాత్మ. ఈజీవాత్మ పరమాత్మల కైక్యమగుచో సాక్షిత్వముగూడనుపోయి పరబ్రహ్మమందైక్యమగును. వాచాజ్ఞానములేక అనుభవజ్ఞానము గలిగి యుండవలయును.

"మాతృవ త్పరదారాశ్చ పరద్రవ్యాణి లోష్టవత్
ఆత్మవ త్సర్వభూతాని యఃపశ్యతి సపశ్యతి."

పరస్త్రీలను తల్లివలెభావించవలయును. పరద్రవ్యముయందుఆశ కూడదు. జీవన్ముక్తులయొక్క తపోబలిమి తమకపకారముచేయునట్టిదుష్టు లెంతబలవంతులై యున్నను వారిని చెఱుచును. తమ మేలుకోరునట్టి వారెంత బలహీనులైనను వారికి బలమును కలుగఁజేసి మేలుచేయును. ఇట్లు తపస్సంపన్నుల కోరిక లేకయే జరుగును. కనుక పెద్దల చెంతఁజేరి వారికి తొందరను గలుగఁజేయఁగిట్టదు. మనస్సునందైనను వారి కపకారము చేయుతలంపు కూడదు.

జపము హోమము తపస్సులు మొదలగువానివలన ముక్తి కలుగదు. వాయుభక్షణ చేసినంతమాత్రముననే ముక్తికలిగేయెడల సర్పములకును ముక్తికలుగవలెను; నీరుత్రాగి జీవించుటవలన ముక్తికలిగేయెడల చేఁపలు మొదలుగాఁగలజంతువులకును ముక్తి యుండవలయును; ఆకులు తినుటవలననే ముక్తికలిగేయెడల మృగములకును ముక్తి కలుగవలెను; తలక్రిందుగా తపస్సువలననే ముక్తి యనేయెడల గబ్బిలములకును ముక్తియుండవలయును; ధ్యానము మౌనము కలిగినమాత్రముననే ముక్తికలిగేయెడల చేఁపలకొఱకు కదలక తదేకనిష్ఠగా ఏకాగ్రచిత్తముకలదై యుండుకొంగకునుముక్తియుండవలయును; శాస్త్రములు చదువుటవలననే ముక్తికలదన్న మనము చెప్పినట్లు చదివెడుచిలుకకును ముక్తికలుగవలయును—అట్లు కలుగకపోవుటనుంచి వాయుభక్షకులు, పర్ణభక్షకులు, జలాహారులు మొదలగువారికి ముక్తి లేదు.

"ఊర్ధ్వశూన్య మధశ్శూన్యం మధ్యశూన్యం యదాత్మకమ్
సర్వశూన్యం తదాత్మేతి సమాధి స్తస్యలక్షణమ్."
"ఊర్ధ్వపూర్ణ మధఃపూర్ణం మధ్యపూర్ణం యదాత్మకమ్
సర్వపూర్ణం తదాత్మేతి సమాధి స్తస్యలక్షణమ్."

ఉ తరగీత.

పైనను, క్రిందను, నలుప్రక్కలనుదృగ్గోచరమగుపదార్థమంతయు నశించునదియనియు, ఎచట నేవంక జూచిన ఆత్మస్వరూపము నిండి నిబిడీకృతమై యున్నదని భావించుటయే సమాధిలక్షణము. తనకంటె అన్యము లేదని భావించి సమస్తము తనస్వరూపమేయనితలంచగను సాక్షిత్వమును గూడబోయి పరబ్రహ్మముం దైక్యమగును. ఈమార్గమున దప్ప వేరు మార్గమున ముక్తి లేదు.

"జిహ్వోపస్థ పరిత్యాగే పృథివ్యాం కింప్రయోజనమ్."

ఉత్తరగీత.

కొందరజ్ఞులు యీవాక్యమునకర్థముదెలియక జిహ్వ ఉపస్థ యింద్రియములవిషయములను త్యజించినచో ప్రపంచమందు ప్రయోజనము లేదనియు ఆవిషయసుఖములనుభవించుటకే జన్మమెత్తితిమనియుతలంచి విషయలోలురై యుండి చచ్చుచు బుట్టుచుందురు. జ్ఞానులు అట్టితుచ్ఛసుఖములయం దాసయుంచక నిత్యసంతోషిగా నుండెదరు. ఎట్టివారికిని కోప ముండగిట్టదు.

"కోపమునను ఘనత కొంచమైపోవును
కోపమునను మిగుల గోడుజెందు
కోప మడచెనేని కోరికలీడేరు
విశ్వదాభిరామ వినుర వేమ."

కోపమువలన హాని గలుగునేగాని మేలుగలుగదు. సర్వకాలసర్వావస్థలయందును కోపము లేకుండవలయును. ఎట్టిప్రమాదసమయమందును కోపము నణచవలెను. మఱియు

నారీ స్తనభర నాభీదేశం దృష్ట్వా మాగా మోహావేశం
ఏతన్మాంసవసాదివికారం మనసివి చింతయ వారంవారం॥

స్త్రీలనుజూచి త్వక్చర్మమాంసరుధిర మేదోమజ్జాస్థియనెడుసప్తధాతువులతో గూడినదియనియు, మలమూత్రములకిరవగునది యనియు తలం

చక మన్మథగృహమున కాశించెదరు. అట్లుచేయక మాంసవికారములని సమస్తకాలములయందు తలంచవలెను.

"తయోరేషసగ్ స్తావోయ ఏషో స్తర్హృదయఆకాశః."
బృహదారణ్యకోపనిషత్—6 అ. 2 బ్రా. 3.

అ స్తర్హృదయమందలి చిదాకాశమే జీవేశ్వరులనెడు స్త్రీ పురుషులకు సంభోగస్థానము. అట్టిస్థానమందే రమించి సుఖము ననుభవించవలయునుగాని అన్య స్త్రీలమీద కోరిక విడువవలయును.

సచ్చిదానందం:—

సత్ = నశించక అన్నికాలములయం దుండునది,
చిత్ = స్వప్రకాశజ్ఞానస్వరూపమగునది,
ఆనంద= నిరంతర సుఖము నిచ్చునది,

అగు పరబ్రహ్మస్వరూపము.

అట్టి పరబ్రహ్మానుసంధానము చేయుటవలననే ఎడతెగనిసుఖము కలుగును. కట్టెయందు నిప్పువలెనే పుష్పములయందు వాసనవలెనే పాలయందు నేతివలెనే సమస్తభూతములయందు ఆత్మ స్వప్రకాశముగా నున్నది. అట్టి ఆత్మావలోకనలేకనే ముక్తికలుగదు.

ఈ కలియుగమందు పాపకూపారమునపడియుండుటవలన అనేకులు దుర్మార్గము చేయుదురు; దొంగిలింతురు; హింసచేయుదురు; శూద్రులకు సేవచేయుదురు; ధనాపేక్షచేత నీచులకు బోధచేయుదురు; సత్యమగుదాని నసత్యమనియు నసత్యమగుదానిని సత్యమనియు, వాదించెదరు; విద్యావిహీనులై యున్నను, సమస్తవిద్యలను దెలిసినట్లుగ నటించెదరు; శూద్రులువండిన అన్నమైనను తిందురు; ద్రవ్యముకొరకు కన్యకలను విక్రయించెదరు; బ్రాహ్మణశబ్దమున కర్థముదెలియక, జందియము వేసికొనుట మాత్రముననే బ్రాహ్మణులమని చెప్పుదురు; సన్మార్గులను

నిందింతురు; నీచజాతితో సంభోగమును కోరుదురు; రోగపీడితులై యుండెదరు; మదగర్వముచేతను, అమితకోపముచేతను, దుఃఖముచేతను నిండియుండెదరు; మోసముచేయుటయే ప్రజ్ఞావిశేషమని తలంచెదరు. ఏమి కాలమహిమ? పూర్వకాలమున దుర్మార్గములేకపోవుటవలన సద్గుణసంపత్తిగలవారై యనేకసంవత్సరములు జీవించెదరు.

ఇప్పుడట్లుగాక అల్పాయుష్యముగలవారై కొద్ది వయసులోనే అమితమగు పాపమును చేసినవారై చచ్చుచు బుట్టుచుండెదరు.

బుద్ధిమంతులు యీదుర్మార్గములు మొదలగు దుర్గుణముల కిరవివ్వక సద్గురువును వెదుకవలెను. గురువులేనివిద్య తలిదండ్రులులేని బిడ్డవలెను భర్తలేనిపడుచువలెను కళాహీనమైయుండును. నొసటిఁ వ్రాతఁ దుడిచి భస్మముతో రేఖలుగీచి హస్తమస్తక సంయోగము చేయఁగా తెలివి శిరస్సునందు నిలుచును. ఆతెలివియే నీవని గురువుచెప్పును. సూర్యుఁడు కిరణములతో నెట్లుఅస్తమించునో అట్లే మనస్సున్ను వృత్తులతో అణగి తనయందేనిలుచును. పక్షులు రాత్రులయందు చెట్లయందు నిద్రించురీతిని జీవుఁడు పరమాత్మయందు నిద్రించును. గోవులు వేర్వేరు—అనఁగా నల్లగోవు తెల్లగోవు యఱ్ఱగోవు—అయినను పాలుతెల్లగానుండి మధురముగలవియగును. అట్లే భూతములు వేర్వేరయినను పరమాత్మ యొక్కటియేయని తెలియునది.

కౌశికుఁడను బ్రాహ్మణుఁ డొకయెఱుకవానివద్ద సమస్తధర్మములను దెలిసికొనెనని వినలేదా; కనుక శూద్రులనిసందేహించక బుద్ధిమంతులవద్ద రహస్యములను దెలిసికొని అరుణిమొదలగువారివలెనే ఊర్ధ్వరేతస్కులై యుండునది.

శ్లో॥ మనఏవజగత్సర్వం మనఏవమహారిపుః
మనఏవహి సంసారో మనఏవజగత్త్రియమ్॥

ఋభుగీత—2అ. 34 శ్లో॥

మనంబె సర్వప్రపంచము, మహాశత్రువు. మహాసంసారము, లోకత్రయముఅగును. మనంబుచే సర్వము కల్పింపఁబడును. మనంబుచే సర్వము పరిపాలింపబడును. మనంబుచేసర్వము స్మరింపబడును, కనుక మనంబే సంసారకారణమైయున్నది. మనస్సువలననే దుఃఖమును, పాపములును, సంకల్పమును, జీవుఁడు, చిత్తము, అహంకారము, మహాబంధము, అంతఃకరణ, పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచవిషయములు, పంచకోశములు, అవస్థాత్రయములు కలిగెను. కావున ప్రపంచమంతయు మనోవికారమెగాని అన్యముకాదు.

"అన్నంబ్రహ్మేతివ్యజానాత్"
"ప్రాణోబ్రహ్మేతివ్యజానాత్"
"మనోబ్రహ్మేతివ్యజానాత్"
"విజ్ఞానంబ్రహ్మేతివ్యజానాత్"
"ఆనన్దోబ్రహ్మేతివ్యజానాత్"

తైత్తిరీయోపనిషత్.

అన్నము, ప్రాణము, మనస్సు,విజ్ఞానము,ఆనందము,బ్రహ్మస్వరూపమని తెలిసికొనెను. ఇట్లు తెలిసినవాఁడే ముక్తుఁడని తెలియునది.

"అశ్వక్రాన్తే రథక్రాన్తే విష్ణుక్రాన్తే వసుంధరా
శిరసా ధారితాదేవి రక్షస్వమాం పదేపదే
ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా."

తైత్తిరీయోపనిషత్.

గుఱ్ఱములయొక్క రథములయొక్క విష్ణువుయొక్క సంచారములను ఓర్పుచేత సహించునట్టి ఓభూమీ. నీవు వరహావతారమందవతరించిన భగవంతునిచేత పాతాళమునుంచి తేబడినదానవు. నీవుశిరస్సునందు ధరింపబడినదానవై నన్ను రక్షింపుము రక్షింపుము.

అను యీమంత్రము నుచ్చారణనుచేయుచు స్నానకాలమందు మృత్తికను శిరస్సునందు ధరించవలయునని చెప్పెదురు. అజ్ఞులవలె మృత్తికను శిరస్సునందు ధరించుటయందు లాభ మేమియులేదు. ఇట్లు మృత్తికను శిరస్సునందేధరించుటవలన ముక్తికలుగునెడ బాలురును ఉన్మత్తులును మన్ను నుతలమీఁద వేసుకొని వికారరూపముతో తిరిగెదరు. వారికందరికి ముక్తియెక్కుడిది. ఈపై వాక్యమునకు బాహ్యార్థమువదలి యంతరార్థము నాలోచించవలయును. పృధివివలెనే మనస్సుకఠినమై విషయములకు బోవుచు అధోముఖమైయుండును. అట్టిమనస్సును ఊర్ధ్వముఖవ్యాపనముచేసి శిరస్సునందే ధరించవలయుననియు అట్టిచో విషయములులేవనియు, పరబ్రహ్మప్రాప్తికి మార్గమునియు పెద్దలు చెప్పెదురు.

"అకార్యకార్యవకీర్ణీ స్తేనో భ్రూణహా గురుతల్పగః
వరుణోపామఘమర్షణ స్తస్మాత్పాపాత్ప్రముచ్యతే"
తైత్తిరీయోపనిషత్.

జలమునందు స్నానముచేసినచో కూడనిపనిచేసినవాఁడును, వ్రతభ్రష్టుఁడును, దొంగవాఁడును, గర్భములోని శిశువును జంపినవాఁడును, ఎట్టిమహాపాపములు చేసినవాఁడును,ఆయాపాపములనుండి విడువబడుచున్నాఁడు. అనఁగా ఎట్టిమహాపాపముచేసినవాఁడైనను గంగాదిమహాతీర్థములయందుస్నానముచేసినచో పాపరహితుఁడగును.

ఇట్లు బాహ్యార్థమునే గ్రహించెనేని సలువదిరూపాయిలు చేతఁదీసి కాశికిపోయి స్నానముచేసిన ముక్తికలుగవలయును. ఇట్లెంతమంది ప్రతిసంవత్సరము కాశికిఁబోవుచుండిరి. ఈవిధముగరూపాయిలకుముక్తికలదుగాని వాటిని చేతఁదీసికొని కాశికిబోవువారికి ముక్తి లేదు. సద్గురుప్రసాదతీర్థమనెడు బ్రహ్మానందసముద్రమునందు స్నానముచేసిన ముక్తికలుగునుగాని కాశీరామేశ్వరంబులు తిరిగినముక్తిలేదు. ఇందువలన కాశీరామేశ్వరంబులకు పోవలదని చెప్పుటకాదు. అందువలననుఫలము

కలదు. ఇతరదేశవిశేషంబులు తెలియగలవు. తీర్థస్నానమువలన పుణ్యముగలదు. ఆపుణ్యఫలమనుభవించవలయు అంతియకాని ముక్తి లేదు.

"నకర్మణా నప్రజయా ధనేనత్యాగే నైకే అమృతత్వమానశుః
పరేణనాకాంనిహితంగుహాయాంవిభ్రాజతేయద్యతయోవిశన్తి"

స్వర్గలోకమునకు మీఁదుగా పరమాకాశమందుండెడి మోక్షపదము కర్మచేతను సంతానముచేతను ధనము చేతను పొందఁదగినదికాదు. సన్న్యాసము చేతనే పొందఁదగినది. అదియే ముక్తి.

మఱియు సత్యవాక్పరిపాలనవలననే ముక్తియనికొందరును, తపస్సుచేతనే ముక్తియనికొందరును, అంతరింద్రియ నిగ్రహామువలననే ముక్తియనిమరికొందరును, దానకర్ణునివలె దానములుచేయుటవలన ముక్తియని మరికొందఱును, ధర్మమువలననే ముక్తియని కొందరును, బ్రహ్మచర్యనియమమే ముక్తి మార్గమనికొందరును, వైశ్యదేవము మొదలుగాఁగల కర్మలచేతనే ముక్తియనికొందరును, యజ్ఞములచేత ముక్తియనికొందరును, ఆధానములచేత ముక్తియని మరికొందరును, పలువిధములుగ చెప్పుదురు. దేనివలనను ముక్తికానము. పరబ్రహ్మమందులీనమైతేనేగాని ముక్తి లేదు.

అన్నమువలన ప్రాణులకు బలముకలుగును. బలముచేతతపస్సును, తపస్సువలన ఆస్తిక్యబుద్ధియును, అందువలన వేదాంతశ్రవణమును, తద్వారామననమును, పిమ్మటనిదిధ్యాసయును, నిదిధ్యాసవల్ల భగవంతునియందు జ్ఞప్తియును, అందువలన ఆత్మజ్ఞానమును కలుగుచున్నవి. పిమ్మటఅపరోక్షజ్ఞానమును ముక్తియునుకలుగును. మనోవాక్కాయములచేత త్రికరణశుద్ధిగా గురుసేవచేసి గురుపాదోదకమును త్రాగి, ఉచ్ఛిష్టమును భుజించనియెడల ముక్తి లేదు.

మహాకర్త—జననమరణంబులు వార్థిక్యములయందు సుఖదుఃఖము లఁజెందనివాఁడును జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు లేనివాఁడును, చూచువాఁడు చూపు చూడఁబడునది

యను వేరుభావము లేనివాఁడును, సత్యాసత్యము, ధర్మాధర్మము, ప్రియాప్రియములనెడిభేదములు లేనివాఁడును, అహంభావము లేనివాఁడును, పరోపకారబుద్ధిఁ గలవాఁడును, మాత్సర్యము లేనివాఁడును, తాను జేసినపని చెడిపోయినను వ్యసనపడనివాఁడును సమస్తమునకు సాక్షియగువాఁడును మహాకర్త యని చెప్పఁబడును.

మహాత్యాగి—ఏకోరికయును లేనివాఁడును, సంకల్పరహితుఁడును, మహాకర్తయగువాఁడును, మహాత్యాగియని చెప్పఁబడును.

క॥ జనియును, మృతియును, ధర్మం
బు నధర్మము సౌఖ్యదుఃఖములు లేవని నె
మ్మనమున దలంచు నెవ్వాం
డనఘమతీ యతఁడపో మహాత్యాగి ధరన్.

మహాభోక్త—కోరికలేక ప్రారబ్ధవశమున నేవేళ కేది లభించినను సమభావముతో నుండువాఁడును కలిమి లేములయందు సమభావము గలవాఁడును, ఉప్పు పులుసు వగరు కారము చేదు తీపు మొదలుగాఁగల రుచుల నన్నిటిని సమముగా జూచి బ్రహ్మానందముతో భుజియించువాఁడును, బూడిదెను చక్కెరను బంగారమును మన్నును సమముగా చూచువాఁడును, మహాకర్తయును, మహాత్యాగియును, మహాభోక్తయని చెప్పఁబడును.

క॥ సమభావన నెందు విరో
ధము వడయక కోర్కెలెల్లఁ దా వీట్కొని ప్రా
ప్తము ననుభవించు నెవ్వాఁ
డమలమతీ యతఁడపో మహాభోక్తధరన్॥

ఈమూఁడింటిచేతనే బుద్ధి విశ్రాంతిని పొందఁగలదు.

# బ్రహ్మవేత్తలు

బ్రహ్మవేత్తలు నాలుగువిధములు:—

1. బ్రహ్మవేత్త—కర్మఫలత్యాగియై నిత్యనైమిత్తిక కర్మలను విధిగ జరుపుచు యదృచ్ఛాలాభసంతుష్టియును నిరహంకారమును సర్వభూతదయాళుత్వమును గలిగి ఆత్మారాముండును, ఆత్మతృప్తుండునై కామక్రోధలోభమోహమదమాత్సర్యంబు లనెడుఅరిషడ్వర్గంబు లేక ప్రియాప్రియములునిందాస్తుతులు మానావమానంబులు శత్రుమిత్రులనెడు భేదములు లేక సంచరించువాఁడును,గుణాతీతుండును, దర్పణమును రూపమంటని రీతిని నాలుకకు నేతి జిడ్డంటనిరీతిని కుమ్మరపురుగువలె అంటి యంటక యుండువాఁడును బ్రహ్మవేత్త యని చెప్పఁబడును. అగ్నిచే గాలినపత్రము, పత్రమువలెనే గనుపడునట్లు అజ్ఞాన దృష్టిచేత శరీరసహితముగాఁగనుబడును. నిజముగాచూచినచో అశరీరుఁడనియే చెప్పవలయును. ఆతండే సుందర స్త్రీని సూకరముగ జూచును.

2. బ్రహ్మవిద్వరుఁడు—కర్మలను వదిలిసంప్రాప్తసుఖదుఃఖములనుభవించుచు సమాధినిష్ఠాగరిష్ఠుండై యుండువాఁడు.

3. బ్రహ్మవిద్వరీయుఁడు—సర్వకాలములయందు సహజామనస్క-రాజయోగ నిష్ఠాగరిష్ఠుండై బరులవలనమేలుకొలుపంబడి కించిదాహారంబు గొనుచు నిద్రబోవువానివలె విశ్వమునుమరిచియుండువాఁడు.

4. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు—బాహ్యాంతరములు మరచి నిరంతర నిర్వికల్ప సమాధి నిష్ఠుండై ప్రకాశించువాఁడు.

బ్రహ్మవేత్తనియమములు:—

"అన్నం ననిన్ద్యాత్"=అన్నమును నిందించగూడదు.

"అన్నం నపరిచక్షీత"=అన్నమును పరిహరించగూడదు.

"అన్నం బహుకుర్వీత"=అన్నమును మర్యాదచేయవలెను.

తైత్తిరీయోపనిషత్.

## పరబ్రహ్మము

సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమును పరిశుద్ధమును సుఖ స్వరూపమును నాశరహితమును పరిపూర్ణమును అగునట్టియు, సత్తు చిత్తు ఆనందము నిత్యము నిర్మలములనెడు పంచలక్షణములచేత వెలుగు నట్టియును అగు పరబ్రహ్మము అణువులకంటె అణువును మహత్తులలో మహత్తును నామరూపక్రియారహితమును జననమరణములు సుగుణ దుర్గుణములు లేనిదియును తెలుపు నలుపు యెరుపు మొదలుగాఁ గల వివిధరంగులు లేనిదియునై యున్నది.

సజాతీయభేదము--తనజాతివస్తువుకన్న తాను భేదముగనుండుట.

విజాతీయభేదము—ఇతరజాతి వస్తువుకన్న తాను భేదముగ నుండుట.

స్వగతభేదము—తనయందేయుండు అవయవములను ఇంద్రియములకుఁ గల పరస్పరభేదము.

జాగ్రతదశయందు ఎదుటకనుబడువస్తువులు కనుబడకుండునప్పుడు ఏరూపముండునో అదియ పరబ్రహ్మంబు. మనసునకు సంకల్పరాహిత్య మగునపుడు దానిరూపమే పరబ్రహ్మంబు.

పరబ్రహ్మంబు అవాఙ్మానసగోచరంబై అజంబై నిత్యంబై యపక్ష యరహితంబై వృద్ధిరహితంబై శరీరంబునశించునప్పుడు దానునశింపక సర్వకాలములయందును స్వయముగానే ప్రకాశించుచుండును.

"ఆకాశస్య గుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే" ఉత్తరగీత.

ఆకాశమందు శబ్దమున్నది. శబ్దరహితమే పరబ్రహ్మము.

పరబ్రహ్మముసత్యజ్ఞానానందస్వరూపము,నిర్వికారము,నిరవయవము నిత్యము, నిర్దోషము, పరిపూర్ణముగనున్నది. సగుణబ్రహ్మోపాసన చేయువారు అర్చిరాదిమార్గముగ బ్రహ్మలోకమును పొంది శ్రవణాదుల చేత యపరోక్షసాక్షాత్కారము గలిగి మోక్షమునుపొందుదురు కర్మ నిష్ఠులు ధూమాదిమార్గమునఁ బితృలోకమును పొంది పుణ్యసుఖము లనుభవించి తిరిగి పుట్టుచున్నారు. నిషిద్ధకర్మనాచరించువారు నరకము ను పొందుదురు.

అవిద్య—జడము, సవికారము,రూపము,ఆద్యంతములుగలది. అజ్ఞానరూపము సత్వరజస్తమోగుణాత్మకము.

బ్రహ్మము అవిద్యవలన సగుణబ్రహ్మంబై అయిదుభేదములుగఁ జెప్పఁబడును.

1. శుద్ధచైతన్యము—సాక్షిస్వరూపము, పరమాత్మ, అంతరాంతర ఎఱుక.
2. మాయావచ్ఛిన్నచైతన్యము—ఈశ్వరుడు, సృష్టికర్త, సర్వాంతర్యామి, సగుణబ్రహ్మము, దీనికే శబళబ్రహ్మ మని చెప్పుదురు.
3. అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము—జీవుఁడు అంతఃకరణయందు ప్రతిఫలించిన ప్రతిబింబము. బింబప్రతిబింబములకు భేదము లేనట్లు జీవునికిని అంతఃకరణావచ్ఛిన్నచైతన్యమునకు నుభేదము లేదు.
4. వృత్త్యవచ్ఛిన్నచైతన్యము—అంతఃకరణవృత్తులయందు ప్రతిఫలించు చైతన్యము. ఇదియె జ్ఞానము. ఇదియ మహదహంకారము.
5. విషయావచ్ఛిన్నచైతన్యము—ఘటము పటము మొదలుగాఁ గలవి. జ్ఞానశూన్యమై వికారాస్పదమై యుండును

☞ ఆత్మప్రతిబింబమువలన శబ్దస్పర్శరూపరసగంధంబు లనియెడు

పంచతన్మాత్రలు కలిగెను. తద్వారా అపంచీకృతపంచమహాభూతము లేరుపడి పంచీకరణం బాయెను.

☞ మాయోపాధికబ్రహ్మంబు సగుణబ్రహ్మంబనియు, కేవలమై మాయరహితమగు బ్రహ్మంబు నిర్గుణమనియు, సగుణనిర్గుణవిలక్షణంబగు బ్రహ్మంబు నిష్ప్రతియోగిక మనియుఁ బెద్దలు చెప్పుదురు.

## అమనస్కము.

అమనస్క మనఁగా మనసు లేకుండుట. సర్వకాలసర్వావస్థలయందు మనసు పరబ్రహ్మం బైక్యమగుచో యమనస్కంబని చెప్పుదురు. అట్లు మనసునకు వృత్తిరహితముకావలయును గాని పశువులవలె కందమూలాదులు భక్షించినను, సర్పములవలె వాయువును భక్షించినను, గానుగెను చుట్టివచ్చు యెద్దులవలెనిత్యమును దేవాలయములయందు ప్రదక్షిణము చేసినను, తాబేలువలె విషయములలోఁబడనివ్వక యింద్రియంబులనిలిపినను, గబ్బిలములవలె తలక్రిందుగా తపస్సు చేసినను, పందికొక్కులవలె గుహాలలో యుండినను, మఱ్ఱియూడలవలె జడలు దాల్చినను ముక్తి లేదు. అమనస్కంబుగాదు. అమనస్కంబుగానిది పరబ్రహ్మం బైక్యము కానేరదు.

☞ ఇందులో దేవాలయములయందు ప్రదక్షిణము చేయఁగూడదని చెప్పుటకాదు. అట్లు ప్రదక్షిణము చేయుటవలన అమనస్కముగాదనియు ముక్తి లేదనియు తెలియునది. సగుణోపాసకులు ప్రదక్షిణములు చేయుచుండఁగా వారికోరికలు నెరవేరును

బ్రహ్మవేత్త నిర్వికల్ప నిష్కళంక నిష్ప్రపంచంబైన తుర్యంబున యెరుకమాత్రావశిష్టుండై యుండు. ఇట్టి మహాత్ముండు ధూమరహితంబైన వహ్నిచందంబున, అనఁగా పొగలేని నిప్పువలెనే ప్రకాశించుచుండును. జరామరణంబులు, లాభాలాభములు, మానావమానములు, ప్రతిష్ఠాప్రతిష్ఠలు, అహంకార మమకారంబులు, జయాపజయంబులు, రాగద్వేషములు, శోకమోహములు, వృద్ధిక్షయములు, క్షుత్పిపాసలు,

అనుద్వంద్వంబులను జయించినవాఁడై యుండును.

మఱియు వాసనాత్రయంబు లేకుండవలయును

1. శాస్త్రవాసన—సమస్త శాస్త్రపురాణములు చదివిచదివిఅర్థ మెల్లను వెదకియు వాటిఫలమును బొందంగవల యు ననెడిపట్టుదలయే శాస్త్రవాసన.

2. లోకవాసన—అందరునడుచుదోవను నడువవలెననెడితలంపు

3. దేహవాసన—శరీరపోషణ, యాత్ర,తీర్థస్నానములు, మొద లగువానియందు కోరిక.

ఇట్లు వాసనాత్రయంబు లేనివాఁడై గుణత్రయంబు లేనివాఁడై యుండ వలయునుగాని అభ్యాసకులవలె భ్రూమధ్యమందుదృష్టినిలుపంగదగదు.

గీ॥ ద్రష్ట దర్శన దృశ్య విరామ మెచట
నగునచట దృష్టి నిలుపంగ నగునుగాని
చెదరి నాసాగ్రమునఁ జూపుఁ జేర్పఁదగదు
కోరి యమనస్క రాజయోగులకువత్స॥

శ్లో॥ ద్రష్ట దర్శన దృశ్యానాం విరామోయత్రవాభవేత్
దృష్టి స్తత్రైవకర్తవ్యం ననాసాగ్రవలోకనం॥

ఇట్లు చూచువాఁడు చూపు చూడఁబడునది యనుమూఁడును విశ్రాం తిని బొందుస్థలము, అనఁగా రహితమగుతావుననే మనసు నిల్పవలెను గాని భ్రూమధ్యమందు నిలుపగూడదు. అభ్యాసకులు భ్రూమధ్యమందే నిలుపునది. క్రమక్రమముగా నిలుకడచిక్కినతరువాత నియమస్థలమును వదలి పరబ్రహ్మమందే నిలుపవలెను.

"గురుసన్నిధి సాలోక్యం సామీప్యం హస్తమస్తకం
దీక్షామాత్రేణ సారూప్యం సాయుజ్యం సమరసైక్యతామ్"

గురువు చెంతకు బోవుటయెసాలోక్యమనియు, హస్తమస్తకసంయో గమె సామీప్యమనియు, త్రివిధదీక్షలు తెలిపినంతనే సారూప్యమనియు, సమరసము కలిగియుండుటయే సాయుజ్యమనియు,అదియఐక్యమనియుఁ బెద్దలుచెప్పుదురు.

అనేకులు గురువులమని పేరు పెట్టుకొని ధనమునుహరించెదరు. కావున జాగ్రతగలవారై బ్రహ్మనిష్ఠాగరిష్ఠు లగుపెద్దలచెంతఁ జేరి వారి యను గ్రహమునువడసి పరబ్రహ్మజ్ఞానసంపన్నులు గావలయును.

చ॥ అలయక సప్తవారిధుల నావలి కీవలి కొక్కరీతిగాఁ
గలయఁగ నీదవచ్చును నగంబుల నచ్చనగండ్లుగాఁగరం
బులఁగొనియాడ వచ్చు నభమున్ గబళింపఁగవచ్చుగానియి
య్యలనమనస్కయోగము గ్రహింపగరాదు దలంపనేరికిన్॥

సప్తసముద్రముల నొక్కపెట్టున నీదవచ్చును, పర్వతములను అచ్చనకాయలుగా ఆడవచ్చును, ఆకాశ మును కప్పవచ్చును, గానిఅమనస్కయోగము తెలిసికొను టతిదుర్లభము.

అని చెప్పినమాత్రముననే అతికష్టమని వదలివేయ గిట్టను. పుష్పములుగోయుటకంటెనుకన్నులు మూయుటకంటెనుఅమనస్కమార్గము అతిసులభము. తెలియనంతవఱకు కష్టమును తెలిసినపిమ్మట సులభమైనదిగా నున్నది. ఈఅమనస్కధ్యానముయొక్క మహత్త్విదని చెప్ప నలవికాదు. మనస్సును క్రమక్రమముగ స్వాధీనముచేయను యది నిలిచి వృత్తిరహితమై యమనస్కంబును పరిపూర్ణంబును అగును.

**అచలము**—పరిపూర్ణమునకే అచలమని చెప్పుదురు. సచ్చిదానంద మునకునుఅచలమునకును భేదముగ చెప్పెదరు ఏమియు భేదము కానము అచలమన్నను పరిపూర్ణమన్నను పర బ్రహ్మమన్నను మాటలభేదమేకాని అన్యమేమియు లేదు నిర్గుణ సాక్షాత్కార పరబ్రహ్మస్వరూపమునకే అచల మనిచెప్పుదురు. అచలమును బోధించు గురువులుఅచల గురువులని చెప్పఁబడుదురు. వారును మనవలెనేతినుచు న్నారు తిరుగుచున్నారని చెప్పనొప్పదు. శిష్యులనుకడ తేర్చుటకుగాను అవతరించి నారని తలంచవలెను. వారు పరిపూర్ణులేగనుక అశరీరులు బ్రహ్మవేత్తలు అని చెప్పఁ

బడుదురు. అశరీరులు అచలగురువు అని చెప్పఁబడువారి కిని శరీరము ప్రత్యక్షముగ కనుబడుచున్నదనియు వారు మోసగాండ్రనియు కొందరజ్ఞత చేతపరిహసించెదరు. వారి వారియనుభవము వారికే తెలియవలయును గాని అన్యు లకెట్లు తెలుసును. పెద్దలను సేవించి వారిసంగతిని వారి మార్గమును తెలిసికొనజాలక పరిహసించి పాపకూపార మునఁబడి చచ్చుచుబుట్టుచుండెదరు. మఱియు కొందరు సన్యాసమును తీసికొనిరనియు, వారా యాశ్రమమును తీసికొనుటకు అర్హులుగారనియు, వారలకేమియు తెలియ దనియు, సంస్కృతభాషాజ్ఞానము కొంచము కలదని యు, వాచాజ్ఞానమేకాని యనుభవము లేదనియు, సచ్చి దానందపరులనియు పరిహసించెదరు. చెరకుతిననిగాని ఆచెరకునందలి తీపి తెలియదు, చెరకును చూచినమా త్రముననే తీపిలేదని చెప్పగిట్టదు. కావున అట్టిపెద్దలకు తొందరకలుగ జేయక వారికి సంతోషమగునట్లు వినయ విధేయతలతో సంభాషించను వారానందభరితులయ్యె దరు. అప్పుడుగాని సుధ స్రవించదు. అట్టిసుధాపానము చేసినగాని బ్రహ్మానందము కలుగదు. పిమ్మట వారెంత వారయినది తెలియఁగలదు. అట్లుకాక వారిని పరీక్షిం చవలెనని వెళ్లి సంభాషించినచో, పెద్దలనెడు అద్దము నందు అజ్ఞానమువలన ఏవికారముతో మనముచూచిన, ప్రతిబింబమునకును ఆవికారమేయుండగలదు. కావున వికారములన్నియు చూచువారియందే యున్నవిగాని అద్దమునందేవికారమును లేదు. పెద్దలు మలినరహితు లనియు సంకల్పశూన్యులనియు తెలియునది.

సర్వం ఖల్విదం బ్రహ్మ.

